*Issued on 23—8—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

# OFFICIAL REPORT

*WEDNESDAY, the 7th MARCH, 1956.*

VOLUME III — No. 3.

## CONTENTS



PRINTED BY DALTON & COMPANY, MADRAS
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Wednesday, the 7th March, 1956.**

The House met in the Assembly Hall, Kurnool at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### STARRED QUESTIONS.

*Post of teachers in Aided Elementary Schools.*

448—

* 624 Q.—Sri V. VISWESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether there are any rules and regulations for the fixation of number of posts of teachers in Aided Elementary Schools of the State for purpose of assessing grants ; and

(b) if so, whether a copy of the same will please be laid on the Table of the House ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) A* copy of the Rule 4(1) (2), (3) and (4) of the rules relating to Elementary Schools is placed on the Table of the House.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, Fixation of posts అనేది ప్రతిసంవత్సరము జూన్ నెలలో జరగాలని రూల్సులో ఉన్నది. కాని యీ సంవత్సరము అది నవంబరు డిశంబరు నెలలలో జరిగి, orders communicate అయినవి. ఈ సంగతి మంత్రిగారికి తెలుసునా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఆ సంగతి నాకు యింతవరకూ తెలియదు. ఇప్పుడు గౌరవసభ్యులు చెబుతూంటే, తెలుస్తున్నది.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఇక్కడ Table మీద పెట్టబడిన రూల్సులో Rule 3 (b) లో జనవరి మొదటివారములోను, మరియు జూలై నెలలోను

---

* Vide Appendix at page 105 infra.

fix చేస్తారని తెలుపబడింది. అదేమాదిరిగా గ్రాంట్లను యివ్వడముకూడ ఆరునెలల కొకసారి యివ్వటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఆరునెలల కొకసారి యిచ్చేటట్లుగా, ముందు మనము మద్రాసు రాష్ట్రములో ఉండగానే ఆర్డర్లు ప్యాసు చేయబడినవి. దానివల్ల మూడులక్షలు ఖర్చు ఎక్కువకూడ అయింది.

Sri S. RANGANATHA MUDALIAR :—Speaker Sir, there was a proposal to take over these Aided Elementary Schools by the Government. Is that proposal going to materialise ?

Mr. SPEAKER :—That is the next question.

The Hon. Dr. B. GOPALA REDDI :—Yes. It is going to be materialised and we will have more of it in the Education Demand.

*Taking over the management of Elementary Schools by the Government.*

449—

* 752 Q.—Sri G. YELLAMANDA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government propose to take the management of all Schools (Elementary) in our State ;

(b) if so, when ; and

(c) whether those Schools taken over by the Government will be under the Taluk Council as proposed by Kuppuswamy Committee ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) and (b) The Government have since decided to take over all elementary schools in Nellore District as an experimental measure with effect from the academic year 1956-57.

(c) The answer is in the negative.

SRI B. SANKARAIAH :—అధ్యక్షా, ప్రభుత్వము తీసుకునే స్కూల్సులో అంతకుముందు పనిచేస్తున్న టీచర్లకు యిందులో employment గ్యారంటీ ప్రభుత్వము యిస్తామని హామి ఇస్తుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—సాధ్యమైనంతమటుకు వారినందరినీ తీసుకోటానికని, ఉండవలసిన qualifications అందరికీ ఉన్నవా లేవా అనేది చూచి తీసుకోవటానికే ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—నెల్లూరు జిల్లాలోని స్కూళ్లు ప్రభుత్వము తీసుకునే పక్షములో అదనపు ఖర్చు యేదైనా ఉంటుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—కొంతవరకు అవుతుంది. అందుకనే ముందు నెల్లూరు విశాఖపట్టణములోనివి తీసుకుందామని అనుకొని తరువాత అదనపుఖర్చు తగులుతుందన్న ఉద్దేశ్యమువల్ల, ముందు ఒక్క నెల్లూరు జిల్లాలోనివే తీసుకుందామని నిర్ణయించాము.

SRI V. KURMAYYA :—ప్రభుత్వము యీ స్కూల్సు తీసుకున్న తరువాత, ఆ స్కూల్సులో అదివరకు పనిచేసిన వారియొక్క services ను ప్రభుత్వం గుర్తిస్తుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇంతకుముందు పని చేస్తున్నవారి services ను గుర్తించాలనే ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ముందు నెల్లూరు జిల్లానే select చేయడములో ఏదైనా basis ఉన్నదా?

THE HON. DR. B. GOPALA REDDI :—అక్కడ ఎక్కువమంది writs కు పోతేమోనన్న ఉద్దేశ్యముకాని, దీనికివేరే basis అనేది యేమీలేదు.

SRI P. SUNDARAYYA :—ఇదివరకు రెండుజిల్లాలని యీ ఎసెంబ్లీలో చెప్పబడింది. రెండు జిల్లాలనుంచి ఒక జిల్లాకు దిగడమునకు కారణము ప్రభుత్వానికి డబ్బులేక పోవడమేనని అన్నారు. మరల జూన్, జూలై నెలలు వచ్చే టప్పటికి డబ్బులేదని యీ ఒక్కజిల్లాగూడ పోతుందా? లేకపోతే దీనితో యింకొక జిల్లా కలపటానికి ఏదైనా అవకాశము ఉన్నదా?

THE HON. DR. B. GOPALA REDDI :—బడ్జటు విషయములను అన్నీ సమీక్ష చేసుకునేటప్పుడు, ఆదాయము, వ్యయమూ, అంతా చూచుకుని, యీ రెండుజిల్లాలకు ఎంత అవుతుందో చూచుకుంటాము. తరువాత ఉండే పరిస్థితులనుబట్టి ఒకే జిల్లాలోనివి తీసుకుంటే చాలునసే ఉద్దేశ్యముతో ఒక్క జిల్లాను మాత్రమేనని అనుకున్నాము. ఒకవేళ యింకొక జిల్లాగూడ కలపవలసివస్తే, వస్తుందేమో. ఆ సంగతి యిప్పుడు ఎట్లాచేప్పేది?

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ రెండు జిల్లాలకు చేర్చి ఎంత ఖర్చు అవుతుందని సమీక్షలో తేల్చుకున్నారు? తరువాత ఒక్క నెల్లూరు జిల్లాకు మాత్రము అయితే, యెంత అవుతుందని అనుకున్నారు?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ సంగతి రేపు Education Demand వచ్చినప్పుడు చెబుతాను.

SRI P. VENKATASUBBAYYA :—Aided schools ను తీసుకునే పక్షములో teacher managers జరిపే స్కూల్సును కూడ తీసుకుంటారా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఆ విషయము వ్యక్తిగతముగా చూడవలసి ఉంటుంది. ఇందులో కొన్ని తీసుకోవచ్చు, కొన్ని తీసుకోక పోవచ్చు. కొన్ని సక్రమంగా జరిపించుచున్నవి కూడ తీసుకోక పోవచ్చు.

SRI P. SUNDARAYYA :—కుప్పుస్వామి కమిటీ రిపోర్టులో చెప్పబడినట్లుగా ఈ స్కూళ్ళు అన్నీ తాలూకా కౌన్సిల్సు క్రింద ఉంటాయా? లేక ప్రభుత్వమే వాటిని తీసుకుని, సరాసరి నడిపిస్తుందా?

THE HON. DR. B. GOPALA REDDI :— ఆ విషయములో Director of Public Instruction ఒక అభిప్రాయములో ఉన్నారు. కాని అది యింకా finalise కాలేదు. ప్రస్తుతానికి ప్రభుత్వమే తీసుకుని, తరువాత కావాలంటే జిల్లాబోర్డులకు యిస్తామా అనే ఉద్దేశ్యముగూడ ఉన్నది. డైరెక్టరుగూడ జిల్లాబోర్డులకు ఇస్తేనే మంచిదేమోనన్న అభిప్రాయములో ఉన్నారు. కాని ఆ విషయము యింకా final గా యేదీ తేల్చలేదు.

SRI P. SUNDARAYYA :—ప్రభుత్వమే తీసుకొని నడిపితే, అందులో పనిచేసే టీచర్లకు ఎక్కువగా డబ్బు ముట్టుతుంది. అందుచేత వీటిని ప్రభుత్వమే నడపటానికి ఆలోచిస్తుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—అట్లా ముట్టకుండా యింతకుముందే ఆర్డర్లు ప్యాసుచేశాము. ఇకముందు గవర్నమెంటు స్కూల్సు లోకల్ బోర్డు స్కూల్సు అనే విచక్షణ లేకుండా, అన్నీ Local Board schools అనే యింతకు ముందు ఆర్డర్సు వేశాము. కాబట్టి అటువంటి ప్రమాదము యేమీ ఉండదు.

SRI P. NARASIMHAPPA RAO :—ఇంతవరకు జిల్లాబోర్డుల క్రిందఉన్న స్కూళ్ళలో పనిచేసేవారికి సరిగా జిల్లాబోర్డులు జీతాలు యివ్వలేకుండా ఉండి, చివరకు అవి మూసివేసే పరిస్థితిలోనికి వచ్చినవి.. అలాంటప్పుడు మరల వాటిని జిల్లాబోర్డులకు యివ్వాలని ప్రభుత్వము యెందువల్ల అభిప్రాయ పడుతున్నది?

THE HON. Dr. B. GOPALA REDDI :—అవి జిల్లాబోర్డులక్రింద ఉన్నప్పటికినీ, వాటికిఅయ్యే ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. జిల్లాబోర్డులకు ఏవిధమైన liability లేదు. అయ్యే ఖర్చుఅంతా ప్రభుత్వానిదే.

SRI B. SANKARAIAH :—ప్రభుత్వము కమిటీ స్కూల్సును తీసుకోవడములేదు అనే provision ఉండడమువల్ల, ఉన్న aided schools అన్నీ కమిటీ స్కూల్సుగా మార్చుకుంటున్నారు. ఈ విషయము ప్రభుత్వము దృష్టిలో పెట్టుకుని, అటువంటి దానికి అవకాశము లేకుండా ప్రభుత్వము చేస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—కొంతకాలముగా ఆ స్కూల్సు కమిటీక్రిందఉండి, అవి సక్రమంగా నడుపబడుతున్నాయని Education authorities అనుకుంటే, అటువంటివి తీసుకోనవసరములేదు. కాని Single Teacher Management లో వున్నవి, సక్రమంగా నడపబడనివి, తీసుకోవాలని ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడు మంత్రిగారి సమాధానములో, అన్నిచోట్లలోకూడా Local Board schools అనే అన్నారు. దీనినిబట్టి గవర్నమెంటు స్కూల్సులోకూడ Local Board scales ను introduce చేసి, వారికి జీతాలు తగ్గిస్తామనేనా ?

THE HON. Dr. B. GOPALA REDDI:—గవర్నమెంటు స్కూల్సు అంటే యింతకుముందు Labour Schools అని, Fisheries schools అని ఉన్నవి. ఇకముందు వచ్చేవారికందరికి Local Board scales నే యివ్వవలసిందిగా కొంత కాలముక్రింద గవర్నమెంటు ఉత్తరువులు ప్యాసుచేశారు. కాని యిప్పుడు ఉండేవారికి వారికి యింతవరకూ వస్తున్న స్కేలు ప్రకారమే యిస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అయితే వీరిలో యీ discrimination ఎందుకు ఉండాలి ? కొంతమందికి గవర్నమెంటు స్కూల్సులో పనిచేసేవారికి ఒకరకమైన స్కేలు పెట్టడము, అదే ఉద్యోగము,

అదే పనిచేస్తున్న లోకల్ బోర్డు స్కూలులోని వారికి యింకొకరకమైన స్కేలు పెట్టడ మనేది discrimination క్రిందకురా దా ?

THE HON. DR. B. GOPALA REDDI:—కొత్తగా పనిలోనికి వచ్చే వారికి ఏ స్కేలునైనా యివ్వటానికి నిర్ణయించే అధికారము ప్రభుత్వానికి ఎప్పుడూ కూడ ఉన్నది. పాతవారికి స్కేలుమార్చితే, అప్పుడు వారికి అన్యాయము జరిగిందని చెప్పవచ్చు. కొత్తగా వచ్చేవారి విషయములో మాత్రము, మీకు యీ స్కేలు యివ్వదలిచాము, యిష్టముఉంటే, రండి, లేకపోతే పొండి అనిచెప్పే అధికారము ప్రభుత్వానికి ఉన్నది. కాబట్టి కొత్తవారికి ఏ స్కేలుఅయినా ప్రభుత్వం యివ్వవచ్చు.

SRI S. VEMAYYA :—ఇప్పుడు ప్రభుత్వం తీసుకున్న Teacher-Manager Schools విషయములో, ఆ మేనేజర్లకు ఏదైనా నష్టపరిహారముక్రింద ప్రభుత్వం యివ్వటానికి ఆలోచన ఉన్నదా ?

THE HON. DR. B. GOPALA REDDI :—దీనికోసము ఒక District Education Officerను Special officerగా నెల్లూరులో ప్రభుత్వం నియమించింది. వారు యీ విషయాలన్నీ పరిశీలన చేస్తున్నారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఈ స్కూళ్లు అన్నీ జిల్లాబోర్డు మేనేజిమెంటు క్రిందవుంటే లాభములేదని, మేనేజిమెంటులో Non-officials కూడ పాల్గొనటానికి వీలుగాను Officials కుగూడ direct గా మేనేజిమెంటుతో సంబంధము ఉంటుందనే ఉద్దేశ్యముతోను కుప్పుస్వామి కమిటీ వారు తాలూకా కౌన్సిల్సు ఉండాలని సిఫార్సుచేశారు. ఆ సిఫార్సుల ప్రకారము యీ స్కూళ్లను తాలూకా కౌన్సిల్సుక్రిందఉంచి వాటిద్వారానే నడుపుతారా ? లేకపోతే ఏమిచేస్తారో చెబుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI .—ఈ స్కూళ్లు జిల్లా బోర్డులక్రిందఉంటే ఒక సదుపాయము ఉంటుంది. Overlapping లేకుండా ఉంటుంది. అంటే ఉదహరణ చెబుతాను. ఒకే గ్రామములో జిల్లాబోర్డు స్కూలున్నూ ఉండి, అక్కడనే Aided school కూడ ఉంటే, యీ రెంటిని ప్రభుత్వము తీసుకునేటప్పుడు, అందులో ఒకటి తీసుకోవచ్చు, రెండవది abolish చేయటానికి ప్రభుత్వానికి అవకాశము ఉంటుంది. లేకపోతే ఒకటి గవర్నమెంటుది, యింకొకటి జిల్లాబోర్డుది అయినప్పుడు, గవర్నమెంటు స్కూలును ప్రభుత్వము వేరేనడపవలసి వస్తుంది. అప్పుడు చిక్కులుకూడ ఏర్పడుతాయి. తరువాత తాలూకా కౌన్సిల్సును ఏర్పాటుచేసే విషయములో ప్రభుత్వము యింకా తుది నిర్ణయమునకు రాలేదు.

*Unqualified teacher-managers in Elementary Schools of Palnad Taluk.*

450—

* 591 Q.—Sri M. NAGI REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the number of unqualified teacher-managers in Elementary Schools of Palnad Taluk, Guntur District; and

(b) the reasons for allowing them to continue ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) Three.

(b) As they are teacher-managers owning the schools and as they are appearing year after year for the T.S.L.C. Examinations to secure a pass, they are allowed to continue with strict instructions to pass the examination.

*Road from Kodumur to Yemmiganur.*

451—

* 547 Q.—Sri. C. V. SOMAYAJULU :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government have received any representation to convert the existing famine road from Kodumur to Yemmiganur into a pucca metal road and to sanction a bus route from Kurnool to Yemmiganur (via) Kodumur and Gonegundla ; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) The road from Kodumur to Gonegundla (12 miles in length) is a Government Major District Road. The portion of the road from Gonegundla to Yemmiganur is under the control of the District Board, Kurnool. Proposals to take over to Government control this portion of

the road also under the Second Five Year Plan are under consideration. As the entire road from Kodumur to Yemmiganur is not fit for bus traffic, one of the two buses plying on the route Kurnool to Kodumur has been permitted to ply upto Gonegundla only temporarily.

*Fire Station in Guntakal Municipality.*

452—

* 702 Q.—Sri M. RAJARAM and Sri S. NARAYANAPPA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government propose to open a fire station in Guntakal Municipality, Anantapur District ; and

(b) if so, when it will be started ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) "Yes Sir".

(b) "The matter is under consideration of the Government".

Government have sanctioned a fire station now and they are going to open immediately after March.

*Repairs of Veerasagaram and other tanks in Parvathipuram Taluk.*

453—

* 367-H. Q.—Sri P. GUNNAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether it is a fact that the tanks Veerasagaram, Illand[illegible]ala Cheruvu, Rasappa Cheruvu, Jamiti Reddy Cheruvu in Parvathipuram Taluk of Bobbili Estate were not repaired for the last 10 years ; and

(b) if so, whether the Government propose to sanction repairs this year ?

The Hon. Sri K. CHANDRAMOULI :—(a) and (b) These four tanks in the erstwhile Bobbili estate were in a State of disrepair and were much neglected by the landholder. Subsequent to the taking over of the estate on 7—9—1949, repairs to Veerasagaram and Illandpala tanks have been taken up and they are nearing completion. It is proposed to undertake repairs to Rachappa tank during 1956-57. The fourth tank viz., Jamitireddy tank is a small one with an ayacut of 4 acres and repairs to it have to be attended to by the ayacutdars themselves under Kudimaramath Act.

వీరసాగరం, ఇల్లిందపాల, చెరువులు రెండూకూడా మరమ్మతు చేస్తున్నారు. ఆ పనులు త్వరలోనే పూర్తి అవుతాయి. రాచప్పచెరువు 1956-57 సంవత్సరంలో మరమ్మతు చెయ్యడానికి నిర్ణయించాం. జమితిరెడ్డి చెరువు నాలుగెకరాల ఆయకట్టు కలది. అది రైతులే కుడి మరమ్మతుక్రింద మరమ్మతు చేసుకోవాలి.

*Electric works given to the Construction Engineer, at Thirupathi.*

454—

* 845-A. Q.—Sri S. VEMAYYA and Sri B. SANKARAIAH :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether it is a fact that all the sanctioned Electric works except main line in the Nellore District have been given to the Construction Engineer at Thirupathi, instead of Nellore ; and

(b) if so, the reasons therefor ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) The answer is in the affirmative.

(b) In order to enable the expeditious execution of the main lines from Nellore to Ongole and from Gudur to Naidupeta, enroute sub-stations and main telephone

lines to bring Machkund Hydro-Power, the Executive Engineer (Construction), Nellore was temporarily relieved of other distribution works in the district to enable him to concentrate ON THE MAIN LINES. The main lines have since been completed and the other distribution works have since been restored to him.

(a) ఔనండి.

(b) నెల్లూరునుండి ఒంగోలుకు, గూడూరునుండి నాయుడుపేటకు Sub-station లగుండా పోయే main line లు మాచ్‌ఖండునుండి విద్యుచ్ఛక్తిని తీసుకు వచ్చే ప్రధానమైన transmission మార్గాల నిర్మాణం త్వరగా జరిపించవలసి యుండుటచేత, నెల్లూరు నిర్మాణాల Executive Engineer గారు ప్రత్యేకంగా ఈ పనిమీద నే కేంద్రీకరించి కృషిచేయుటకు గాను, వారిని జిల్లాలలో ఉన్నటువంటి తదితర చిన్న line ల నిర్మాణంనుండి వారి బాధ్యత తప్పించడమైనది. ఈ పెద్ద line ల నిర్మాణం పూర్తియైనది. కాబట్టి తిరిగి వారి బాధ్యతలు వారికి ఏర్పాటు చేయడమైనది.

SRI. S. VEMAYYA :—తిరిగి ఈ బాధ్యత నెల్లూరివారికి వప్పచెబుతానన్నారు. ఎప్పుడు ఒప్పచెబుతారు.

THE HON. SRI G. LATCHANNA :—వప్పచెప్పడమైనది.

*Appointment of a retired Judge of the Madras High Court to the Andhra High Court.*

455—

* 780 Q.—Sri P. VENKATASUBBAIAH :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether it is a fact that a retired Judge of the Madras High Court has been appointed as a Judge in the Andhra High Court ; and

(b) if so, the reasons therefor ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) Yes Sir.

(b) On account of very heavy arrears in the Andhra High Court, the President approved the proposal of the Chief Justice to request, under Article 224 of

the Constitution, two retired Judges of the Composite Madras High Court to sit and act as Judges of the Andhra High Court. Accordingly two Judges functioned from the 7th March, 1955 till the 18th April and again from 27th June to 5th September, 1955, when one of them relinquished office. Only one retired Judge is functioning now. He is dealing with the old first and second appeals and such other cases as are entrusted to him.

The intention is that a retired Judge with his experience will be greatly helpful in clearing accumulated arrears.

*Appointment of more Judges to the High Court.*

456—

* 713 Q.—Sri E. AYYAPU REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Chief Justice of Andhra expressed the necessity to recruit few more Judges to the High Court Bench, to facilitate quick disposal of the accumulated arrears of work ; and

(b) if so, what action the Government propose to take ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) Yes Sir.

(b) The Chief Justice requested two retired Judges of the Madras High Court, under Article 224 of the Constitution with the prior approval of the President to sit and act as Judges of the Andhra High Court to dispose of pending old cases. There were two Judges till 5—9—1955 when one of them relinquished office on his appointment as a Member of the Law Commission. The second Judge still continues and the sanction in his case is till the commencement of the summer recess of

the High Court. The Chief Justice did not propose a substitute for the Judge who vacated office in September, 1955.

The Chief Justice's proposal to increase the number of permanent Judges by one is under correspondence with the Government of India.

*Recommendations of the State Government regarding the appointment of the High Court Judges.*

457—

* 871 Q.—Sri S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether this Government submitted their recommendations to the Government of India in pursuance of amendment to Article 3 of the Constitution Act, regarding the appointment of the High Court Judges ; and

(b) if so, what the recommendations are in the matter ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) No Sir.

(b) Does dot arise.

SRI P. VENKATASUBBAYYA :—హైకోర్టులో Judges గా పనిచేసి retire ఐనటువంటివారు ఆంధ్రదేశంలో లేరా ?

DR., B. GOPALA REDDI :—ఇంతకు ముందు appoint చేసిన ఇద్దరిలో ఒకరు ఆంధ్రదేశంవారే.

SRI P. BASI REDDI :—Permanent basis పైన Chief Justice ఒక Judge ని కోవాలని అడిగినట్లు గత సంవత్సరం Deputy Chief Minister గారు చెప్పారు. ఆలోచనలో ఉన్నదని సుమారు 7, 8 నెలలయిందండి. ఈ ఆలోచనలు ఎప్పుడు తెగుతాయో చెబుతారా ?

7th March 1956]

The Deputy Chief Minister was pleased to state even last year that the matter was under consideration even as far back as 9 months ago and the Hon. Chief Minister is pleased to state that the matter is still under consideration.

When is it likely to be settled Sir ?

The Hon. Dr. B. GOPALA REDDI :—It all depends upon the scrutiny of the Home Department in New Delhi and in view of the formation of Visalandhra they may not sanction the post at all.

Sri D. KONDAYYA CHOWDARY:—దాదాపు సంవత్సరం నుండి వీరిని తాత్కాలికంగా నియమించడం జరుగుతోంది. కాని Writ Petitions వేలకు వేలు పెరిగిపోతున్నాయి. Appeals వగైరాలలో చాలా delay జరుగుతుంది. కాబట్టి ఈవిషయం పునర్విచారణచేసి ప్రభుత్వం వెంటనే ఒక permanent Judgeని appoint చెయ్యడానికి ఈ ప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి సిఫార్సు చేస్తుందా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—పోయిన సంవత్సరంలో చాలాభాగం పటుకూ ముగ్గురు Judges మాత్రమే function చేస్తూవచ్చారు. ఇప్పుడు 7 గురు Judges function చేస్తున్నారు. కాబట్టి ఈ 7 గురి యొక్క disposal ఎట్లా ఉంటుందో Home Department వారు consider చేస్తున్నారు. Writ petitions 600 చిల్లర ఈ సంవత్సరం dispose of అయినవి. ఇంకా 8, 9 వందలున్నాయనుకోండి. నేను చెప్పినట్లుగా విశాలాంధ్ర వస్తున్నది. కాబట్టి అక్కడుండేటటువంటి Judges ఇక్కడుండేటటువంటి Judges ఈ విషయాలన్నీ కూడా సమన్వయంచేసుకోవలసి యుంటుందనే ఉద్దేశ్యం Home Minstryకి ఉన్నట్లున్నది.

*Sub-Court at Vizianagaram.*

458—

* 953 Q.—Sri G. SURYANARAYANA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether any representation was received from the Public of Vizianagaram area for the establishment of a Sub-Court at Vizianagaram from a long time ; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) No, Sir.

(b) Does not arise.

*Rowtalapudi Choultry lands.*

459—

* 658 Q.—Sri P. GURRAJU :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) the amount at which the Rowtalapudi choultry lands belonging to East Godavari District Board were leased out for the years 1953-54, 1954-55 and 1955-56 ;

(b) whether the whole lease amount was realised ; and

(c) if not, the action taken thereon ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The lands were leased out for Rs. 33,000 per annum for the 3 years 1953-54, 1954-55 and 1955-56.

(b) Only a sum of Rs. 45,400 was realised against the total lease amount of Rs. 99,000 for all the three years.

(c) A suit was filed against the lessee and his legal representatives for the realisation of the balance of Rs. 53,600 and the standing crops on the lands were attached before judgment. An amount of Rs. 25,000 has since been realised through the Subordinate Judge's Court, Kakinada and a further sum of Rs. 5,000 is expected to be realised shortly.

*Deposit made by the Harijans of Padapenki village for allotment of house-sites.*

460—

* 367-D. Q.—Sri P. GUNNAYYA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether it is a fact that the Harijans of Padapenki village, Bobbili Taluk deposited Rs. 1,000 for allotment of house-sites ;

(b) whether the house-sites were allotted to them ; and

(c) if not, the reasons therefor ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) The answer is in the affirmative.

(b) The answer is in the negative.

(c) The Draft Notification under Section 4 (1) and Draft Declaration under Section 6 of the Land Acquisition Act were approved on 4—1—1956 and the Collector is taking necessary action to provide house-sites to the Harijans.

(a) ఔనండి.

(b) లేదు.

(c) Draft Notification 4 (1) Sec. క్రిందనే గవర్నమెంటు 4-1-56 తేదీన ఆమోదించడము జరిగింది. కలెక్టరుగారు ఈ భూములను హరిజనులకు ఇవ్వడానికిగాను చర్య తీసుకుంటున్నారు.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, ఈ పెదపెంకి 20 సంవత్సరముల నుండి సమస్యగా ఉన్నది మంత్రిగారు గ్రామస్థులకు స్థలాలు ఇచ్చివేస్తారని చెప్పినందులకు నా హృదయపూర్వక వందనములు. రు. 1000/ Deposit కట్టినారు. వారు బీదవారు. అది refund ఇప్పించే ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఈ డబ్బు కట్టినా rules ను అనుసరించి రిఫండు కోరే గడువు తీరిపోయింది. డబ్బు lapse అయినది. ఇవ్వడం అనే సమస్య లేదు.

SRI V. VISWESWARA RAO :—పెదపెంకి గ్రామస్థులు రు. 1000 ఎన్ని సంవత్సరముల క్రిందట deposit చేసినారు ? 20 సంవత్సరాల కాలం ఎందుకు తీసుకున్నారో మంత్రిగారు శెలవిస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—ఈ స్కీము వచ్చి 20 సంవత్సరములు కాలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఈ రు. 1000 refund చెయ్యడానికి lapse అయినది అన్నారు. ఆడిటర్ జనరలుకు పంపి ఇవ్వవచ్చునుకదా ?

THE HON. SRI G. LATCHANNA :—అవకాశము చాలదు.

SRI N. K. LINGAM :—ఇండ్లస్థలములు ఇస్తామని చెప్పి హరిజనులనుండి deposit తీసుకున్నారు. అటువంటివారికి ఇళ్లస్థలములు ఇవ్వలేదు. డబ్బు వాపసు ఇవ్వలేదు. వాటిని గురించి ప్రభుత్వం ఏమి చర్య తీసుకుంటుంది ?

THE HON. SRI G. LATCHANNA:—Deposit ఇచ్చినవారికి Priority ఇచ్చి త్వరగా పూర్తి చెయ్యాలని సూచనలు అధికారులకు ఇవ్వడమైనది. ఇప్పుడు ఉన్న పరిస్థితులలో వాపసుకు అధికారము లేదు.

THE HON. SRI V. VISWESWARA RAO:—అధ్యక్షా, నేను అడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పలేదు. 20 సంవత్సరాల క్రితము డబ్బు deposit చేసేవారు ఇన్ని సంవత్సరాల వరకు పరిష్కరించకపోవడానికి కారణము ఏమిటి ? ఎందుకు ఈ కాలయాపన జరిగింది ?

THE HON. SRI G. LATCHANNA :—అప్పుడు ఉన్న పరిస్థితులనుబట్టి కాలయాపన జరిగింది. కాబట్టి emergency rules క్రింద త్వరగా ఇవ్వాలని సలహా చెప్పడం జరిగింది. డబ్బు deposit చేసినవారికి priority ఇవ్వాలని అధికారులకు సూచన చెయ్యడం జరిగింది.

SRI N. SRINIVASA RAO:—అధ్యక్షా, హరిజనులకు ఇళ్ళస్థలాలు మొట్ట మొదట ఈడబ్బు deposit విధానము మీద జరిగింది. తరువాత పూర్తిగా deposit అక్కరలేకుండా మద్రాసు ఉమ్మడిప్రభుత్వం ఉన్నప్పుడు G. C. వచ్చింది. అంతకు ముందు deposit చేసినవారికి ఇండ్లస్థలాలు ఇవ్వలేనప్పుడు కనీసము డబ్బు వాపసు చెయ్యడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇండ్ల స్థలాలు ఇవ్వకపోయి నప్పుడు ఆ సే ఆలోచన లేదు. వారికి తప్పకుండా ఇవ్వాలని ప్రభుత్వం ఆలోచిస్తు న్నది. Finalise అయినది. ఇప్పుడు డబ్బు వాపసు ఇచ్చే అవకాశములు లేవు అని ఇదివరకే మనవిచేసినాను.

SRI M. SATYANARAYANA RAJU:—డబ్బు వాపసుచెయ్యడంలో జాప్యం చెయ్యడం ప్రభుత్వంవారి లోపము. కాబట్టి orders సవరించి, వాపసు ఇవ్వడానికి అవకాశము కల్పిస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—డబ్బు వాపసు సమస్య లేదు. తొందరగా పూర్తిచేసే కార్యక్రమము ఉంది ఈనాడు.

Sri S. VEMAYYA :—Lapse అయినదని అన్నారు మంత్రిగారు. Refund కోసము apply చేసుకోనక పోవడము వల్లనా లేక ప్రభుత్వం disperse చెయ్యడములో ఆలస్యం వల్లనా ?

THE HON. SRI G. LATCHANNA :—డబ్బు వాపసు కావలెనా అనేసరికి deposit lapse అయినది అప్పుడు ఉన్న rules ప్రకారము.

*Appointment of Deputy Tahsildar in Guntakal Municipality.*

461—

* 975 Q.—Sri M. RAJA RAM :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government have received mahajor from M. Rajaram, M.L.A., regarding the appointment of Deputy Tahsildar in Guntakal Municipality to finalise the pending house-site applications ; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) The Hon. member has already been informed that the question of assignment of house-sites in the Guntakal Municipality is under the consideration of the Collector and that the Question of sanctioning special staff for the purpose will be considered by the Government when proposals in this regard are received from the Collector.

Sri M. RAJARAM :—మంత్రిగారు సెలవిస్తూ Collector గారి రిపోర్టు రాలేదన్నారు. 1931 సంవత్సరంనుండి మ్యునిసిపాలిటీలో పట్టాలు ఇవ్వడములేదు. పేదవారు కొట్టాలు కట్టుకోడానికి అవస్థలు పడుతున్నారు. కాబట్టి తొందరలో వాటినిఇచ్చే ఏర్పాటుచేస్తారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—దానిని గురించి పోకుండా చూచినాను. సర్వేకూడాఅయినది చాలా భాగము ఇప్పుడు. Assistant Director of Survey and Land Records అక్కడి విషయాలు Up to date చెయ్యవలెనని instructions పంపాము. కలక్టరునుకూడ remind చేశాము.

[7th March 1956

SRI PRAGADA KOTAIAH :—ప్రతి మ్యునిసిపాలిటీలో house-sites వ్యవహారము చాలా కాలముగా పరిష్కారము కాకుండా ఉన్నది. మొత్తము ఈ సమస్యను పరిష్కరించడానికి Special staff వేస్తుందా ప్రభుత్వము ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరే ప్రశ్న వెయ్యండి.

*Location of a Police Station at Vanavole.*

462—

* 982 Q.—Sri P. VENKATARAMANAPPA :—Will the Hon the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government propose to locate a Police Station at Vanavole, Hindupur Taluk ; and

(b) if so, when ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) No, Sir.

(b) Does not arise.

SRI P. VENKATARAMANPPA :—ఈ ప్రదేశము అడవిప్రాంతము ఇచ్చట illicit distillation ఎక్కువగా జరుగుతున్నది. త్వరలో పోలీసుస్టేషను ఏర్పాటు చెయ్యడానికి మంత్రిగారు ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Illicit distillation ఒక్కటే కారణముఅయితే కొన్నివేల ఎక్కువ పోలీసుస్టేషన్లను open చెయ్యవలెను. అది ఒక్కటే కారణముకాదు. క్రైము ఎక్కువగాను, తాలూకాలో పరిస్థితులు అంత ఎక్కువ ప్రమాదకరముగాను ఉన్న ప్రాంతాలుకావు. ఏ విధముగా ఉన్నవో తెలుసుకొన్న తరువాత తప్పకుండా ఆలోచించి పరిశీలన చేస్తాము.

*Relief to the flood affected area in Nandikotkur Taluk.*

463—

* 724 Q.—Sri E. AYYAPU REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether any representation for relief to the flood affected area in Nandikotkur taluk was made to the Government ; and

(b) if so, whether any relief has been granted ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) It has been reported that no house had collapsed and that there was no loss of crops except in small extents in Siddeswaram and Madugula villages. As there was thus no great calamity, instructions were issued for the grant of takkavi loans liberally to the ryots whose crops were reported to have been damaged in Siddeswaram and Madugula villages. Collector of Kurnool has also been instructed to take up with the Highways Department the question of attending to the damages caused to roads as they are maintained by that Department.

Sri E. AYYAPU REDDI :—

May I know, Sir, which Revenue Officer visited these Villages first ?

THE HON. SRI K. CHANDRAMOULI :—తాహసీల్దారుగారు, Deputy Collector.

Sri E. AYYAPU REDDI :—May I inform the Government that these Officers were not able to visit all these villages. Their information is based merely on hearsay and the Collector also when referred to was not in a position to go and inspect these villages.

Mr. SPEAKER :—You cannot help it. You have to accept that statement.

THE HON. SRI K. CHANDRAMOULI :—Hearsay వల్ల మాత్రం జరిగిందికాదు. వారుకూడా చూచివచ్చి రిపోర్టుపంపారు. కలక్టరుగారు మాత్రం వెళ్లలేదు. ఉన్న రిపోర్టుప్రకారము అక్కడ అక్కడ damage జరిగింది. ఆయాచోట్ల ఆరెండు అయినారు. అంతేగాని houses అవీ collapse అయినట్లు గాని, పూర్తిగా పడిపోయినట్లుగాని రిపోర్టులేదు.

Mr. SPEAKER :—We can't help it. We have to accept their statement.

Sri E. AYYAPU REDDI:—ప్రభుత్వంవారు ఇప్పటికైనా Officerను వేసి తణిఖీచేస్తే చెడిపోయినఇళ్లు, చెడిపోయిన చేలు, గుడిసెలు ఇప్పటికీ నిదర్శనముగా కనబడుతవి ప్రభుత్వంవారు ఇంకో ఆఫీసరును వెయ్యడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కొస్తో, కూస్తో damage జరిగిన విషయము నిజము, మొత్తంమీద పడిపోయినట్లులేదు. ఆలోచించమంటే ఆలోచిస్తాను. వేరే enquiry అవసరములేదు

*Construction of a building for the location of Sub-Court at Kurnool.*

464—

* 710 Q.—Sri E. AYYAPU REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government have sanctioned the construction of a building for locating the permanent Sub-Court at Kurnool ;

(b) if so, the amount sanctioned and when the work is likely to be taken up ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) Yes, Sir.

(b) Rs. 65,000.

The execution of work is deferred for the present in view of the likely changes due to the States Reorganisation Commission proposals.

*Appointment of a new Trustee to Sri Antarvedi Narasimha Swamy Devasthanam.*

465—

* 351 Q.—Sri A. VENKATRAMA RAJU :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government propose to appoint a new Trustee to Sri Antarvedi Narasimha Swamy Devasthanam ; and

(b) the reasons for appointing only one Trustee where there were 3 Trustees in the Devasthanams previously ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) No, Sir.

(b) There was only one hereditary trustee to this temple prior to the commencement of the Hindu Religious and Charitable Endowments Act, 1951 (Madras Act, 1951). He is being continued even after the commencement of the Hindu Religious and Charitable Endowments Act, 1951.

SRI B. SANKARAIAH :—Temples ను గురించి విచారణ చేయుటకు నియమించిన కమిటీ hereditary trusteesను గూడ మార్పు చేయవలసిందని సూచనలు యిచ్చింది. వాటిని ప్రభుత్వం ఎప్పుడు అమలు జరుపబోతూ వుంది ? వాటినికూడా స్కీముక్రింద తీసుకురావాలని ప్రభుత్వం అంగీకరించినదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—కొత్తగా నియమించిన కమిటీ భూములు స్వాధీనం చేసుకోవటానికి వాటి విషయంలో ఈట్రస్టీగారును యీ question వేసే సభ్యులుగారును మెంబర్లుగానే ఉన్నారండీ.

*Free education scheme in the Middle and High Schools in the State.*

466—

* 305 Q.—Sri P. GOPALU REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

Whether there is a proposal to implement the free education scheme in the Middle and High Schools in the State, as it was done in Madras State for Forms I to III ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

The proposal was considered by the Government and deferred.

Sri P. SUNDARAYYA :—ఎందుకు ఆపుచేశారండి?

THE HON. DR. B. GOPALA REDDI :—మీరు Budget అంతా చూచి ఎందుకని అప్పుచేశారని అడిగితే ఎట్లా? రామాయణం అంతావిని సీత ఎవరికి భార్యఅన్న మాదిరిగా వుంది.

SRI P. SUNDARAYYA :—Budget అంతా చూశాను కాబట్టే అడుగుతున్నాను. 3 వ form వరకే కాకుండా School Final వరకు ఉచితంగా చెప్పేదానికి అవకాశాలున్నాయి. అందుచేత ఈ అవకాశాల విషయమై తిరిగి ఆలోచిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :—అలా ఉచితవిద్య గరపడంవలన 15 లక్షల రూపాయలు అధికంగా వ్యయం అవుతుందని గవర్నమెంటు వారికి లెక్కలు వచ్చినవి. ఆ 15 లక్షల రూపాయలు ఎక్కడనుంచి సంపాదించవలెనో ఆలోచిస్తున్నాం. అదేదన్నా జరిగితే అమలులో పెట్టడానికి ప్రయత్నం జరుగుతుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Higher Elementary Schools అన్నీ దాదాపు తీసి పారేయాలని చెప్పి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు. Higher Elementary Schools అన్నీ middle schools గా convert చేసేదానికి ఆలోచించమని director పాఠశాలలకు సర్క్యులర్ ఇచ్చారు. ఈ సందర్భంలో 8th standard వాళ్లంతా 3rd Form వాళ్లు అయిపోతారు. అందువల్ల కుప్పుస్వామికమిటీ సూచనల ప్రకారం వాళ్లకు free education లభించదు గనుక, ఆ ఎలిమెంటరీ స్కూల్సునే ఉంచమన్నారు. ఇప్పుడు Secondary Schools కు వాళ్లను పంపిస్తున్నప్పుడు "Constitution" లోకూడా 12 సంవత్సరములవరకు free education యివ్వమని చెప్పియున్నది. అందువల్ల 3 rd Form వరకు అయినా free education కల్పించం యేర్పాటు చేస్తారా?

THE HON. DR B. GOPALA REDDI :—Higher Elementary Schools ను middle schools గా చేయాలనే నిర్ణయాన్ని గవర్నమెంటు వారు యింకా తీసుకోలేదు. కొంతకాలం Higher Grade Schools, Higher Grade Schools గానే ఉంటాయి. అవన్నీ middle schools కావు. తర్వాత కుప్పుస్వామి కమిటీవారు చేసినారు అంటే వారు చాలా చెప్పుతుంటారు. వారికి ఆర్థిక వ్యవహారం యేమీ బాధ్యతలేదు కాబట్టి.

Sri S. NARAYANAPPA :—1 వ ఫారంనుంచి 3rd Form వరకు ఆడపిల్లలకు ఉచితంగా విద్యాసౌకర్యం ఏర్పాటు చేస్తున్నారు. ఆ విధంగానే

వెనుకబడిన జాతులవారందరికి సౌకర్యం చేసేదానికి ప్రభుత్వంవారు ఆలోచిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :—వెనకబడ్డ జాతులవారికి half fee concession ఉంది. Full fee సంగతివారు అడుగుతున్నా రిప్పుడు. అది కొంచెం దీర్ఘంగా ఆలోచించాలి.

SRI B. APPA RAO :—ఢిల్లీలో ఉన్నటువంటి ఆంధ్రులకు విద్య విషయంలో ఆంధ్రప్రభుత్వం కొంత grant యిచ్చింది. కలకత్తా, జెమ్షెడ్‌పూరు, ఖరగ్‌పూరులనుంచికూడా నివేదికలొచ్చాయి. అభ్యర్థనలు వచ్చాయి. వారిఅభ్యర్థనలను పాటిస్తారా ?

Mr. SPEAKER :—That is a separate question. Please put a separate question.

SRI P. VEMAYYA :—కుప్పుస్వామి కమిటీ వారు సిఫారసు చెయ్యడంలో బాధ్యత అంతగా పెట్టుకోకుండా చేశారన్నారు మంత్రిగారు. అందులో డబ్బువచ్చే విధానంకూడా వారు చూపించారు. కాబట్టి దాన్ని అమలుపరచి, 1 వ ఫారంనుంచి 3 వ ఫారంవరకు ఉచితంగా విద్యగరపడానికి ప్రభుత్వం పూనుకొంటుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—అదే యిప్పుడు నేను చెప్పినానుగదా ? ఆ 15 లక్షల రూపాయలు ఎట్లా సంపాదించాలనో ఆలోచిస్తున్నాము. అదేదన్నా జరిగితే తప్పకుండా ప్రయత్నిస్తాం.

SRI P. GOPALU REDDI :—అధ్యక్షా, యీ concession యివ్వడానికి ప్రస్తుతం ఆర్థికపరిస్థితులు సరిగాలేవని చెప్పుతున్నారు మంత్రిగారు. మరలయేదైనా నూతనంగా tax propose చేసేటప్పుడు అయినా దీనిని ఆలోచిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :— తప్పకుండా ఆలోచిస్తాం.

SRI M. SATYANARAYANA RAJU:—3rd Form వరకు school fee లేకుండా విద్య చెప్పాలి అంటే 15 లక్షలు కావాలి అని మంత్రిగారు సెలవిచ్చారు. ఇప్పుడు College Education లో 15 లక్షల రూపాయలు తగ్గించారు. కాబట్టి ఆ 15 లక్షలు దీనిక్రింద ఖర్చుపెట్టి free scholorship లో 3rd Form వరకు చెప్పించేదానికి ప్రయత్నిస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఏమీ తగ్గించలేదు. ఆ విషయాలన్నీ 13 వ తేదీకి Education Demand క్రింద మాట్లాడు కొందాం.

SRI PRAGADA KOTAIAH :— అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు చెబుతూ, కుప్పుస్వామి కమిటీ ఏదో బాధ్యత లేకుండా చెప్పిందన్నారు. ఇక ముందు వేసే కమిటీలలోనయినా బాధ్యతగా వ్యవహరించే సభ్యులను వేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—కాదు, వాళ్లు చెప్పవల సింది వారు చెప్పినారు. వాళ్లకు financial considerations అక్కరలేదు. ఏది బాగుంటుంది అనే విషయాన్ని వారు పరిశీలించి చెప్పారు. వాళ్లు అది చెప్పవల సిందే. కాని administrative గా అన్నివిధములైన పరిశీలనలు మనం చేసు కోవాలి. కేవలం ఏదిఉంటే బాగుంటుంది అనే రకంగా కాకుండా అన్నిపరిస్థితులు గమనించాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU .—Financial Considerations కూడా దృష్టిలో పెట్టుకొనే కుప్పుస్వామికమిటీ recommen- dations చేసిందన్న విషయం ఆర్థిక మంత్రిగారు గుర్తిస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI ;—I am not yet fully convinced about it.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఆర్థికమంత్రి గారు ఆ రిపోర్టు చదివి పూర్తిగా convince అవుతారా?

THE HON. DR. B. GOPALA REDDI :—నేను చదివాను. నేను యింకా convince కాలేదు.

SRI P. CHENGALRAYA NAIDU :—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు, committee వారు ఏదో వారు చెప్పవలసింది చెప్పారు. అయినా ఆర్థికపరిస్థితులను బట్టి మేము అది అంతా అమల్లో పెట్టేదానికి లేదన్నారు. ఇకమీద వేసే కమిటీలో నన్నా ఆర్థిక స్థితిగతులు తెలిసినవారిని కొందరిని మిగతా యీ కమిటీలను గురించి తెలిసినవారిని కొందరిని వేసి రెండూ సమన్వయించే కమిటీలను వేస్తారండీ?

MR. SPEAKER :—అది వేరేవిషయం. వేరేప్రశ్న వెయ్యండి కమిటీల గురించి.

*Education facilities to the Children of poor people.*

467—

* 133 Q.—Sri P. HANUMANTHA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state ;

(a) whether the Government propose to give educational facilities to the children of poor people in all castes without distinction and thus establish the socialistic pattern of society ; and

(b) if so, the steps taken therefor ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) and (b) The proposal was considered by the Government and was deferred.

SRI S. VEMAYYA :—మొన్ననే budget లో మద్రాసు రాష్ట్రం వాళ్లు S. S. L. C. వరకు చిన్నఉద్యోగస్థుల, N. G. Os పిల్లలకు free-education యివ్వాలని నిర్ణయించారు. ఆవి పురస్కరించుకొని మన ప్రభుత్వం త్వరగా అటువంటి విధానాన్ని అనుసరించడానికి ప్రయత్నిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—నేను యిందాక ముందు ప్రశ్నకు సమాధానం చెప్పినానే, ఆ సమాధానమే దీనికికూడా వర్తిస్తుంది.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, Backward classes కు education facilities ఇచ్చే విషయంలో వాళ్లకు ఎంత income వస్తుంది అనే విషయాన్ని ఈప్రభుత్వం consider చేస్తున్నారా ? income limit ఏమైనా fix చేసినారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అందరికీ ఉన్నది. Backward classes, Harijans అందరికీకూడా ఇంత ఆదాయంకన్నా ఎక్కువరానివాళ్ళకే యివ్వమని రూల్సులోఉన్నది. వాళ్లు తహసీల్దారుదగ్గరనుండి certificates తీసుకొస్తారు.

## II. MOTION UNDER RULE 22 OF THE ASSEMBLY RULES.

*Budget for* 1956-57—*Revision of the order of Demands for Grants.*

The Hon. Dr. B. GOPALA REDDI :—Sir, I move—

"That under Rule 22 of the Assembly Rules, the demands for Grants for the year 1956-57 be taken in the following order :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | Demand No. | IX | ... | Heads of States, Ministers and Headquarters Staff. |
| 2. | ,, | X | ... | State Legislature. |
| 3. | ,, | XV | ... | Education. |
| 4. | ,, | I | ... | Land Revenue. |
| 5. | ,, | XXXIII | ... | Compensation to Zamindar. |
| 6. | ,, | XI | ... | District Administration and Miscellaneous. |
| 7. | ,, | XII | ... | Administration of Justice. |
| 8. | ,, | XIII | ... | Jails. |
| 9. | ,, | XIV | ... | Police. |
| 10. | ,, | VIII | ... | Irrigation. |
| 11. | ,, | XXXIV. | | Capital Outlay on Irrigation. |
| 12. | ,, | XXXVIII. | | Capital Outlay on Multipurpose River Schemes. |
| 13. | ,, | XXII | ... | Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes. |
| 14. | ,, | XXIV | ... | Civil Works—Works. |
| 15. | ,, | XXV | ... | Civil Works—Establishment and Tools and Plant. |
| 16. | ,, | XXXIX. | | Capital Outlay on Civil Works. |
| 17. | ,, | XXVII | ... | Electricity. |
| 18. | ,, | XL | ... | Capital Outlay on Electricity Schemes. |

| | | | |
|---|---|---|---|
| 19. | ,, | XXVI ... | Civil Works—Grants-in-Aid. |
| 20. | ,, | XX ... | Co-operation. |
| 21. | ,, | XVI ... | Medical. |
| 22. | ,, | XVII ... | Public Health. |
| 23. | ,, | XXXV ... | Capital Outlay on improvement of Public Health. |
| 24, | ,, | XXI ... | Industries. |
| 25. | ., | XXXVII. | Capital Outlay on Industrial Development. |
| 26. | ,, | XXIII .. | Labour including Factories. |

and the remaining Demands will be teken up for discussion in the order given in the Notice of the list of Demands dated 27th February, 1956 already circulated, excluding the Demands mentioned above."

Sri PRAGADA KOTAIAH :—ఏఏ డిమాండుకు ఎన్నెన్ని గంటలో చెబుతారా ?

THE HON. DR B. GOPALA REDDI :—ఆ విషయం ఎసెంబ్లీ ఆఫీసువారు తెలియజేస్తారు.

Mr. SPEAKER :—The question is—

"That under Rule 22 of the Assembly Rules. the demands for Grants for the year 1956–57 be taken in the following order :

| | | | |
|---|---|---|---|
| 1. | Demand No. | IX ... | Heads of States, Ministers and Headquarters Staff. |
| 2. | ,, | X ... | State Legislature. |
| 3. | ,, | XV ... | Education. |
| 4. | ,, | I ... | Land Revenue. |
| 5. | ,, | XXXIII. | Compensation to Zamindars. |
| 6. | ,. | XI ... | District Administration and Miscellaneous. |
| 7. | ,, | XII ... | Administration of Justice. |
| 8. | ,, | XIII .. | Jails. |
| 9. | ,. | XIV ... | Police. |

| | | | |
|---|---|---|---|
| 10. | ,, | VIII ... | Irrigation. |
| 11. | ,, | XXXIV... | Capital Outlay on Irrigation. |
| 12. | ,, | XXXVIII. | Capital Outlay on Multipurpose River Schemes. |
| 13. | ,, | XXII ... | Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes. |
| 14. | ,, | XXIV ... | Civil Works—Works. |
| 15. | ,, | XXV ... | Civil Works—Establishment and Tools and Plant. |
| 16. | ,, | XXXIX ... | Capital Outlay on Civil Works. |
| 17. | ,, | XXVII ... | Electricity. |
| 18. | ,, | XL ... | Capital Outlay on Electricity Schemes. |
| 19. | ,, | XXVI ... | Civil Works—Grants-in-Aid. |
| 20. | ,, | XX ... | Co-operation. |
| 21. | ,, | XVI ... | Medical. |
| 22. | ,, | XVII ... | Public Health. |
| 23. | ,, | XXXV ... | Capital Outlay on improvement of Public Health. |
| 24. | ,, | XXI ... | Industries. |
| 25. | ,, | XXXVII. | Capital Outlay on Industrial Development. |
| 26. | ,, | XXIII ... | Labour including Factories. |

and the remaining Demands will be taken up for discussion in the order given in the Notice of the list of Demands dated 27th February, 1956 already circulated, excluding the Demands mentioned above."

The motion was carried.

SRI P. NARASIMHAPPA RAO :—Industries మంత్రిగారు లేరు. ముఖ్యమంత్రిగారు విని సంతృప్తిపరుస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—కట్టకడపటగా పెట్టాము. వారు వస్తారేమోనని ఆశిస్తున్నాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—S.R.C. Report మీద నెహ్రూగారు Statement ఇచ్చారు. Bill వచ్చిందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఢిల్లీనుంచి పంపినట్లే కనిపించలేదు.

SRI B. RAMAKRISHNA REDDI :—5 నిముషాలేఇస్తే ఏమిచెప్పకోగలము 10 నిమిషాలైనా ఇవ్వాలి.

MR. SPEAKER :—8 నిముషాలు పెట్టాము. ఆత్యవసర పరిస్థితులలో కొంచెం relax చేస్తాము.

[Note :—An asterise * at the commencement of a speech denotes revision by the Member.]

## III. GBNERAL DISCUSSION ON THE BUDGET FOR THE YEAR 1956-57.

SRI K. VENKATARATNAM :—అధ్యక్ష మహాశయా, ఈనాడు మనముందు ప్రవేశపెట్టిన బడ్జెటు 1954-55 సంవత్సరాలలో వచ్చినటువంటి లోటును తగ్గించి 1956-57 సంవత్సరానికి 3 కోట్ల 24 లక్షల రూపాయల లోటుతో బడ్జెటును ప్రవేశపెట్టినందుకు ఆర్థికశాఖామాత్యులగు ప్రధాన మంత్రిగారిని అభినందింపక తప్పదు. రెండవ పంచవర్ష ప్రణాళికలో దేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దడానికి అన్నిరాష్ట్రాలలోను దాదాపు, ఏ ఒకటో రెండో తప్ప, లోటుబడ్జెటులనే ప్రవేశ పెట్టినాయి. మన రాష్ట్రంలో మన ముందు ప్రవేశపెట్టిన యీ లోటు బడ్జెటు ముందుకుపోకుండా, డిమాండులతో కేటాయించిన ఖర్చులు చూస్తే చాలా వెనుకకు లాగినట్లే ఉన్నది కాని ముందుకు పోలేదు. దేశం అంతా కావాలనే electricity కి ఈ సంవత్సరం 50 లక్షలు రూపాయలు తక్కువ చూపెట్టారు. నీటిపారుదలకు సంబంధించిన పద్దులలో గత బడ్జెటు మొత్తమునే చూపించారు కాని ఒక్క అడుగుకూడా ముందుకు పోలేదు. కారణం అర్థంకావడం లేదు. దేశంలో రెండవపంచవర్ష ప్రణాళికలో అన్నిరాష్ట్రాలు ముందుకుపోవుచున్నటుల స్పష్టముగా కనబడుతోంది. అదేవిధంగా మన రాష్ట్రంలో బడ్జెటు ముందుకు పోతుందనుకుంటే

Sri K. Venkatarathnam] [7th March 1956

ఆ విధంగా అనుకోడానికి వీలులేదని బడ్జెటుచూస్తే తెలుస్తుంది. పైపెచ్చు మరొకటి చేశారు. ప్రభుత్వ High Ways, National High Ways రోడ్లు ప్రధానంగా ప్రభుత్వం బాధ్యతపొందవలసిన రోడ్లకు—మరమ్మతులుకోసమైనా సొమ్ము కేటాయించకుండా ఉండడం విచారకరం. National High Ways లో కొన్నిచోట్ల ఎంతోకాలంనుంచి మరమ్మతులు జరపవలసినవి ఉన్నవి. విజయవాడ-జగ్గయ్యపేట రోడ్డు National High Ways, దీనికి Central Government Grant ఇస్తున్నది. బస్సులు, లారీలు, రెండెడ్ల బండ్లు నడవడానికి వీలులేని పరిస్థితిలో చెడిపోయి ఉన్నది. దీనికి ప్రకాశం గవర్నమెంటు కాలం నుంచి నేటి వరకు మరమ్మతు అయినా పూర్తికాలేదు. అంటే అక్కడ జరుగుతుండే ప్రమాదాలను ప్రభుత్వంవారు చూస్తున్నారో లేదో చెప్పడానికి వీలులేకుండాఉన్నది. Highways రోడ్లు ఉన్నాయంటే వాటిని Provincial Government వారు బాధ్యత తీసికొని మరమ్మత్తు చేయవలసి యున్నది ఇటువంటి బాధ్యత తీసుకోవలసిన రోడ్ల మరమ్మతుల విషయమై కూడా ఒక దమ్మిడీకూడా చూపించలేదు. M. H. రోడ్డు 22 వ మైలు దగ్గరనుంచి 25 వ మైలు వరకు వుయ్యూరు పంచదార ఫ్యాక్టరీ ఏరియాకు సంబంధించిన ఆ రోడ్డుమీద ఒక బస్సు కాని, లారీ కాని, బండికాని వెళ్లడానికి వీలులేని పరిస్థితిలో చెడిపోయిఉన్నది. Sugar Factory నుంచి Central Governmentకు ఎంతో ఆదాయం వస్తున్నది. చెరకు నుంచి వసూలయ్యే cess లో Provincial Government కు కూడా ఆదాయం వస్తోంది. జిల్లాబోర్డు రోడ్లను బాగాచేయడం, చేయకపోవడం అట్లాఉంచి, ప్రభుత్వం బాధ్యత వహించవలసిన నేషనల్ హైవేసు-ప్రొవిన్షియల్ హైవేస్ రోడ్లు చెడు స్థితిలో ఉన్న రోడ్లకు మరమ్మతు చేయడానికి ఒక దమ్మిడీ అయినా చూపించ లేదు. ఈ మరమ్మతులను ఇట్లా వాయిదావేసే పక్షంలో ఈ సంవత్సరం రు 100 లు తో పూర్తికావలసిన మరమ్మతులకు వచ్చే బడ్జెటు సంవత్సరంనాటికి రు 1000 లు కేటాయించవలసి ఉంటుంది. బడ్జెటులో హెచ్చులోటు లేకుండా సరిపెట్టాలనే చూస్తారు కాని అభివృద్ధి సంగతి కొంచెము కూడా చూడలేదు. రెండవ పంచవర్ష ప్రణాళిక రాబోతోంది. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చూపించవలసిన బాధ్యత ఉండగా వాటిని చూపకపోగా వెనుకకు పోయేవిధంగా చూపెట్టారు. ఈనాడు పన్నులు వేయకుండా తప్పినదాఅని అడుగుతున్నాను ? వేస్తున్నారు. వేసినపుడు ఇంకా ముందుకు నడవండి, అదనంగా కొత్తపనులు నిర్మాణాలు చూపించండి. అట్లా కాకుండా వెనుకకులాగే బడ్జెటుతో సరిపెడితే ఎదుగా బొందుగా కాని బడ్జెటు మాత్రమే కాకుండా వెనుకకులాగే బడ్జెటు అవుతుంది. జిల్లాబోర్డుల సంగతి తీసుకుంటే వాటికి మోక్షమేలేదు. మూడు

సంవత్సరాలనాడు జిల్లాబోర్డులు Special officers చేతుల్లోనికి పోయినాయి. ఇంతవరకు రోడ్ల maintenance కు ఒకరూపాయికూడా వినియోగించడంలేదు. Special officers మాకు సంబంధంలేదన్నట్లుగా ఉంటున్నారు. Local Boards Minister గారు ఏమిచెప్పారు ? జిల్లాబోర్డులు తనకు సంబంధించిన రహదారులు మరమ్మతులైనా చేయలేనిస్థితిలో ఉండడం శోచనీయమైన విషయం. బోనకల్లు జగ్గయ్యపేట రోడ్డుఉన్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో మునియేరు మీద బ్రిడ్జి కట్టాలని allotment చూపించారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలము అయిదు సంవత్సరములు దాటిపోయి రెండవ పంచవర్ష ప్రణాళిక వచ్చినప్పటికి మునేరుమీద వంతెన కట్టుటకు ఒక్క రూపాయికూడా కేటాయించలేదు. దానిక్రింద క్రితము సంవత్సరము 10 వేల రూపాయిలు కేటాయించి పనిమాత్రము ఏమీ జరుపలేదు. ఈ సంవత్సరము అదికూడా కేటాయించలేదు. బడ్జటులో లోటుఉన్నదని చెబుతూ ఆ లోటును భర్తీచేసేందుకే ప్రయత్నము చేసినారుగాని, ప్రజలకు కావలసిన పనుల విషయం ఏమీ ఆలోచించలేదని మనవిచేస్తున్నాను. అందువల్ల ఈ విషయంలో ముఖ్యమంత్రిగారు, దానికి సంబంధించిన శాఖాధిపతి అయినటువంటి హైవేస్ మంత్రిగారు తగిన శ్రద్ధతీసుకొని తప్పకుండా ఆలోచించాలని కోరుతున్నాను.

ఎన్నో వేలకొలది ఎకరాలను ముంచి నాశనము చేస్తున్నటువంటి బుడమేటికి రిజర్వాయరు కట్టుటకు ఎస్టిమేట్లువేసి వేసి కేంద్రానికి పంపించారు, కేంద్ర ప్రభుత్వంవారు ఒకకోటి రూపాయలపైబడి మొత్తమును శాంక్షనుచేశారు. అయినా బుడమేటి రిజర్వాయరుపని ఇప్పటికి ఆగిపోయినట్లు తెలుస్తున్నది. అక్కడఉన్న డైవర్షన్ కెనాల్‌ను త్రవ్వుతున్నామని, కరకట్టలు వేస్తున్నామని అంటున్నారేగాని, అసలు రిజర్వాయరును ఎందువల్ల అపవలసివచ్చిందో నాకు అర్థము కావడములేదు. దాని విషయం ఈ బడ్జటులో ఎక్కడా కనిపించడములేదు. ఈ రిజర్వాయరు పనిని ఎందుకు ఆపినారో కేంద్రప్రభుత్వ ఇంజనీయర్లకుకూడా అనుమానంగా ఉన్నది. రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వమువారు దానికిఇచ్చిన మొత్తమును వినియోగించుకొని, ఇంకా అదనంగా ఖర్చుపెట్టవలసియుండగా ఎందుకు దానిని ఆపినారో తెలియకుండా ఉన్నది. మన బడ్జటులో లోటుఉన్నా ప్రజలకు కావలసిన అత్యవసర పనులనుచేస్తూ మన ప్రధానమంత్రిగారు సాహసంతో ముందడుగు వేయాలి. అట్లా ముందడుగు వేయకుండా లోటునుమాత్రం పూడ్చుటకు ప్రయత్నముచేశారు. లోటునుపూడ్చి తక్కువకోటాలో బడ్జెటును పెట్టినందుకు సంతోషమేగాని దానివల్ల కించెత్తు ఉపయోగముకూడాలేదు. ఈనాడు మనము ప్రజలవద్దకువెళ్ళి వారికి కావలసిన సౌకర్యములన్నీకూడా కలిగించి వారిమీద ఇంకా అదనంగా పన్నులు

వేసినట్లయితే సంతోషంగా, హృదయపూర్వకంగా ఆ పన్నులన్నింటిని ఆమోదిస్తారు. ఈనాడు రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద యీ సంవత్సరానికి తక్కువ మొత్తమును బడ్జెటులో కేటాయించారు. ఆ కొద్ది మొత్తమువల్ల ప్రయోజనము లేదంటున్నారు. ఒక్క అడుగు ముందుకు పోకుండా మనము కాలము వెళ్లబుచ్చుతుంటే రెండవ పంచవర్ష ప్రణాళిక అర్థము ఏమిటని అడుగుతున్నాను ? మరమ్మతులు లేనందున ఈనాడు రహదార్లు, వంతెనలుఅన్నీ పాడయ్యేస్థితిలో ఉన్నాయి. ఇటువంటివన్నీ కూడా ఆలోచించి బడ్జటులో లోటుఉన్నా, దానిని సరిపెట్టుకుంటున్నా, ప్రజలకు కావలసిన సౌకర్యాలు చేయవలసిందని మనవిచేస్తూ ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

* Sri B. RAMAKRISHNA REDDI :—అధ్యక్షా, ఈ బడ్జటు పాతధోరణిలో ఉన్నదేగాని, ఇంతలో మార్పుఏమీలేదని, చాలా నిరుత్సాహంగా ఉన్నదని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను. దీనిని పూర్వము బ్రిటీషు వారు తయారుచేసే బడ్జటు మాదిరిగానే తయారుచేశారుగాని, స్వరాజ్య పద్ధతులకు అనుగుణంగా తయారుచేయలేదని చెప్పవలసి వస్తున్నది. గ్రామ పంచాయితీల విషయము ఈ బడ్జటులో చెప్పలేదు. ఈ బడ్జటుఅంతా కొన్ని అంకెలతో నింపి, ఈ మొత్తమును దీనిక్రింద ఖర్చుచేస్తున్నాము అని చెప్పుకునేందుకు వీలుగా ఉన్నదిగాని, ప్రజల సౌకర్యాల నిమిత్తం తయారుచేసినది అనడానికి వీల్లేదు.

మనదేశంలో 10 కోట్ల రూపాయిలవరకు అనవసరంగా పరిపాలనా సిబ్బందికొఱకే వినియోగిస్తున్నారు. ఇప్పుడుఉన్న పరిపాలనా సిబ్బంది అంతాకూడా బాగా లంచగొండి తనమును మరగిపోయి ఉన్నారు. దీనిని తొలగించాలని మనప్రభుత్వము వారు ఏమీ ప్రయత్నము చేయడములేదు. పోలీసు శాఖలోనుః కలెక్టరు ఆఫీసులలోనూకూడా ఈ విధంగానే లంచగొండి తనము పాతుకుపోయి ఉన్నది. ఈ లంచగొండితనము ఈ విధంగా పెచ్చుపెరిగిపోతూంటే ప్రజలకు కావలసిన సౌకర్యాలు కలిగే మార్గములు కనిపించడములేదు. మనము ఖర్చుచేసే డబ్బుఅంతాకూడా సద్వినియోగము కాకుండా వృద్ధాఅయిపోతున్నది. కంట్రాక్టర్లు, ఆఫీసర్లు తినివేన్నారు అనే అభిప్రాయము ప్రజలలో బాగాఉన్నది. దానిని తొలగించాలనుకుంటే ప్రభుత్వమువారు సెట్‌రైట్ చేయవలసిన అవసరముఉన్నది. ఆ ప్రకారంగా చేస్తేనేగాని మనము ఒక సత్కార్యము నెరవేర్చినామని అనుకొనడానికి వీలులేదు. కలెక్టర్లనుండి క్రింది ఉద్యోగస్తులవరకుకూడా బాగా లంచములు మరగివున్నారు.

మద్యపాన నిషేధముక్రింద మనము 10కోట్ల రూపాయలు వృధాగా పోగొట్టుకుంటున్నాము. మనము మనయొక్క ప్రతిష్టకొరకు నిలపాలనే అభిప్రాయముతో

ఉన్నాము. ఇప్పుడు దానిని పోలీసులకు యిచ్చినారు. వారిక్రింద మనము 10 కోట్ల రూపాయలు వృధాగా ఖర్చుపెడుతున్నాము, కాని త్రాగుడు అనేది మాన్పినట్లు ఆస్కారము ఏమీ కన్పించడములేదు. కనుక యీనాడు మద్యపాన నిషేధమును తొలగించినట్లయితే బాగుంటుంది. ఈ ప్రకారంగా లంచగొండితనము పెరిగిపోతున్నది. రైతాంగముమీద అదనంగా పన్నులు వేస్తున్నాము, సర్‌చార్జీ వేస్తున్నాము, ఇది వేస్తున్నాము, అది వేస్తున్నాము అని అనడముగాని, పరిపాలనలో నిజమైనటువంటి నిదర్శనము అనడానికి వీలులేనటువంటి సిట్యుయేషన్సు మనకు కనిపించుతున్నాయి. అందువల్ల లంచగొండితనమును మాన్పవలయునంటే ప్రభుత్వ యంత్రమును కూడా సెట్‌రైట్ చేయవలసి ఉంటుంది.

ఒకరైతు ప్రభుత్వమునకు ఒక అర్జీ పెట్టుకున్నాడంటే అది ఏస్థితిలో ఉన్నదో మనము 3 ఏండ్లవరకు కనుక్కొనలేకుండా ఉన్నాము. ఆ అప్లికేషను పెట్టిన అతడు ఆఫీసుకుపోయి క్రిందనుంచి పై ఆఫీసర్లవరకు లంచములు యిచ్చి సంతృప్తి పరుస్తే త్వరగా ఆ అర్జీ బయటకు వస్తుంది. లేనిచో ఎంతకాలమునకుకూడా బయటకు రాదు. కలెక్టర్లయొక్క పరిస్థితులుకూడా అట్లానే ఉన్నాయి. తెల్లవారి ప్రభుత్వములోకూడా కొంతవరకు లంచగొండితనము ఉన్నది. ఈనాడు మన ప్రభుత్వములో యింకా ఎక్కువగా పెరిగిపోయి ఉన్నది. దానికి నిదర్శనములుకూడా ఉన్నాయి. లంచగొండి తనమును నిర్మూలించిననే గాని పరిపాలన సక్రమంగా నిర్వహింపలేము. ప్రభుత్వ శాఖలలో ఈనాడు లంచగొండితనం విపరీతంగా నున్నదని ప్రజలు అనుకొంటున్నారు. ఇట్టిపరిస్థితు లుండుటవలన ప్రజలకు నిరుత్సాహం నిరాశ కలుగుచున్నది. లంచగొండితనమును నిర్మూలించుటకై అనధికారులుగల కమిటీలను యేర్పాటు చేయాలి. లంచగొండితనం రూపుమాపి పోవాలంటే ముఖ్యంగా ప్రజాసహకారం, ప్రజా ప్రతినిధులయొక్క సహకారం కావాలి. లంచగొండితనము లేనినాడే ప్రజలు మనలను తమ ప్రతినిధులుగా ఎన్నుకొని ఇచ్చుటకు పంపించినందుకు సక్రమమయిన ఫలితాలు పొందగలుగుతారు.

ఈనాడు గ్రామపంచాయతీలు సక్రమంగా నిర్వహింపబడుట లేదు. పంచాయతీలకు వస్తున్న రాబడి సక్రమంగా ఖర్చుపెట్టబడుట లేదు. మంచి ఉపయోగకరమయిన కార్యములకు డబ్బు ఖర్చు చేయబడుటలేదు. గ్రామాలలో ప్రజారోగ్యానికి సంబంధించినట్టిగాని, ఇతర సౌకర్యాలకు సంబంధించినట్టిగాని, పనులు నిర్వహింపబడుటలేదు. ప్రభుత్వం ఆదాయాన్ని పెంచుకోడానికి కృషిచేస్తున్నది. ప్రజానీకానికి కావలసినపనులు చేయడంలో శ్రద్ధ వహించుటలేదు. ఒకచోట ఒక పరిశ్రమ నెలకొల్పినామని, ఇంకొకచోట ఒక ఇరిగేషన్ ప్రణాళిక అమలు జరుపబోతున్నా

Sri B. Ramakrishna Reddi] [7th March 1956

మని చెప్పినంత మాత్రాన ప్రజలు సంతోషించరు. ప్రతి జిల్లాలోను, తాలూకాలోను కూడ ప్రజాశ్రేయస్సుకు అనువైన పథకాలు అమలు జరిపిననాడే ప్రభుత్వం చేస్తున్న కృషి ప్రజలకు తెలుస్తుంది. ప్రజలు తాము ఎన్నుకున్న ప్రతినిధులు సక్రమముగా పనిచేస్తున్నారని అనుకుంటారు. మంత్రులు వారివారి నియోజకవర్గములలో కాని లేక వారికి ఇష్టమైన ప్రాంతములలో గాని పనులు చేయిస్తున్నారు. ఇతర శాసనసభ సభ్యులమాట ఏమిటి? శాసనసభ్యులు వారివారి నియోజక వర్గములలో పర్యటన చేస్తున్నప్పుడు అక్కడి ప్రజలు "మీరు మాకు ఏమిపనులు చేయిస్తున్నారు? మిమ్మలను ఎన్నుకున్నందుకు ఫలితము ఏమిటి? వెళుతున్నారు, వస్తున్నారు, కాని పనులు మాత్రం నెరవేరడంలేదు." అని గట్టిగా అడుగుతున్నారు. ఈనాడు మంత్రులుగా ఉన్నవారు ఉత్తరోత్తర ఎన్నికలలో వారు జయంపొందాలనే అభిప్రాయంతో వారివారి నియోజకవర్గాలలోని పనులు మాత్రం కొనసాగిస్తూ ఉంటే మిగత శాసనసభ్యుల మాట యేమికావాలి? ఆ నియోజక వర్గాలలోని ప్రజల యిబ్బందులు తీరేది ఎప్పుడు? ఈ విధంగా చేయడం సబబుగాదు. అధికారంలోఉన్న మేము మాత్రమే వచ్చే ఎన్నికలలో నెగ్గాలి, ఇతర శాసనసభ్యులు పల్టికొడితే మాకేందుకు అనే దృక్పథము సరియైనదికాదు. ప్రభుత్వాదాయాన్ని అన్ని ప్రాంతాలలోను సక్రమంగా వినియోగించాలి. కొన్ని ప్రాంతాలపైననే మోజు చూపించి మిగిలిన ప్రాంతాలను వదిలివేయడం న్యాయంకాదు.

నీటిపారుదల సౌకర్యాలు, రహదారుల నిర్మాణం, హాస్పిటలు యేర్పాట్లు చేయడం మున్నగునవి అన్ని నియోజక వర్గాలలోనూ జరిగేలా చేయాలి. అప్పుడే ప్రభుత్వం తమ యిబ్బందులను తొలగించడానికి ప్రయత్నం చేస్తున్నదని ప్రజలు అనుకుంటారు. కేవలం సమావేశాలు జరపడం, ప్రతి సమావేశానికి హాజరు కావడంతోనే సంతృప్తి చెందితే ప్రజలను మెప్పించలేము. ప్రజలకు ఏయే ఉపయోగకరమైన కార్యములు చేయదలచుకున్నామో వారికి తెలియపరచాలి. పరిశ్రమల విషయంలోకాని, ఇతర అభివృద్ధి పథకాల విషయంలో కాని ప్రభుత్వం సుస్పష్టమయిన అభిప్రాయాన్ని కలిగి ఉండాలి. అన్ని ప్రాంతాలలోను వాటిని అమలు జరపాలి. అంతేకాని (బత్తెముతో సహా) 150 రూపాయల జీతంకోసం మాత్రమే శాసనసభ్యులుగా వున్నారనే భావం ప్రజలకు కలిగేటట్లు వర్తించరాదు. ప్రజల ఇబ్బందులను తొలగించడం సాధ్యమా? అనే అనుమానం మాలో కలుగుచున్నది.

మేము మా సభ్యత్వాలకు రాజీనామాలను ఇవ్వడం మంచిదేమోననిపిస్తున్నది. ఈ విషయాన్ని గురించి శాసన సభలోనే కాకుండా పార్టీ మీటింగులలో కూడా అనేక పర్యాయములు మంత్రివర్గ దృష్టికి తీసుకొని వస్తున్నాము. అయినప్పటికీ

ఫలితం మాత్రం శూన్యం శాసనసభ్యులు వస్తున్నారు. పదినిముషముల సేపు ఏవో మాట్లాడి వెళ్లిపోతున్నారు అనే అభిప్రాయంలో ఉన్నట్లున్నది కాని వారు చెప్పినది గుర్తుంచుకొని ప్రజల ఇబ్బందులను నివారించే అభిప్రాయములో ఉన్నట్లు కనిపించుట లేదు. మా ప్రాంతంలో నీటిపారుదల సౌకర్యాలను గురించి అనేక పర్యాయములు ప్రభుత్వంవారికి తెలియజేశాను. 10 లక్షల రూపాయలలోపు ఖర్చుఅయ్యే కొన్ని స్కీములను గురించి వారికి తెలియజేసినాను. అయినప్పటికీ వాటిని అమలు జరుపలేదు. రాష్ట్రంలోని చిన్న చిన్న నీటిపారుదల పథకాల నన్నింటినీ అమలు జరపడానికి 10 లక్షల రూపాయలనైనా కేటాయించాలి. ఆ సొమ్ముతో పూర్తిచేయగల్గిన కార్యక్రమాన్ని వెంటనే అమలుజరపాలి అప్పుడు గ్రామీణప్రజల కష్టాలు కొంత వరకు తొలగడానికి అవకాశం ఉంటుంది అని చెప్పి మనవిచేస్తున్నాను.

Sri D. SREERAMAMURTY :—అధ్యక్షా, మహాశయా! ఈ మధ్య ముఖ్య మంత్రిగారు తయారుచేసిన బడ్జట్ తోటి ఏకీభవించడానికి నేను నిరాకరిస్తున్నాను. మా ప్రాంతంలో చాలామంది పేద ప్రజలున్నారు. అనేక చిన్న గ్రామాలున్నాయి. చాలా వెనుకబడిన ప్రదేశము. Development Scheme లేదు. వైద్యసహాయం లేదు. రోడ్లు చాలా పాడైపోయి ఉన్నాయి. చాలా దుర్భరంగా ఉన్నాయి అందుచేత ఆ ప్రాంత అభివృద్ధికి ధనం కేటాయించమని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. విద్యావిషయంలో కూడా మా ప్రాంతం చాలా వెనుకబడి వున్నది. ఈ మధ్య ఉప ముఖ్యమంత్రిగారు మా ప్రాంతం వచ్చారు. వారికి మెమొరాండం కూడా సమర్పించాము. మా ఊరి ప్రక్కన ఒక పెద్ద శారదానది ఉన్నది. దానిమీద బ్రిడ్జి కట్టాలని Combined State లోనే మేము మంత్రిగారికి 2, 3 సార్లు deputation యిచ్చాము. వారు దానినికూడా అశ్రద్ధచేశారు. దానికి అన్ని హంగులు జరిగాయి. Estimation 2 లక్షలకు జరిగింది. దానిని కూడా మేము Deputy Chief Minister గారికి తెలియపరిచాము.

మా తాలూకా వ్యవసాయమునకు అనువైన ప్రదేశం. అక్కడ మెరక భూములు ఎక్కువగా వుండుటచే పంపింగ్ అయే పద్ధతి వున్నది. అక్కడ విద్యుచ్ఛక్తి circulation కి కూడా అనుకూలమైన స్థలమున్నది. ఈ బడ్జట్ లో మా బ్రిడ్జి విషయం వేస్తారని నేను, మా ప్రజలు కూడా కుతూహలపడ్డాము. కాని ముఖ్య మంత్రిగారు బడ్జటులో దీనిని చేర్చలేదు. కాన Supplementary Budget లో దీనిని చేర్చుమని మేము కోరుచున్నాము.

*SRI D. KONDAIAH CHOWDARY:—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు సమర్పించినటువంటి బడ్జెట్ ను విమర్శిస్తూ కమ్యూనిస్టు నాయకుడైన సుందరయ్యగారు మేము రొట్టె అడిగితే రాయి యిచ్చారని చెప్పారు. కాని అది సరియైన Assess-ment కాదేమో ననిపిస్తున్నది. ఒక విషయం మాత్రం చెప్పవచ్చు. పట్టణవాస ప్రజలకు రొట్టె అడిగితే రొట్టె, నేయి కూడా యిచ్చారు. కాని గ్రామీణ ప్రజలు అడిగితే రాయి యివ్వలేదు కాని అన్నంలో రాళ్లు కల్పి యిచ్చారు. అందుచేత 1956-57 కు ప్రవేశపెట్టిన బడ్జటులో ముఖ్య మంత్రిగారు గ్రామ ప్రజల అభివృద్ధి విషయంలో యే యే పథకాలు తలపెట్టినారో బడ్జటులో ఎక్కడా చూపించలేదు. బడ్జటు ఉపన్యాసంలో ఎక్కడా ఉన్నట్లు నాకు బోధపడుట లేదు. వైద్య, విద్యా సౌకర్యాల విషయంలో నేమి, గృహనిర్మాణ పథకాల్లో నేమి, జాతీయ విస్తరణ ప్రణాళికలలో నేమి ఏ విషయంలో చూచినా పట్టణవాసులకే సౌకర్యాలు కల్గ జేశారుగాని గ్రామీణప్రజల సౌకర్యంవిషయంలో అన్యాయంచేస్తున్నారు. ఎక్కడైనా ఒక గ్రామంలో హాస్పిటల్ పెడతామనే భావం ఎక్కడా ఉన్నట్లు కనిపించదు. కాదా అంటే King George Hospital ను, Kurnool Hospital ను మేము అభివృద్ధి చేయదలచాము, అనంతపురం ఆస్పత్రికి ఒక క్రొత్త Block పెట్టబోతు న్నాము అని చెప్తున్నారు. కాని గ్రామాలలో Rural Dispensary లు పెడ దామనికాని Midwife ను యేర్పాటు చేసి ప్రసూతికి సహాయం చేస్తున్నామని ఎక్కడా లేదు. కందుకూరు తాలూకాలో 2 లక్షలమంది ప్రజలున్నారు. 4 Hos-pitals, 4 Midwives వున్నారు. అంటే 50 వేల ప్రజలు గల చోట ఒక Midwife ని ప్రభుత్వం నియమించిందన్నమాట. దీనినిబట్టి చూస్తే Midwives ను ఎక్కువచేయడానికి కూడా ప్రభుత్వం బడ్జటులో తలపెట్టలేదు. ఇక నెల్లూరు, విశాఖపట్టణం ఆస్పత్రులకు ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో వుండే ప్రజలు పడిశం పట్టినా, ఎవరైనా ప్రసవించినా అక్కడకు రావలసివస్తుంది. ప్రభుత్వానికి దీని విషయం ఏమైనా దృష్టిలోవుందా అని అడుగుతున్నాను. గృహనిర్మాణ విషయంలో చూస్తే వెయ్యి ఇళ్లు కట్టామని చెప్తున్నారు. అందులో వెయ్యి ఇళ్లు పట్టణాల్లో కడితే 200 ఇళ్లు పల్లెలలో కట్టినామని చెప్తున్నారు. అందుచేత గృహనిర్మాణాల విషయంలోకూడా పట్టణవాసులకే ఎక్కువ సౌకర్యాలు కల్గజేశారని, గ్రామాలలో వుండే బీదలకు ఇళ్లవిషయంలో ఏమీ కూడా సహాయం చేయలేదని చెపుతున్నాను. ఈవిధంగా పన్నుల భారం పల్లెప్రజల మీదనే వుంటుంది. దీర్ఘంగా ఆలోచిస్తే తెలుస్తుంది.

పన్నుల విషయం వచ్చేటప్పటికి కేవలం గ్రామీణప్రజలు మాత్రమే చెల్లించ వలసిన పరిస్థితి ఏర్పడుతోందని మనవి చేస్తున్నాను. ఈ అన్యాయాన్ని తొలగిం

చేందుకు ప్రభుత్వం ప్రయత్నించాలని మనవిచేస్తున్నాను. social services గ్రామాలు చేయడానికి కేటాయించబడని budget ను గ్రామీణ ప్రజలు సాధారణంగా ఎలా ఆమోదిస్తారో ఆర్థిక మంత్రిగారు కొంచెము దీర్ఘంగా ఆలోచిస్తే తెలుస్తుందని మనవి చేస్తున్నాను. ఎందువల్లనంటే క్రొత్తపన్నులు వేశారు. మేమందరము ప్రతిఘటించినమాట వాస్తవమే. గ్రామప్రజల తరఫున వచ్చినటువంటి ప్రతినిధులము. పేదలతరఫున వచ్చినటువంటి వాళ్ళము. మేమేమి పట్టణవాసులము కాము. అందువల్ల మేము ప్రతిఘటించిన మాట వాస్తవమే. Incidence direct గా రైతులమీద పడుతోంది కాబట్టి ఇది పనికిరాదని, మేము దీర్ఘంగా చాలా పట్టుదలగా కూడా ప్రతిఘటించిన మాట వాస్తవము. అయినప్పటికిని ప్రభుత్వమువారు majority తో pass చేసినారు. కాంగ్రెసుపార్టీ అంతా కూడా న్యాయంగావాళ్లకేదో సౌకర్యాలు కలుగజేస్తారనే ఉద్దేశ్యంతో ఏ కష్టమైన ఓర్చుకుందామనే అభిప్రాయంతో ఒప్పుకొన్నమాట వాస్తవమే. కాని వాళ్లదగ్గర అధికంగా 2 కోట్ల రూపాయలు వసూలు చేస్తున్నారు. ప్రతిపన్నుకూడా గ్రామీణ ప్రజలనుంచి వసూలు చేసినారు. కనీసం అధికంగా వసూలుచేసిన 2 కోట్ల రూపాయలైనా గ్రామీణ ప్రజలకు ఉపయోగించారా? దానికి పైపెచ్చు మంత్రిగారు చెప్పేదేమిటంటే ఈ సంవత్సరానికి surcharge అమలు జరుపబడుతుంది. వచ్చే సంవత్సరము అమలు జరుపబడుతుంది. వచ్చే సంవత్సరము కొత్తపన్నులు నీటితీరువ మొదలైన అభివృద్ధి చేస్తామని చెప్పినారు. ఇంకా ఎక్కువ పన్నులు భరించవలసి వస్తున్నది అంటేగూడ ఒప్పుకుంటాము. కాని మేము ఇచ్చినటువంటి డబ్బు కనీసము గ్రామాలకు ఖర్చుపెట్టే పనిఅయితే ఎంతడబ్బుఅయినా యివ్వడానికి సిద్ధంగా ఉంటాము. మా దగ్గరనుంచి వసూలుచేసి పట్టణాలలోని మురుగునీటి సౌకర్యాలకు లేక మంచినీటి సౌకర్యాలను కలుగచేయడానికి మీరు ఉపయోగించే పనిఅయితే మమ్మల్నందర్ని rob చేసి pay the peter అనే విధముగా చేసే ప్రయత్నంలో ఉంటే మేము భరించడానికి వీలులేదని మనవి చేస్తున్నాను. ఇంకొక విషయం ఏమిటంటే forests నుంచి కూడా అధికంగా పుల్లరి వసూలు చేశామని చెప్పుకోవడం కూడా చాలా పొరపాటేమో ననిపిస్తుంది. Forests సక్రమంగా వినియోగపడితే 2 కోట్ల రూపాయలు వస్తుందని మాజీ మంత్రిగారు చెప్పారు. పుల్లరికట్లు పెంచితే 2 కోట్ల రూపాలు వస్తుందని అభిప్రాయపడుతున్నట్లున్నారు. మన ఆర్థిక మంత్రిగారు.

పుల్లరికట్లు పెంచినందువల్ల అధికమైన అలజడి, రైతులకు యిబ్బందులేగాని దానివల్ల ఎక్కువగా మీరు సాధించబడే ఆర్థిక సంపద ఏమీ లేదనిమాత్రం నేను మనవిచేస్తున్నాను. మోసము ఎక్కడ జరుగుతున్నది. అంటే మీరు ఇచ్చినటువంటి

Sri D. Kondaiah Chowdary] [7th March 1956

contract forest coupes అమ్ముకొనుటలోను, forest ఉత్పత్తిఅయ్యే పదార్థాలను వేలము వేసేదాంట్లోనూ మనకు నష్టము వస్తుంది కాని మీరు ఫుల్లరి తక్కువచేటు అయినందువలన లేదనిమాత్రం మనవిచేస్తున్నాను. దానిని మీరు సక్రమంగా వినియోగపరచవలసిందని సక్రమమైన వేలం పద్ధతులు యేర్పాటు చెయ్యవలసిందని తమకు మనవి. ఫుల్లరి రేట్లు, నీటితీరువ పెంచుతామని అంటున్నారు. ఇప్పుడు 2 కోట్ల రూపాయలు అధికంగా పన్నులు వేశారు. కాని దానివల్ల వచ్చినటువంటి ప్రతిఫలముగా వచ్చిన డబ్బైనా రైతులకు ఉపయోగపరచడానికి మాత్రం మీరు సాహసించడము లేదు. ఎక్కువగా ఏమి చెబుతారంటే "మేము వ్యవసాయదారులకు అప్పులు యివ్వడంలేదా? అమ్మోనియం సల్ఫేటు కొనడానికి, pump sets కొనటానికి అప్పులు యిస్తున్నాము" అని మా దగ్గరనుంచి డబ్బు వసూలుచేసి మీరు 6 అణాలకు బదులు $7\frac{1}{2}$ అణాలు వడ్డీ చొప్పున అప్పుయివ్వడం అది ఒక పెద్ద సహాయమా అని అడుగుతున్నాను.

ఇప్పుడు పెద్ద పెద్ద పట్టణాలలో ఉండేటటువంటి Municipality లలో గ్రామప్రజలు చెల్లించే డబ్బు యావత్తుకూడా ఖర్చు అవుతోంది. కాని వాళ్ల ప్రభుత్వానికి ఇచ్చేటటువంటి డబ్బు యేమీలేదు. గ్రామీణ ప్రజల దగ్గర అధికంగా పన్నులు వసూలుచేయడం తప్పితే వాళ్లకుమాత్రం ఇతరవిధమైన సౌకర్యాలు ఏమి కలుగజేయడంలేదు. కాబట్టి ఇది కేవలం పట్టణవాసులకు సౌకర్యం కలిగించే బడ్జెటుగాని గ్రామీణ ప్రజలను దృష్టిలో పెట్టుకొని గ్రామీణ ప్రజల అభివృద్ధిని సాధించేందుకు, వాళ్లకు సౌకర్యాలు కలిగించేందుకు తయారు చేయబడిన బడ్జెటు కాదని మనవిచేస్తున్నాను. Pump sets విషయంలో రైతులందరికి pump sets ఇస్తున్నారు అవి Indian made pump sets పనికిరానటువంటి pump sets 4, 5 వేలు పెట్టి కొనుగోలు చేయడము, అవి చెడిపోతే ఈ రైతుకు అందులో ఉండేటటువంటి mechanism తెలియక మరల వాళ్లు దానిని, ఏ అయిదువందలకో నాలుగువందలకో అమ్ముకొనే పరిస్థితి ఏర్పడుతోంది. నెల్లూరు జిల్లాలో అనేక చోట్ల రైతులు ఈ విధంగా బాధపడుతున్నారు.

అప్పు ఇచ్చామని చెప్పతున్నారేగాని $7\frac{1}{2}$ అణాల వడ్డీ తీసుకుంటున్నారు. గ్రామాలలో 8 అణాలు వడ్డీకి బాహాటంగా డబ్బు అప్పు ఇస్తున్నారు. మీరేదో ఘనకార్యం చేసినట్లు $7\frac{1}{2}$ అణాల చొప్పున వడ్డీకిచ్చి రైతులకు పరపతి సౌకర్యాలు కలుగుచేస్తున్నామని చెప్పడము ఏమంత న్యాయంకాదని మాత్రం మనవి చేస్తున్నాను. జాతీయవిస్తరణ ప్రణాళికల విషయంలో గూడా Government విధానాన్ని ఆమో

ధించ లేకుండా ఉన్నాము. ఎందుచేతనంటే జాతీయవిస్తరణ ప్రణాళికలలో నేమి, స్థానికాభివృద్ధి ప్రణాళికలలోనేమి ప్రజలు దాదాపు అర్థము contribution చేయాలని చెపుతున్నారు. ఇలాంటప్పుడు సాధారణంగా మెట్ట తాలూకాలలో ఉండే బీద వాళ్లకు ఏవిధమైన నటువంటి అవకాశం లేకుండా పోతోంది. ఈ పద్ధతులు నిర్ణయించడంలో ప్రభుత్వమువారు ఒక రకమైనటువంటి విధానాన్ని కేవలం మెట్ట తాలూకాలలోని బీదవర్గానికి బాధలేకుండా ఏదో కొంత వరకు వారు యివ్వవలసిన Contribution కొంత తగ్గించో, లేకపోతే contribution అసలే లేకుండానో ప్రభుత్వమువారు చేయవలసియున్నది. ప్రభుత్వంవారు జాతీయవిస్తరణ ప్రణాళికలో అయితేనేమి, స్థానికాభివృద్ధి కార్యక్రమలలో అయితేనేమి మెట్ట తాలూకాకు ప్రత్యేక వసతులు చేయడం న్యాయంగా ఉంటుంది. డెల్టాలలో ఉండే టటువంటి డబ్బుగలవాళ్లకు సౌకర్యాలు కలుగుతున్నాయిగాని మెట్ట తాలూకాలలో ఉండే బీద వారికి సౌకర్యాలు కలగడంలేదు. ఈ విషయంలో మా ప్రభుత్వం నూతన విధానాన్ని అవలంబించవలసిన అవసరం ఉన్నదని మనవి చేస్తున్నాను.

SRI AYYAPU REDDI :—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన Budget ను నేను బలపరుస్తున్నాను. కొద్ది లోటుతో 3.98 కోట్లతో ఇంత పెద్ద కార్యక్రమాన్ని నెరవేర్చుటకు తలపెట్టడం అన్నది వారిని అభినందించవలసిన విషయమే. ఇంతలో చాలమంది సభ్యులు Land Revenueపై విమర్శించినారు. ఇప్పట్లో రైతులు పన్నులు చెల్లించడానికి ఏమీ బాధపడరు. కాని వాళ్లకు కావలసిన కనీస సౌకర్యాలైన కల్పించవలసిన బాధ్యత Government మీద ఉన్నదని భావిస్తున్నాను. ఒక్క surcharge మాత్రమేకాదు. ముఖ్యమంత్రిగారు వారి speechలో సూచించి విధించబోయే Commercial Crops Tax కూడా చెల్లించటానికి ప్రజలు సిద్ధంగానే ఉంటారు. కాని వారికి కావలసిన సౌకర్యాలు మాత్రం కలుగచేసే బాధ్యత ప్రభుత్వంవారు తీసుకుంటేచాలు. కొండయ్య చౌదరిగారు చెప్పినట్లు Rural areas కొంతవరకు neglect అయినా యనేది నాకు సందేహంగానే ఉన్నది. National Rural Water Supply Scheme దాదాపు 2 సంవత్సరాల క్రిందట sanction అయి ఇప్పటికి కార్యక్రమ మేమీ నెగ్గించలేదని స్పష్టమాతోంది. ముఖ్యమంత్రిగారి Budget Speech లో 50% Grants lapse అవుతున్నాయని చెప్పారు. అవి ఎందులకు అవుతున్నాయో నాకు అర్థం కావడంలేదు. బహుశా మనకు Technical Personnel లేని దానివల్ల lapse అవుతున్నాయేమో నని నాకు తోచుచున్నది. ఆ scheme గ్రామ ప్రాంతాలకు ఎక్కువ ఉపయోగకరంగా ఉన్నది. ఉదహారణకు అనంతపురంజిల్లా కదిరి తాలూకాలో ఈ scheme ప్రవేశపెట్టితే నేను చూచి

Sri Biappa Reddi] [7th March 1956

నంతవరకు ఏ కార్యక్రమమూ జెగ్గలేదు. ఆ Scheme Grants lapse కాకుండా ప్రభుత్వం Time limit పొడిగించి grants ఉపయోగపెట్టుకొనే అవకాశం ఇప్పించవలెనని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈ Scheme క్షామ ప్రాంతానికి ఎక్కువ మేలు కలుగ చేస్తుందనే నా భావము. Medical aid ను గురించి... కూడా కొండయ్య చౌదరిగారు చెప్పారు.

ప్రతి పల్లెకు ఒక Dispensary open చేయాలనీ కోరను. కనీసము 40,50 పల్లెలకైనా కలిపి ఒక Dispensary ఉంటే బాగుంటుందని నేను ఆశిస్తున్నాను. Dispensary open చేయడానికి ప్రభుత్వానికి డబ్బులేనిచో Mobile Unit అక్కడక్కడ Mobile Centres స్థాపించి Interior villages కు ఈ Medical aid అందచేస్తే బాగుంటుందేమోనని ప్రభుత్వానికి కొంతవరకు సలహా యిస్తున్నాను. క్షామ ప్రాంతాలలో ఎక్కువ అవసరమైనది Land Mortgage Bank. కదిరి ప్రదేశము క్షామ ప్రాంతం కాబట్టి, దారిద్ర్యము తాండవమాడు ప్రదేశము కాబట్టి, అక్కడ ఒక Land Mortgage Bank ను స్థాపించడం అవసరముంటుందేమో వని నాయొక్క భావము. 1950 సంవత్సరమునుంచి కదిరి నివాసస్థులు 2 లక్షలమంది ఆందోళన చేస్తున్నారు. ఇంత వరకు దానిని గురించి ప్రభుత్వము ఏలాంటి చర్య తీసుకోలేదు. ధర్మవరము Land Mortgage Bank కు కదిరినుంచి రైతులుపోయి అప్పులు తెచ్చుకోవడం చాలకష్టంగా ఉంటోంది.

అంతేకాకుండా ఈ Land Mortgage Bankకు ప్రభుత్వము 50లక్షలు కేటాయించిందని బడ్జెటులో ఉన్నది. కాబట్టి ఈ Land Mortgage Bank క్షామ ప్రాంతాలకు ఎక్కువ ఉపయోగ పడేటట్లు తగిన సౌకర్యాలు కలుగజేస్తే బాగుంటుందని నాయొక్క నమ్మకము. ఇంతేకాకుండా, కదిరి, పెనుకొండ, మదనపల్లి, Rayachoty తాలూకాలలోని ప్రాంతాలు ఎక్కువ క్షామ ప్రాంతాలుగా ఏర్పడి, అయిదు సంవత్సరములనుంచి పంటలులేక అక్కడి ప్రజలు నానా బాధలు పడుతున్నారు. కనుక ఇది ఒక belt area గా ఏర్పాటుచేసి ఆ ప్రాంతముపైననే ప్రభుత్వము ఎక్కువ దృష్టి వహించి కావలసిన సౌకర్యాలు కలుగజేసి వారి అభివృద్ధికిగాను పాటుపడవలెనని ప్రభుత్వమును కోరుచున్నాను. Local Bodiesవాళ్లకు ఆర్థికస్తోమతు లేనందున గ్రామాలలోని dispensaries సక్రమముగా జరగడం లేదు. కాబట్టి ప్రభుత్వము Local Bodies యొక్క అభివృద్ధికిగాను కొంత ఆర్థికంగా సహాయంచేస్తే వాళ్లు ఉపాధ్యాయులకు, డాక్టర్లకు, ఇంకా తక్కిన ఉద్యోగస్థులకు జీతాలు సరిగాయిచ్చి వారికి అసంతృప్తి లేకుండా చేయగలుగుతారు. అప్పుడు ఆ ఉద్యోగస్థులు తమ పనులను సక్రమంగా నెరవేర్చగలరని నమ్ము

చున్నాను. మా ప్రాంతము దారిద్ర్యము తాండవమాడేటటువంటి క్షామప్రాంతము. కనుక అక్కడ విద్యుచ్ఛక్తి సరఫరా చేయించి, అక్కడక్కడ ఫిర్కావారీగా N. E. S blocks మొదలగు అభ్యుదయ కార్యక్రమాలను ఎక్కువగా ప్రవేశ పెట్ట వలెనని ప్రభుత్వమును కోరుతూ విరమిస్తున్నాను.

*SRI N. P. CHENGALRAYA NAIDU :—అధ్యక్షా, మన ముఖ్య మంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జెటు ఏమి అంత ఉత్సాహకరంగా లేకున్నను అంత నిరుత్సాహకరంగా కూడా లేకుండా ఉన్నదని చెప్పాలి. ఇప్పటి పరిస్థితులలో వారు జమాఖర్చు చూచుకొని చేసేవారు. కాబట్టి జమాఖర్చులు మాత్రము చూచు కొన్నారు. ఇంక వేరే ఏ ఆలోచనకూడ చేసుకోలేదని చెప్పాలి. ముఖ్యంగా, రైతు లందరుకూడ ఇంకా ఎన్నో కొత్తపన్నులు తమపైన వేస్తారేమో అని భయపడు తున్నపుడు, కొత్తపన్నులేవి ఈ బడ్జెటులో వారు ప్రవేశపెట్టనందుకు సంతోషించ వలసి యున్నది. బహుశా, రైతులపైన వేయవలసిన పన్నులన్నీ ఇదివరకే వారు వేసినారు. కొత్తఆలోచన వారికేమి తోచలేదేమో అనుకొంటాను. ఇక మీదట ఏదైనా అటువంటి ఆలోచనలు వచ్చినా, ఆ ఆలోచనలను నిలుపుకొని రైతులమీద మాత్రం పన్నులు వేయకూడదని వారికి మనవిచేస్తున్నాను. ఇదివరకు రైతులమీద వేసిన పన్నులు కోటిరూపాయలకే నని, అది రైతులే నేరుగా కట్టవలసిందని ఉన్నది. ముఖ్యంగా ఈ land surcharge ఒక సంవత్సరానికే అని చెప్పారు. ఒక సంవత్సరానికైనా వారి అంచనా ప్రకారం 45 లక్షల రూపాయలు అవుతుందని అన్నారు. నిజంగా ఈ 45 లక్షల రూపాయలనేది చాలా తక్కువ అంచనా వేశారు డిపార్టుమెంటువారు అని అభిప్రాయ పడుతున్నాను ఇది సుమారు 75 లక్షలకు పైనే పోతుందని అనుకొంటాను. అయితే రైతులపైన కొత్తగా పన్నులు వేసినపుడు వారికి ఏదైనా సహాయంగా ఉండేపని ఒకటైనాచేస్తే, బాగుండేది. అటువంటిది ఈ బడ్జెటు ప్రతిపాదనలో లేదు. ముఖ్యంగా వీరు లెక్కలకు మాత్రము అనేకము చూపించారు. రైతులకు pump sets అప్పుగా యివ్వడం, ఎరువులకు అప్పు లివ్వడం మొదలైనటువంటివన్నీ ఉన్నాయి. అయిన బయట మర్వాడీవాళ్ళ దగ్గర అప్పుతీసుకొన్నా వాళ్ళేమైనా వాయదా యిస్తారేమోగాని ప్రభుత్వము మాత్రము వాయిదా ఇవ్వడంలేదు. ఖచ్చితంగా అతనిసొత్తో నేలో వేలము వేసైనా వసూలు చేసుకొంటున్నారు. అందుచేత ఈ ప్రభుత్వము దగ్గర అప్పులు తీసుకో కుండా ఉంటేనే బాగుంటుందేమో అనిరైతులకు అనిపిస్తున్నది. వీరు ఇచ్చినా లాభములేదు. అంతేగాదు ఇచ్చినా వారిని ఇంకా కష్టపెట్టినట్లవుతుంది.

తరువాత విద్యా విషయకంగా, మొదటి పంచవర్ష ప్రణాళికలో వెయ్యి elementary పాఠశాలలు ఏర్పాటు చేసినారు. అయినా అందులో 751 మాత్రమే

ప్రారంభింపబడినవి. తక్కినవి వారు ఏర్పాటుచేయ లేదు. అందుచేత ప్రభుత్వము వారు ఉత్తరువులు ఇచ్చి అయినను ఈ జిల్లాబోర్డు Special Officers లో దీనికి కారకులెవరో వారిని మందలించి ఈ పాఠశాలలన్నీ సక్రమంగా ఏర్పాటు చేసేందుకు ప్రయత్నం చేస్తారని వారికి మనవి చేస్తున్నాను. ఇక Engineering Colleges, Medical Colleges విషయంలో, ఏ ఒక్కటైన కొత్తగా ఏర్పాటుచేస్తామని ఈ బడ్జెట్ ప్రతిపాదనలోలేదు. ముఖ్యంగా రాయలసీమ వెనుకబడిన ప్రాంతము. ఏదో కర్నూలులో ఒక Medical College ఏర్పాటు చేస్తారని చెప్పుతూ ఉండినారు. పత్రికలలో కూడ చూస్తూఉంటిమి, కాని ఈ బడ్జెటులో దానికోసం ఒక వంద రూపాయలైన ఏర్పాటు చేయకపోవడం విచారకరంగా ఉన్నది. ఇక రాయల సీమలో తిరుపతిలోనో మరెక్కడో ఒక Engineering College ఏర్పాటుచేయ వలసియున్నది. ఆ విషయముకూడ ఏమీ చెప్పలేదు. తిరుపతిలో దేవస్థానం వాళ్లు కొన్ని లక్షల రూపాయలు ప్రభుత్వానికి ఉచితంగా ఇస్తామని, అక్కడ ఒక Medical College ఏర్పాటు చేయవలసిందని అన్నారు. దానిని గురించి కూడ మంత్రిగారు ఏమీ ఆలోచించినట్లులేదు. ముఖ్యంగా మనము ప్రతి సంవత్సరము ఏదైన కొత్త కొత్త పన్నులు వేసేటప్పుడు, అభివృద్ధి పనులు కూడ కొన్ని చేస్తే బాగుంటుందిగాని, ఏదో జమాఖర్చు చూచుకొందామనే విధంగా బడ్జెటు ప్రతిపాదిస్తే ఎవరికి కూడా సంతోషము కలుగదు. ఇప్పుడు 3,24 లక్షలు లోటు బడ్జెటు అని చెప్పారు. అయితే ఆ విధంగా లేదనుకొంటాను. ఏదో అన్ని ప్రభుత్వాలు లోటు బడ్జెటు చూపిస్తూ ఉంటే మనముకూడ లోటు బడ్జెటు చూపకుండా ఉంటే బాగుండదు అని లోటు చూపించారే గాని నిజంగా మన బడ్జెటులో లోటు లేదు.

THE HON. DR. B. GOPALA REDDI :—పోయిన సంవత్సరము, గవర్నరు పరిపాలన ఉండినపుడు, 5,17 లక్షలు లోటు వచ్చిందే, దానికేమి చెప్తారు ?

SRI N. P. CHENGALRAYA NAIDU :—అప్పుడు రావలసిన డబ్బుకు వాళ్లు నికరం లెక్కలు చూపించి ఉంటారేమోగాని ఇప్పుడు 75 లక్షలు surcharge రావలసి ఉంటే 45 లక్షలే చూపించారు, ఈ విధంగా ఇతర విషయాలలో కూడ ఉంటుంది. అందుచేత లోటు బడ్జెటులేదని నా అభిప్రాయము. కడపటి లెక్కలుచూస్తే లోటు మాత్రము ఉండదని మరొకమారు మంత్రిగారికి మనవిచేస్తున్నాను. ఇక ముఖ్యంగా రైతులకు సంబంధించినంతవరకు వారికి కొన్ని అభివృద్ధి ప్రణాళికలు దీంట్లో వేసినారు, గాని ముఖ్యంగా వారికి కావలసినటువంటి Seed Farms ఏర్పాటు చేయలేదు. ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క Seed Farm

7th March 1956] [Sri N. P. Chengalraya Naidu

ఏర్పాటుచేసి ఉంటే బాగుండేది. దీన్ని గురించి మంత్రిగారు ఆలోచన చేసినట్లు లేదు. మన రాష్ట్రములో క్రొత్తగా ఈ Seed Farm ఏర్పాటుచేస్తే బాగుండేది. మిగిలిన రాష్ట్రాలలో ప్రతి జిల్లాకు కూడ Seed Farms ఏర్పాటుచేసినట్లు పత్రికల వల్ల తెలుస్తున్నది. అందువల్ల మన ప్రభుత్వము కూడ ఈ Seed Farms ఏర్పాటు చేసేందుకు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత, ధాన్యపు ధరల స్థిరీకరణ విషయము ప్రభుత్వము పట్టించుకోలేదు. వడ్ల ధరలు పడిపోయేటట్లుగా ఉంటే అవి కొనేందుకు ఏర్పాటుచేస్తామన్నారు. వడ్ల ధరలు పెరిగేటప్పుడేమో ఇంతకంటె పైన అమ్మకూడదని control చేసే అధికారం ఉన్నప్పుడు, అంతకంటె తక్కువగా ధరలు పడిపోయినప్పుడు, ఆ ధరను నిలబెట్టవలసిన బాధ్యత కూడ ప్రభుత్వముది కదా అని అడుగుతున్నాను. అదే విధముగా బెల్లము, వేరుశనగ మొదలగు ఇతర పంటల విషయములో కూడ, వాటి ధరలు అధికమయ్యేటప్పుడే ప్రభుత్వము control చేస్తుంది గాని వాటి ధరలు పడిపోయి రైతులు నష్టపడేటప్పుడు ప్రభుత్వము అది ఆలోచించదు. అందువల్ల ఒక్క వడ్ల విషయములోనే కాకుండా, మిగతా వ్యాపార పంటల విషయములో కూడ, వాటి ధరలు పెరగకుండా ఏ విధముగా control చేస్తారో, అదే విధముగా వాటి ధరలు పడిపోయేటప్పుడు కూడ వాటిని నిలబెట్టాలని వారికి మనవిచేస్తున్నాను.

ఇక Minor Irrigation విషయం ఎత్తుకొంటే, దానికి బడ్జెటులో, 3.12 లక్షలు allotment చూపించారు. గడచిన సంవత్సరం బడ్జెటుకు, ఇప్పటికీ చాలా తేడా ఉన్నది. నిజముగా వెనుకబడిన ప్రాంతాలలో మా కేమీ పెద్ద పెద్ద ప్రాజెక్టులు రావు, ఏమిఉండినా ఈ minor irrigation వల్లనే. చిన్న చిన్న చెరువుల క్రిందను గుంటల క్రిందను, కాలువల క్రిందను పైరులు చేసుకోడానికి సాధ్యమవుతుంది. ముఖ్యంగా వెనుకబడిన మెట్ట ప్రదేశాలలో ఏలాటి ప్రాజెక్టులు కట్టడానికి వీలులేదు. ఏమైన, ఈ minor irrigation వల్లనే కొంచెము సహాయంచేయవచ్చు. అందువల్ల ఈ minor irrigation పనులకు ముఖ్యంగా అధికంగా డబ్బు కేటాయించాలని, లేదా కేంద్ర ప్రభుత్వమునుంచి వచ్చే డబ్బులో అధికంగా దీనికి కేటాయించాలని ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను.

ఇక మన ఆర్థికస్థితిని గురించి చూస్తే, యింతవరకు రైతుల మీద పన్నులు వేసే క్రొత్తఆలోచన యిందులో పెట్టలేదని మంత్రిగారు అన్నారు. అందువల్ల వారికి ఒక విషయముమాత్రము మనవిచేస్తున్నాను. ఇప్పుడు కేంద్రప్రభుత్వమువారు Central Financial Commission అనేదొకటి ఏర్పాటుచేశారు. వారు రాబోతున్నారు.

Sri N. P. Chengalraya Naidu] [7th March 1956

వారు వచ్చినప్పుడు మనది లోటుబడ్జటేనని చూపిస్తే మంచిదేమోనని అనిపిస్తున్నది. వారు వచ్చినప్పుడు, మన రాష్ట్రము క్రొత్తగా ఏర్పాటు అయిన రాష్ట్రము. ఈ విధముగా లోటుబడ్జటులో ప్రతిసంవత్సరము వస్తూనేవున్నది అనిచెప్పి వారివద్దనుంచి ఏదైనా అధికముగా గ్రాంటు సంపాదించటానికి మనము వారిని కోరవలసి ఉన్నది. దీనికి మనము కొన్ని కారణములుకూడ కనబరచవచ్చు. పుగాకు విషయములో భారత దేశము అంతటిలోకి మన ఆంధ్రరాష్ట్రమునుంచే పుగాకుమీద excise పన్ను కేంద్ర ప్రభుత్వమువారు వసూలు చేసుకుంటున్నారు. అందువల్ల ప్రతి సంవత్సరము కేంద్ర ప్రభుత్వమువారు మనకు యిచ్చే వాటా ధనములో యింకను ఏ రెండు మూడు కోట్లో అధికంగా అడిగి తీసుకోటానికి ప్రయత్నిస్తే, వారు తప్పకుండా ఇస్తారు. నిజానికి కేంద్రప్రభుత్వానికి భారతదేశములో యితరరాష్ట్రములకంటే, ఆంధ్రరాష్ట్రంనుంచే ఎక్కువ డబ్బు వసూలు చేస్తున్నారు కాబట్టి మనకు యింకా అధికముగా యివ్వమని కోరడంలో తప్పేమీ లేదు. వారు తప్పకుండా ఇస్తారని నా నమ్మకము. ఇదిగాక ఆర్థికమంత్రిగారు మిగతా విషయాలు కూడ ఆ కమిషనువారితో చర్చించి అదనముగా గ్రాంట్లను ఇవ్వవలసిందిగా సిఫార్సుచేయమని అడగవలసి ఉన్నది. ఈ విధంగా మన ప్రభుత్వానికి కేంద్రప్రభుత్వంనుంచి డబ్బు తెచ్చుకోటానికి ప్రయత్నించాలిగాని, ఊరకనే రైతులపైన పన్నులమీద పన్నువేస్తూపోతూ ఉంటే, ఇక మన రాష్ట్రంలో రైతు అనేవాడే లేకుండా పోతాడు. అందువల్ల రైతుల మీద కొత్త కొత్త పన్నులు వేసే బదులు, Finance Commission వారు వచ్చినప్పుడు మన లోటు బడ్జటు విషయం చెప్పి, ఇంకా కొంతవరకు అదనంగా కేంద్రంనుండి గ్రాంట్లను సంపాదించుకోటానికి ప్రయత్నించవలెనని ఆర్థికమంత్రి గారికి మనవి చేస్తున్నాను.

ఇప్పుడు క్రొత్తగా యాష్టై N. E. S. Blocks ప్రభుత్వం యేర్పాటు చేస్తున్నారు. ఇది చాలా సంతోషమైన విషయమే. ఈ Blocks ఎక్కడెక్కడ ఏర్పాటు చేయబడుతున్నవంటే, మన మంత్రుల Constituencies ఎక్కడ అయితే ఉన్నవో, అక్కడనే యేర్పాటు చేస్తున్నారు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—గౌరవ సభ్యులు మాట్లాడేది చాలా పొరబాటని అంటున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—నా Constituency ఆత్మకూరుకు చెందినది. అక్కడ యేర్పాటుచేయబడుతున్నవా ?

7th March 1956]

SRI N. P. CHENGALRAYA NAIDU :—ఈ blocks వారి జిల్లాలలో లేకపోవచ్చు. మా జిల్లాలో మాత్రం పెట్టారు. ఇది వాస్తవమైన విషయమేనండి.

ముఖ్యంగా యీ N.E,S. Blocks ను ప్రభుత్వంవారు ఏర్పాటుచేసేటప్పుడు ముందుగా మంత్రుల Constituencies ను select చేయకూడదు. లేకపోతే వారి అనుచరుల Constituencies లో ఏర్పాటుచేయకూడదు. ఈ blocks ను ఎక్కడైతే వెనుకబడిన ప్రాంతాలు ఉన్నవి, ప్రజలు ఎక్కడెక్కడ యిబ్బందులు పడుతున్నదే, వారి ఆర్థికస్తోమతు యేమిటి, అనే విషయాలు అన్నీ విచారించి యీ blocks ను యేర్పాటు చేయాలి. కాని ఎక్కడైతే బాగా ఉన్నారో, ఎక్కడైతే వారికి అనుకూలంగా ఉన్నారో, బాగుపడని చోట్లను విడిచిపెట్టి, బాగుపడ్డ ప్రాంతాలనే తమయొక్క ప్రయోజనములకు యీ blocks ను ఏర్పాటుచేయడము కన్పిస్తున్నది. కాబట్టి వెనుకబడిన ప్రాంతాలలో, ఆప్రాంతపు ప్రజలసౌకర్యాలకోసము యీ N.E.S. Blocksను ఏర్పాటుచేయించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను. ఇది కాకుండా కొత్తపన్నులను మాత్రము రైతులమీద వేయవద్దని పదే పదే, మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

* SRIMATHI B. RUKMINI DEVI :—ఉపాధ్యక్షా, మన ఆర్థికమంత్రిగారు ప్రవేశ పెట్టిన బడ్జటును బలపరుస్తూ, నేను కొన్ని విషయాలు వారి దృష్టికి తీసుకునివస్తున్నాను. ఒక్కొక్క సంవత్సరము గడచిన కొద్దీ, Scheduled classes కుగాను కేటాయింపబడుతూ వస్తూన్న మొత్తము తగ్గుతూవస్తున్నదేకాని, హెచ్చుమాత్రము కావడములేదు. గతసంవత్సరము 66 లక్షల రూపాయిలు కేటాయించబడినప్పుడే, కొత్తగా ధరఖాస్తులు పెట్టుకున్న విద్యార్థులలో విద్యార్థి వేతనములు నూటికి ఏ పదిమందికోగాని లభించలేదు. ఈ సంవత్సరము యాభైఒక్క లక్ష చిల్లరమాత్రమే కేటాయించబడుతున్నది. దీనినిబట్టిచూస్తే, యీ సంవత్సరము గత సంవత్సరము అందిన పదిమందికిగూడ విద్యార్థి వేతనములు అందవేమోనని అనుకోవలసివస్తున్నది. అభివృద్ధి ప్రణాళికల నేర్పరచి దేశాభివృద్ధిని ఆకాంక్షిస్తూ ఉండే యీ సమయములో హరిజనుల అభివృద్ధికొరకై ఎక్కువ మొత్తములను కేటాయించుటకు ప్రయత్నించవలసిందిగా ఆర్థికమంత్రిగారిని కోరుతున్నాను.

Elementary Grade Training చదువుకునేవారిలో సగము మందికే Stipends యిచ్చే పద్ధతి చాలా అన్యాయము. ఈ ట్రైనింగు చదివేవారికి యితర ఆధారములులేని కారణముచేత, ఉన్నత విద్యను అభ్యసించుటానికి ఆర్థికస్తోమతు లేనందున, వారు ఎంతో పేదవారుగా ఉన్నందువల్ల అనేక బాధలకు గురి అవుతూ

యీ ట్రైనింగులో చేరడము తటస్థిస్తున్నది. కాబట్టి యిలాంటి పేదవాళ్లకు, అంటే యీ ట్రైనింగు చదివేవారికందరికీగూడ stipends యివ్వాలని కోరుతున్నాను. ప్రభుత్వము యీ విషయములో కొంచెము పునరాలోచించి యీ దీనుల యొక్క కష్టములను తీర్చుటానికి శ్రద్ధవహించవలసిందని నా కోరిక.

తర్వాత హిందీ, సంస్కృతము నేర్చుకునే విద్యార్థులకుగాను ఏర్పాటు చేయబడిన సదుపాయములు చాలా ప్రోత్సాహకరంగానే ఉన్నవి. రాయలసీమ సాధారణముగా వర్షాభావముగల ప్రదేశము. కాని భగవంతుడు అనుగ్రహించి ఏ ఒక్క సంవత్సరములోనైనా కొద్దిగా వర్షముపడితే, ఆనీరు వంకలు, వాగులు పారడము సంభవిస్తున్నది. ఈ వంకలలోనూ, వాగులలోను పారే కొద్దిజలమునైనా సక్రమముగా చెరువులకుచేర్చి, ఆ జలమును వ్యవసాయమునకు సద్వినియోగమయ్యే టట్లుగా చూడమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఇకపోతే యిప్పుడు మైసూరు సరిహద్దులలో ప్రవహించే నదులలోని నీటి పారుదలను మైసూరు సరిహద్దులలోఉండే అనంతపురము జిల్లాలోని మడకసిర, పెనుకొండ, హిందుపురము, కదిరి కళ్యాణదుర్గము, రాయదుర్గము తాలూకాలలోని ప్రదేశాలకు చేరకుండా అరికట్టడము జరుగుచున్నది. ఈ విషయము ప్రభుత్వము గమనించి, ఆనీటిని సక్రమముగా మన రాష్ట్రములోని ప్రాంతాలకు వచ్చేటట్లు చూడవలసినదిగా కోరుచున్నాను. గత ముప్పైసంవత్సరాలుగా మైసూరు ప్రభుత్వమువారు యీ నీటి పారుదలను అరికట్టినందువల్ల, అనంతపురము జిల్లాలో ఉద్యానవనము అనిపేరు గాంచిన మడకసిర తాలూకా కరువుదేవతకు శాశ్వత నిలయముగా ఉన్నది. ఈ విషయములో ప్రభుత్వమువారు తగుజాగ్రత తీసుకుని తగుచర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను. ముఖ్యంగా రాయలసీమలో నీటిపారుదల సౌకర్యాలు చాలా తక్కువగా ఉన్నవి. వాటిని బాగుచేయుట ప్రభుత్వముయొక్క కర్తవ్యమైయున్నది. ఇప్పుడుఉన్న కొద్ది సౌకర్యాలైనను ఉపయోగించుకొనుటకు విద్యుచ్ఛక్తి అవసరము. ఆర్థికమంత్రిగారు బడ్జటు ఉపన్యాసములో 16 వందల గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయిచేయబోతున్నట్లుగా చెప్పారు. కాని అది ఏఏగ్రామాలకు సప్లయిచేస్తారో తెలియడములేదు. రాయలసీమ క్షామపీడిత ప్రాంతమని మంత్రిగారికి తెలుసును. ప్రస్తుతముఉన్న కొద్ది నీటిని యీ విద్యుచ్ఛక్తిద్వారా సద్వినియోగపరచుకోటానికి వీలుకలుగుతుంది. అందువల్ల రాయలసీమలో వీలుఅయినన్ని గ్రామాలకు యీ విద్యుచ్ఛక్తిని విస్తరింపజేస్తూ, తక్కువరేట్లకు ప్రజలకు సప్లయి చేయాలని కోరుతున్నాను.

"గ్రామాభివృద్ధియే దేశాభివృద్ధి, గ్రామాలకు తరలండి" అని, పూజ్య బాపూజీ యువతీ యువకులకు ఉద్బోధించారు. కాబట్టి ప్రభుత్వము రాష్ట్రములోని గ్రామాల కన్నింటికి విద్యుచ్ఛక్తిని సప్లయిచేయాలని కోరుచున్నాను. ప్రభుత్వము గ్రామాల అభివృద్ధికొరకు ఎక్కువగా కృషిచేస్తారని ఆశిస్తున్నాను

మన రాష్ట్రములోఉన్న రహదారుల పొడవు 15 వేలమైళ్లు అనియు, అందులో 8722 మైళ్లుమాత్రము స్థానికసంస్థల ఆధీనములో ఉన్నవని చెప్పారు. కాని స్థానికసంస్థల ఆధీనములోనున్న రహదారులు మాత్రము ఎంత అధ్వాన్నపు స్థితిలోఉన్నవో వేరే చెప్పనక్కరలేదు. గ్రామ ప్రజల సౌకర్యాభివృద్ధికై ప్రభుత్వము ఎన్నిప్రణాళికలువేసి పనిచేయుచున్నదిన్నీ. గ్రామస్థులకు తెలియదు. కాని గతుకు గతుకుమనే రోడ్లపైన నడుస్తు ప్రత్యక్షముగా బాధ ననుభవిస్తూన్న ప్రజల కోసము యీ రహదార్లనైనా బాగుచేయాలనే తలంపు ప్రభుత్వానికి లేదు అని వారు తలంచి ప్రభుత్వమును నిందించుట జరుగుచున్నది. కాబట్టి ప్రభుత్వము గ్రామ రహదార్ల విషయమై శ్రద్ధ తీసుకోవలసినదిగా కోరుచున్నాను. కాబట్టి గ్రామాభివృద్ధికొరకై అభివృద్ధి ప్రణాళికలతో పాటు తగు శ్రద్ధ వహించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. స్థానిక సంస్థలకు ప్రభుత్వమువారు రోడ్లకుగాను యిచ్చే రోడ్డు సెస్సు, వేరేవిధముగా ఖర్చుచేయకుండా, యీ రోడ్ల రిపేరుకు మాత్రమే ఖర్చుచేసేటట్లు ప్రభుత్వము తగుచర్య తీసుకోవాలని అంటున్నాను. ఆ విధముగా చేయుటకు ప్రభుత్వము ఖచ్చితమయిన ఉత్తరువులు స్థానిక సంస్థలకు పంపుతారని ఆశిస్తున్నాను.

తరువాత గ్రామాలలో ప్రజలకు వైద్యసౌకర్యాలు బొత్తిగా లేవు. ఆరోగ్యమే మహాభాగ్యమనే సూక్తిని అనుసరించి, గ్రామములలోని ప్రజలకు యీపాటి సౌకర్యాలైనా ప్రభుత్వము చేస్తుందని తలంచుచున్నాను. ఈ సౌకర్యాలు అక్కడ చేయడము ఎంతైనా అవసరము వున్నది. తాలూకా ముఖ్యపట్టణములలో ఉండే వైద్యశాలలలో తగినమందులు గాని, surgical సామగ్రిగాని లేకుండా ఉన్నవి. కనీసము తాలూకా ముఖ్యపట్టణములలోని వైద్యశాలలోనైనా తగిన మందులు surgical సామగ్రి ఉంచడము ఎంతో అవసరమని అంటున్నాను. గ్రామాల విషయములోకూడ వేయిమంది జనాభాగల గ్రామాలలో ఒక వైద్యశాల, ప్రసూతి వైద్యశాలను తాలూకా వైద్యశాలలోనైనా లేడీడాక్టరును ఏర్పాటు చేయవలసిన అవసరము ఎంతైనా ఉందని ప్రభుత్వదృష్టికి తెస్తూఉన్నాను.

ఆర్థిక మంత్రిగారి బడ్జటు ఉపన్యాసము అంతా చదివిచూచాను. అందులో మహిళ సంక్షేమ శాఖను గురించి ఒక్క మాటకూడ లేదు. ఆ శాఖను గురించి

Srimathi B. Rukmini Devi] [7th March 1956

ప్రభుత్వము ఏఏ సౌకర్యాలు చేస్తున్నదిన్నీ తెలియపరచలేదు. ఆర్థిక మంత్రిగారు ఆ శాఖకు అధిపతి అయినందున, వారు తరువాతనైనా దీని విషయములో జవాబు చెబుతారని ఆశిస్తున్నాను. విశాలాంధ్రకు పోబోతున్నాము. విశాలాంధ్రావతరణకుముందే మన రాష్ట్ర ఆదాయమును పెంపొందింప జేసుకొని బడ్జెటు లోటును పూడ్చుకోవలసి ఉంటుందని ఆర్థిక మంత్రిగారు సెలవిచ్చినట్లుగా ఫిబ్రవరి నెల 28 వ తేదీన పత్రికలలో పడింది. అది చాలా వాంఛనీయమే. కాని దానితోబాటు మన రాష్ట్రములోని వెనుకబడిన ప్రాంతాల నన్నింటిని విశాలాంధ్రావతరణ లోపుగానే అభివృద్ధి పరచుకుంటే మంచిదని నా అభిప్రాయము. విశాలాంధ్ర ఏర్పడగానే మన దృష్టి తెలంగాణా అభివృద్ధికై వినియోగ పరచవలసి ఉంటుంది. కాబట్టి వెనుకబడిన ప్రాంతాలను మనము విశాలాంధ్రకు పోయే లోపుగానే అభివృద్ధి పరచవలసిందని ఆర్థిక మంత్రిగారిని కోరుతూ, ఉపాధ్యక్షులవారు నేను మాట్లాడటానికి యీనాడు అవకాశము యిచ్చినందులకు వారికి నా ధన్యవాదములు అర్పిస్తూ విరమిస్తున్నాను.

SRI B. SANKARAIAH :—అధ్యక్షా, ఈ బడ్జటు ఎటువంటి పరిమిత లక్ష్యాన్నికూడా సూచన చేయడంలేదు. Second Five Year Planకు సంబంధించిన ప్రణాళికా సంఘ సూచనలైనా నిర్దుష్టంగా లేదు. అందులో scheme లు ఫలానా అప్పుడు అమలు పరుస్తామనీ, ఆంధ్రదేశానికి సంబంధించిన ఎటువంటి అభివృద్ధి పథకాలు అమలు జంగాలో ఇదమిద్ధంగా చెప్పబడలేదు. భూసంస్కరణలు చాలా అవసరమైనప్పటికీ వాటినిగురించి స్థిరమైన అభిప్రాయం ప్రకటించలేదు. ఇంకో ఆరుమాసాల లోపల విశాలాంధ్ర నిర్మాణానికి పూనుకుంటున్నాం. మేము గత సంవత్సరంనుంచి ప్రభుత్వ దృష్టికి యీ విషయాన్ని తీసుకువస్తున్నాం. తెలంగాణా ప్రాంతంలో ఉండే మేరకైనా భూసంస్కరణల చట్టం కౌలుదారుకు రక్షణ కలిగించాలని కోరుచున్నాను. ఈనాడు బంజరుభూముల విషయంలో ఎన్నో అక్రమాలు జరుగుతున్నాయి. నెల్లూరు జిల్లాకు సంబంధించినంతవరకు దాదాపు పదివేల కుటుంబాలను ఈరోజు eviction proceedings పెట్టి భూములు చేసుకోకుండా చెయ్యాలని అనేక ప్రయత్నాలు చేస్తున్నారు. ఇది అక్కడుండే బీదరైతులకు, వ్యవసాయ కూలీలకు చాలా ప్రధానమైన సమస్యగా ఉన్నది. ఈ సంవత్సరం పండించుకున్న పంటను తీసుకుపోవడానికి వీలులేకుండా విపరీతమయిన penalties వేసి పంట కొయ్యగానే penalty లు కట్టమన్నారు. ఈ విషయంలో వెంటనే ప్రభుత్వం పూనుకుని ఆ eviction proceedings ఆపి, అది ఎంతవరకూ objectionable, దానివల్ల ఇతర ఆయకట్టుదార్లకు ఏమైనా నష్టంఉందా? అని

విచారణ జరిపించమని కోరుతున్నాను. కొన్ని చెరువులు ఎత్తివేస్తేగాని అక్కడున్న ఆయకట్టుదార్లకు నష్టమని P. W. D department చెప్పారు. వేగూరు చెరువులోగాని, తరుణవాయి చెరువుగాని, ఉన్నందువల్ల ఆయకట్టుదార్లకు submersion ఎక్కువై భూములు మునిగిపోతున్నాయని ఎత్తెయ్యమన్నారు. అటువంటి వాటిలో కూడా అధికార్లు eviction proceedings అమలు జరుపు తున్నారు. పది, పదిహేను సంవత్సరాలనుండి temporary పట్టాలుకూడా ఉండి సాగుచేసే భూముల విషయంలో ఐనా ఈ eviction proceedings తాత్కాలికంగా ఆపి, ఈ విపరీతమైన penalties వేయడం ఆపి, ఈ విషయాన్ని పునః పరిశీలన చేయమని కోరుతున్నాను. ఇది నెల్లూరు జిల్లాకు ముఖ్యమైన సమస్య. ఎక్కడైతే Eviction proceedings జరుపు తున్నారో అక్కడనే రాజకీయ బాధితులకు భూములు కేటాయించడం జరిగింది. ఈ వైరుధ్యంకూడా ప్రభుత్వం గమనించమని కోరుతున్నాను ఇది అక్కడున్న పదివేల కుటుంబాలకు సంబంధించిన సమస్య. మన రాజ్యాంగ చట్టంలో voter కు తనహక్కును వినియోగించడానికి యిచ్చిన రక్షణలకు వ్యతిరేకంగా రెండవ తరగతి పంచాయతీబోర్డు ఎన్నికలు గతపర్యాయం చేతులెత్తే పద్ధతిలో జరిగాయి అది అన్యాయమని చెప్పి అన్ని పార్టీలవారు చెప్పారు. ఇప్పుడు అంతకంటే అధ్వాన్న మయినపద్ధతి ప్రవేశ పెట్టబడుతోంది. పెనంమీద నుంచి పొయ్యిలోకి దూకినట్లయింది. ఇప్పుడు voter లు అందరూ ఒకచోటఉండి కష్టమైనా నష్టమైనా, తెలిసినతరువాత నిర్బంధాలువచ్చినా ఒక పర్యాయము చేతులెత్తుతుండేవారు. ఇప్పుడల్లా కాకుండా ఒక్కొక్కమనిషేపోయి ఆ Candidate ఎదుట ఉండగానే ఫలానా మనిషికి వోటు ఇస్తానని, పేరుపెట్టి చెప్పవలసియుంటుంది. దీనివల్ల కొట్లాటలు rioting లు జరిగే పరిస్థితు లేర్పడుతాయి. ఏ నిముషానికి ఆ నిముషం ఎవరికి ఎన్నివోట్లు వచ్చిందీ బైట తెలిసిపోతుంది. ఆ election ఉద్రేకాలలో Voter కు ఎల్లాంటి అన్యాయమైనా జరుగుటకు ఇది దారితీస్తుంది. ఒక్క vote, రెండువోట్లవల్ల decide అయ్యేపరిస్థితి ఏర్పడిందని బైట తెలిసినప్పుడు ఇంక ఆ Voter పైవచ్చేటటువంటి మామూలు ఒత్తిడే కాకుండా, ఇంకా ఎన్నిప్రమాదాలు ఏర్పడతాయో ఒక్కసారి మంత్రిగారిని ఆలోచించమని కోరుతున్నాను. ఇంతవరకూ జరుగుతున్నదే అన్యాయమని చెబుతూఉంటే కొంతవఱకు దాన్నిమార్చి మెరుగైనది ప్రవేశ పెట్టకుండా, ఇంత దారుణమైన పద్ధతిలో election లు జరపబోతున్నారు. ఇక్కడ Departmental Conference పిలిచారు. ప్రజల అభిప్రాయం అడిగారు. ఇన్ని చేస్తూకూడా రేపు April లో election పెట్టబోతున్నారు. ఆఖరుకు కాంగ్రెసుపార్టీ మీటింగులోనైనా కనీసం దానిమీద చర్చలకు అవకాశం ఇవ్వలేదు.

ప్రజలందరికి democracy లేకపోయినా—కనీసం party democracy అనేది కూడా లేకుండా April ఒకటవతేదీనుంచి ఆంధ్రదేశంలో అనేకచోట్ల, ఇటువంటి అన్యాయమైన పద్ధతి అమలుజరిపి కొట్లాటలకు, ఇంకా అనేక విధమైన ఘోరాలకు అవకాశం కల్పిస్తున్నారు. ఒక Voter బైట ఉన్నప్పుడు, ఆఖరి Vote తో decide అయ్యేపరిస్థితి ఏర్పడితే ఎటువంటి దుష్పరిణామాలు కల్గుతాయో యోచించమని మళ్ళీ, మళ్ళీ మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను. ఇంకొకటి ఏమిటంటే అధికార్లుకూడా అన్యాయం చెయ్యడానికి ఒకక్రొత్త Provision పెట్టారు. అవసరమైతే ఏజంట్లనూ, candidates నుకూడా బైటకు పంపించవచ్చును. అధికారి తన ఇష్టం వచ్చినవారికి 'ఆ Vote వేసే అవకాశం కల్పించారు. ఇదివఱలో వోటర్లందరూ ఒక్కచోటనేఉండి తమ Vote లు record చేసుకుంటారు. ఇప్పుడు ఇతరులు లేకుండా Voter తాను ఒక్కడే తన ఉద్దేశ్యాన్ని అధికారికి తెలియజేసినప్పుడు, అందరు ఉద్యోగస్థులు న్యాయంగా సత్ప్రవర్తన గలిగియుంటారని ఎవరూ కూడా హామీ ఇవ్వలేరుగదా ? ఒక్క Officer కు, ఎవ్వరూ అక్కడ లేకపోతే తన ఇష్టంవచ్చినట్లు Vote వినియోగించే విపరీతమైనటువంటి అధికారం ఇవ్వడం చాలా అన్యాయం. Agent ని బైటకు వెళ్ళగొట్టవచ్చు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Extra-ordinary circumstances లో.

SRI B. SANKARAIAH :—ఈ extraordinary circumstances ను అధికార్లు దుర్వినియోగం చెయ్యడానికి వీలుందా లేదా అని అడుగుతున్నాము.

THE HON. DR. B. GOPALA REDDI :—వారు మరీ నెత్తినకొళ్ళు పెట్టుకుని గలభాచేస్తారంటే పొమ్మంటాడు.

SRI B. SANKARAIAH :—అక్కడ ఏజంటు సమస్యలేదు. Voter వెళ్ళి స్వయంగా పెట్టెలో Vote వేయుటకు అవకాశంఉంది. ఇక్కడట్లాకాదు. Voter అధికారితో చెప్పివెళ్ళడం, అధికారి ఆ Vote వెయ్యాలన్నమాట. ఎవరికి Vote పడిందో ఆ Voter కు తెలియదు. అధికారివల్ల అన్యాయం జరుగుటకు అవకాశంఉంది. ఏ నిముషానికి ఆ నిముషం Polling results బైటకు తెలిసేపద్ధతి. ఇటువంటిది మనదేశంలో ఎక్కడాలేని పద్ధతి. ఏ దేశంలోకూడా లేని పద్ధతి. ఇది అంతయు అశాంతికి దెబ్బలాటలకూ కారణభూతమయ్యే Voting పద్ధతి ప్రపంచంలో ఎక్కడాలేదు. ఇది మనరాజ్యాంగచట్టంఇస్తూఉన్నటువంటిహక్కులను

పూర్తిగా త్రుణీకరించే పద్ధతి. Voter ను ఇంత inconvenient పరిస్థితులలో పెట్టి ఇదిగో నీ Vote వల్ల decdie అవుతుందని బైటతెలిసినప్పుడు ఆ Voter ను ఏమిచేస్తారో, Protection ఏమీ ఉండదు. ఈ నెలలో election లు జరుగబోవడంలేదు. ఇంకా time ఉన్నది రాష్ట్రవ్యాప్తంగా ప్రజలు ఆందోళన చేశారు. అన్నిపార్టీలవారూ చెబుతున్నారు. కనీసం కాంగ్రెస్‌పార్టీలోనైనా దీన్ని చర్చించుటకు అవకాశం ఇవ్వండి. మీ పార్టీలోగూడ ఇప్పుడుతప్ప చర్చించుటకు వీలులేదని చెప్పినట్లు తెలుస్తోంది. తరువాతనైనా దీన్ని ఆలోచించండి. ఈ election లు తాత్కాలికంగా రెండునెలలు ఆపినా కొంపమునిగేది ఏమీ లేదు. శాంతంగా ఆలోచించమని కోరుతున్నాను.

ముఖ్యముగా మా నెల్లూరుజిల్లాకు సంబంధించి నంతవరకు వైద్య సౌకర్యములు చాలా తక్కువ. Head Quarters Hospital లో 30 Beds ఉన్నవి గాని ఎప్పుడూ 300,360 రోగులకు తక్కువ ఉండరు. ముగ్గురు డాక్టర్లు ఉన్నారు. అందులో ఒకరు R. M. O. ఇన్‌పేషంట్సుకు తగినంత మంది డాక్టర్లులేరు. Staff కూడా లేరు. నాలుగు ఇంజక్షనులు ఒకేసారి ఇస్తామంటారు.

THE HON. Dr. GOPALA REDDI :—మరి Towns కే చేస్తున్నారంటారే ?

SRI. B. SANKARAIAH :—ప్రజలందరకు సౌకర్యములు కలుగ చేయవలెను. Head Qwarters హాస్పిటల్ అంటె జిల్లాకు సంబంధించినది. కావలసినంత మంది staff లేరు Honorary వారిని వేశారు. వారు 1,2 గంటలు మాత్రము ఉంటారు. వారికి పూర్తి బాధ్యత ఉండదు.

THE HON. A. B. NAGESWRA RAO :—ఆనరీ డాక్టర్లకు కూడా Hours of work ఉంది. వారు 2,3 గంటలు ఉంటారు వారి మీద చర్య తీసుకునేదానికి D. M. O. కు అధికారం ఉన్నది.

SRI B. SANKARAIAH :—11,12 గంటలకు వస్తారు. మరల 1 గంటకు, రెండు గంటలకు వెళ్లిపోతారు. తెలుస్తుంది. అటువంటి విషయాలను విచారించి కనీసము అవసరమైన సదుపాయాలను చేయించవలయును. ఇంతవరకు కొవ్వూరు ఆసుపత్రి గవర్నమెంటు ఆసుపత్రిగా ఉండేది. అది తీసివేయడము చాలా అన్యాయం. కావాలంటే contribution ఇవ్వడానికి కొంతమంది సిద్ధముగా ఉన్నారు. తాలూకా Head Quarters ఆసుపత్రిని ప్రభుత్వ hospital గాకూడా తీసివేయడం న్యాయంకాదు. రెండు సంవత్సరాలనుండి అడుగుతున్నాను. ఎంత

సేపు చేస్తామని మాత్రము అంటున్నారు. ఇంతవరకు ఏమీ చెయ్యలేదు. కొవ్వూరు టౌనుగాఉంది. Population 15000 ఉంటుంది.

S. S. L. C. పరీక్షలకు కొవ్వూరునుంచి, అల్లూరుకు—అల్లూరు నుండి కోవూరుకు రావడము చాలా కష్టము. ఆత్మకూరు తాలూకా నుండి నెల్లూరుకు 40 మైళ్లువచ్చి పరీక్షకు కూర్చోడము చాలా కష్టము. రావాలసిన పరిస్థితులు ఉన్నవి. ఈ పరిస్థితులు ప్రభుత్వానికి, సెక్రటేరియటువారికి తెలియవు. ఈ విధముగా నెల్లూరు D. E. O. కమిషనరుకలిసి, ఈ స్కీము తయారుచేశారు. కమిషనరు ఆఫీసు నుంచి ఈ ఆజ్ఞలు వచ్చినవి. వారికి Protection కావాలంటే పోలీసు కాపలా పెట్టండి. అల్లూరు నుంచి పిల్లలందరూ కోవ్వూరు రావడానికి Expenses meet కాలేరు. Hotels లేవు. Facilities లేవు. చిన్న పిల్లలు 10, 12 సంవత్సరాల వయస్సు గలవారు దూర ప్రదేశానికి రావడం కష్టము. ఈ విధముగా ఇంత దూరములో సెంటరు పెట్టడను అన్యాయము రాష్ట్రముఅంతటా ఉంటే సమస్యకాదు. ఏ ఒక్క స్కూలు లోను కాపీకొట్టడము జరిగితే తగిన చర్యలు తీసుకోవచ్చును. తల్లి దండ్రులకు, పిల్లల అందరకు punishment ఇవ్వడము న్యాయముకాదు. 10, 18 మంది కోసము ఈ విధముగా చెయ్యడం న్యాయంకాదు. మన ముఖ్యమంత్రిగారు ఇప్పుడైనా చర్య తీసుకోవచ్చును. జవాబు రాలేదంటున్నారు. Too late కాదు. Status Quo maintain చేసినప్పుడు time లేక పోవడం అన్న మాటలేదు. 24 గంటలు time చాలును. ఇంకా time ఉంది. ఈరోజు 7వ తారీఖు, 13వ తేదీ కదా Examination. అల్లూరు హెడ్‌మాస్టరును ఆ ఊరిలో ఉంచ నవసరంలేదు. Interested people, నెల్లూరువారు, చేసినట్లు ఉంది ఇది అంతా. ఇప్పటికైనా, ఈ రోజున అయినా టెలిగ్రాంద్వారా ఆర్డర్లు ఇప్పించివలెనని నేను కోరుచున్నాను. ఇటువంటి అన్యాయాలు జరిగినప్పుడు ప్రభుత్వం సరి అయిన చర్య తీసుకుంటే అన్యాయాలు ఆపవచ్చును. ఈ ఆర్డర్లుకూడా 10 రోజులక్రితమే వేసినవి. అక్కడి Head Masters గాని, విద్యార్థులుగాని తెలియచేసుకొనడానికి టైము లేకుండా ఈ విధముగా ఎందుకు చెయ్యవలసి వచ్చింది? Status quo maintain చెయ్యడము కష్టములేదు.

పోయిన బడ్జెటు సమావేశములో నేను చెప్పాను. నెల్లూరు జిల్లాలో పోలీసు ఉద్యోగస్థులు ఒకపార్టీ, ముఖ్యముగా కమ్యూనిస్టుపార్టీ అభిమానులపై కేసులు బనాయించారు. ఈ విషయమై విచారణ జరిగింది. కాని అక్రమంగా ప్రవర్తించిన వారిపై చర్య తీసుకోలేదు. కొన్ని కేసులను ఉపసంహరించుకొనలేదు. అల్లూరు ఒక పార్టీమీద ఏలెక్షను కేసుమాత్రము ఉపసంహరించుకున్నారు. ఒకపార్టీమీద

సెక్యూరిటీ కేసులు ఉండనే ఉన్నవి, అందులో న్యాయములేదు. ఉప్పలపాడులో రెండువైపులవారికి దెబ్బలాట జరిగితే ఒకపార్టీవారిమీద 5, 6 మందిపై సెక్యూరిటీ కేసులు పెట్టారు. ఈ విషయం ప్రభుత్వదృష్టికి మేము తీసుకొని వచ్చాము. ప్రభుత్వం విచారిస్తే నిజము తేలుతుంది. అల్లూరు సెక్యూరిటీ కేసులలో పోలీసులు ఎంత అన్యాయంగా ప్రవర్తించినారో తెలుస్తుంది. ఈరోజునకైనా మించినది లేదు. ఇవి సివిలుకోర్టుకు సంబంధించినవి కావు రివెన్యూ కోర్టులో 107 సెక్షన్ క్రింద సెక్యూరిటీ కేసులు పెట్టారు. ఆ గ్రామస్థులను విచారించి తగినచర్య తీసుకుంటే ఇకమీద పోలీసులు పక్షపాతంగా ఉండరు. జాగ్రత్తగా ఉంటారు.

Sri P. GUNNAYYA :—ఈదినం అధ్యక్షులవారు రూలింగ్ ఇచ్చారు. ఒక సభ్యుడు మాట్లాడి 15 నిమిషాలు అయింది. ఇంకా అయిదునిమిషాలు యిస్తామన్నారు. ఇపుడు మాట ఏమిటి? అమాయకులకు అవకాశం యిస్తారా, యివ్వరా?

MR. DEPUTY SPEAKER :—4 × 8 (32) నిమిషాలు ఈతట్టు ఇస్తున్నాను. ఇక్కడ 15 నిమిషాలు యిస్తున్నాను. రెండు నిమిషాలు వారికి ఉండదు.

SRI B. SANKARAIAH:—చిన్న చిన్న ఉద్యోగస్థుల విషయము ప్రభుత్వ దృష్టికి అప్పుడప్పుడు తెస్తున్నాము. మనము విశాలాంధ్రకు పోయేటప్పుడు అక్కడ ఉండే చిన్నఉద్యోగస్థుల జీతాలు ఇచ్చుటికంటె హెచ్చుగా ఉన్నప్పుడు దానికి అనుగుణముగా యిక్కడివారల జీతాలు హెచ్చుచేసేదానికి ఈ బడ్జెటులో కేటాయించక పోవడమనేది చాలా లోపమైనటువంటి విషయము. కర్నూలులోనే S.A.P. లు యింకా తదితరులు కొన్ని వందలమంది నలభైరూపాయల జీతాలతో ఉంటున్నారు. ఏ రెండువందల మైళ్ళనుండో యిక్కడకు కుటుంబములు తీసుకొనివచ్చి ఆ నలభై రూపాయలతో గడపాలంటే చాలా కష్టము. ముఖ్యమంత్రిగారు ఒకసారి మద్రాసు అసెంబ్లీలో మంత్రిగా ఉండినపుడు జవాబుచెబుతూ వాళ్ల కేమి పోలీసులు ఎక్కడైన సంపాదించుకుంటారు అన్నారు. ఈ S.A.P. వాళ్ళు ఎక్కడికి పోతారు? అటువంటి వాళ్లు ఈ నలభై రూపాయలతో కుటుంబాన్ని పోషించుకోవాలంటే చాలా ఘోరంగా ఉంటుంది. అయితే వాళ్ల యిష్టముంటే రమ్మని చెప్పవచ్చు. మనకు స్వతంత్రము వచ్చి పదిసంవత్సరములు అయినప్పటికి ఏ గతిలేక కుటుంబపోషణకు చాలినంత సంపాదించుకోలేక ఆ జీతాలకు రావడం మనకే అవమానకరం. కొంత

వరకైన మన విశాలాంధ్రను దృష్టిలో పెట్టుకొని మనము విశాలాంధ్ర నిర్మాణంలో వారిజీతాలను కొంతవరకైన పెంచితే బాగుంటుంది.

ఈ బడ్జెటు విషయమై "ఆంధ్రప్రభ" కంచు కాగడా పెట్టి వెతికిచూచి నప్పటికి మన ఆంధ్రభాషకు ప్రోత్సాహమిచ్చే విషయము ఒక్కటికూడా లేదని వ్రాసింది. ఆంధ్రులం ఎన్నో లక్షలమందిమి ఎంతో త్యాగముతో ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించుకున్నాము ఇదివరకు సలిపిన పోరాట ఫలితంగా విశాలాంధ్రను సంపాదించుకో గలిగాము. మన ఆశయాలకు అనుగుణంగా మన పరిపాలన తెలుగుతో జరిపించడం న్యాయం కాదా? అలా చేయకపోతే ప్రజల ఆశయాలకు అన్యాయము చేసినవాళ్ల మవుతాము.

విశాలాంధ్ర నిర్మాణములోపల ప్రభుత్వము మన Assembly proceedings గాని జిల్లా పరిపాలనగాని తెలుగులో జరిపించి విశాలాంధ్ర నిర్మాణము తర్వాత తెలుగులోనే పరిపాలన జరుగుటకు ప్రోత్సాహము ఇవ్వగలుగుతాము.

SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా, నేను ద్విసభ్య నియోజక వర్గమునుండి వచ్చాను. సోదర సభ్యుడు లేరు. అందుచేత మేమిద్దరము మాట్లాడగల కాలము నాకిప్పించాల్సిందని, సోదరుడు మంచినీళ్లు త్రాగినంత సేపు నేను మంచినీళ్లు త్రాగకుండానే మాట్లాడుతానని మనవి చేస్తున్నాను. బడ్జెట్టు చూసినప్పుడు భూపాలుడైన గోపాలుడు రచించినట్టిదిగా ఉన్నది—కుక్కుటపాలుడని నేననడము లేదనుకోండి. ఇది చాలా సర్వాంగసుందరమైనది. అందులో నాబోటి ఆంగ్లభాషా పరిచయము లేనటువంటివానికి ఆంధ్రలో చాలా చక్కని భాష, చక్కని get up, చక్కని శైలిలో ఉంది. అయితే ఈ బడ్జట్టు ప్రారంభించిన రోజున మా మిత్రుడు శ్రీ గున్నయ్యగారు కూడా ఒక Long coat వేసుకొచ్చారు. శ్రీ గోపాలరెడ్డిగారు కూడా ఒక Long coat వేసుకొచ్చారు. ఈ రెండు రోజులు ఆలోచించి చూస్తే ఈ Long coat గున్నయ్యగారిది కాదు. Sheik Moula గారిదని తేలిపోయింది.

Sri P. GUNNAYYA :—విశాలాంధ్ర వస్తూంది. హైదరాబాదు విశాలమైనటువంటి హృదయముతో గోపాల రెడ్డిగారి మంత్రివర్గము అక్కడికి పోతుందనే ఉద్దేశముతో అటువంటి Long coat పొగా వేసుకొని వచ్చానని గౌరవసభ్యులకు మనవిచేస్తున్నాను.

SRI N. SRINIVASA RAO :—అందుచేత ప్రస్తుతము ఇక్కడ ఉన్న హరిజన శాసనసభ్యులు వేసుకున్న దుస్తులనుబట్టిగాక, గున్నయ్యగారి పొరువు కోటు మాదిరిగానే రాష్ట్రంలో ఉండే హరిజనులయొక్క స్థితి ఉందనే విషయము చాలా

మంది సోదరసభ్యులకు తెలిసినటువంటి విషయమే. గౌరవ సభ్యురాలు రుక్మిణమ్మగారు చెప్పినట్లు హరిజనుల స్థితి "నానాటికి తీసికట్టు నాగంభొట్లు" గా ఉన్నది. ఒకప్రక్కన ప్రధానమంత్రిగారు అంగీకరిస్తున్నారు. దిన దినము జనాభా పెరుగుతుందని, జనాభా పెరిగినప్పుడు అందులో హెచ్చుభాగము Scheduled class లోనే పెరగడమనేది సావకాశముగా ఉన్నది. ఎక్కువమంది పెరుగుతున్నారనే లెక్కలుకూడా తేలుతున్నవి. అలాంటి పరిస్థితులలో జనాభా పెరిగినప్పుడు వారియొక్క ఇండ్ల స్థలాల సమస్య, వారియొక్క ఆర్థికపరిస్థితి, వారి వస్త్రముల పరిస్థితి, విద్యావిధానము ఇవన్నీ కూడా ప్రపోర్షనేటుగా పెరుగుతుందన్న సంగతి మీకందరికి కూడా తెలిసిన విషయమే. 1932 వ సంవత్సరములో తీసిన statistics ప్రకారము అప్పుడుండేటటువంటి హరిజనులకు డబ్బు ఎంత కేటాయించినారో ఇప్పుడు 1956 వ సంవత్సరములోకూడా అంతే డబ్బు కేటాయించడము, తగ్గించడము, ఆర్థికపరిస్థితుల దృష్ట్యా, జనాభా పెరుగుదల దృష్ట్యా న్యాయమైనటువంటి విషయము కాదని తమ ద్వారా ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. రెండవది, ప్రభుత్వము ధైర్యముగా socialistic ప్రణాళికను అమలు జరుపడానికి పూనుకున్నదని శ్రీ గోపాలరెడ్డిగారు తమ ఉపన్యాసంలో వ్రాశుచ్చారు. చాలా సంతోషమైనటువంటి విషయము. గాంధియన్ సోషలిజమో, కారల్ మార్క్స్ సోషలిజమో లేక యుటోపియన్ సోషలిజమో ఏదో ప్రజాసోషలిజమో రకరకాల సోషలిస్టు అభిప్రాయాలున్నవాళ్లు మనమంతా ఉన్నాము. బాగానే ఉంది. అయితే ఈ సోషలిస్టు సమాజానికి ఎక్కడ పునాది వేయాలి, ఎక్కడనుంచి ప్రారంభించాలా అనేటప్పుడు దానిపై సోదర సభ్యులు మాట్లాడారు. బట్ట ఉత్పత్తిదారుల గురించి మాట్లాడారు. తరువాత కార్మికరంగంలో Industrial Labour ను గురించి మాట్లాడారు. కాని అన్నము ఉత్పత్తిచేసేటటువంటి వ్యవసాయకూలీల గురించి ఏమిచర్య తీసికుంటుంది. వారికోసము మనము ప్రత్యేకించి యేమి చేశాము అనే విషయము మనము పరిశీలించాలి. Socialistic Pattern of Society లో Industrial Revolution లేనటువంటి Agricultural country గా ఉన్న మన భారతదేశము, అందులో ముఖ్యముగా ఆంధ్రదేశములో వ్యవసాయ కూలీలయొక్క ఆర్థిక పరిస్థితిని బాగుచేయడం కోసం వేసే పథకాలుగాని తదితర ప్రణాళికలుగాని మనము ఆలోచించవలసి ఉంటుంది. కేంద్ర యూనియన్ మంత్రి నిన్న మాట్లాడుతూ పంచవర్ష ప్రణాళికలు అమలుజరిగినకొలదీ జాతి మత భేదాలు జరుగుతున్నవని చెప్పినట్లు నిన్న గాక మొన్ననే పత్రికలో ప్రకటించిన విషయము తమందరికి మనవిచేస్తున్నాను.

అదేవిధంగా ఈ National Extension Scheme లోగాని Block Development లోగాని ధనికులైనటువంటి శాసనసభ్యులు ఎక్కువగా కొరుట్టు...

Sri N. Sreenivasa Rao] [7th March 1956

వేసుకొని తిరగగలిగినవారు. ఎక్కువ మొత్తాన్ని Local development లో సేకరించగలిగి నటువంటివారు జిల్లాలో ఉంటే మొత్తం Local development డబ్బును గద్దల్లాగున తన్నుకుపోతున్నారు. మెరక ప్రాంతాల్లో తిరగ లేనటునంటి శాసనసభ్యులు జపిక లేక కాదు ఆర్థిక స్థోమత లేక, తిరగలేనటువాళ్లు విశాలమైనటు వంటి నియోజకవర్గము ఉన్నప్పుడు అన్ని చోట్లకు వెళ్ళి Statistics సేకరించలేనటు వంటివాళ్లు అన్యాయమైనటువంటి పరిస్థితులకు గురి అవుతున్నారు. అందుచేత మనము పంచవర్ష ప్రణాళిక ఒక planned economy ని చేస్తున్నప్పుడు మనయొక్క Plan కు ప్రధాన సూత్రమేమిటి ? అట్టడుగున పడిపోయినటువంటి జాతులకు జరుగుతున్నటువంటి సౌకర్యాలను గురించి మనము Cabinet లో లేనప్పుడే శ్రీ గోపాలరెడ్డిగారు యింకా యితర కాంగ్రెసువారు ఎక్కువ సహాయము చేశారా ! అని నా కనిపిస్తుంది. కాని మంత్రివర్గానికి తెలియకుండానే డిపార్టుమెంటుల వారు ఘోరమైనటువంటి అన్యాయమైనటువంటి ఆర్డర్లు పంపిస్తున్నారు. మన పార్టీ ప్రోగ్రాములోగల అస్పృశ్యతానివారణ, హరిజనోద్ధరణ అనేటటువంటి ప్రధాన సమస్యలపై మనకు తెలియకుండానే అనేక ఆర్డర్లు పంపించి అనేకచోట్ల తారు మారు చేస్తున్నారని మనవి చేస్తున్నాను. హరిజన వెల్ఫేరుకు వేరుగాపెట్టినటు వంటి పాఠశాలలను మూసివేయడానికి అప్పుడే Departmental circulars ప్రతి జిల్లా హరిజన వెల్ఫేర్ ఆఫీసర్లకి పంపించారని మీకు మనవిచేస్తున్నాను. అంతే గాదు జిల్లాలో వుండేటటువంటి హరిజన వెల్ఫేరు హాస్టల్సు అన్నిటినీకలిపి ఒకే ఒక కేంద్రహాస్టలుగా పెట్టాలని ప్రయత్నము చేస్తున్నారంటే పరిస్థితులు ఎంత విషమించాయో ఆలోచించవచ్చును. విద్యార్థులను తొండంగినుంచి లేక తునినుంచి తీసికొచ్చి రాజమండ్రీలోనో. పోలవరంనుంచి స్త్రీలను తీసుకువచ్చి ఏలూరులోనో ఉండమంటున్నారు. మారుమూలల్లో ఉండేటటువంటి వారిని తీసుకునివచ్చి అలవి గాని ప్రదేశంలో ఒక కేంద్రమంటూ సృష్టించి అక్కడకు తీసుకురావాలని ప్రయ త్నాలు చేయడం చాలా విచారకమైనది, ఇలాంటి ప్రయత్నములు ప్రభుత్వానికిగాని Legislative party policy కిగాని తెలియకుండానే Administrative Department వారు ఇటువంటి ఘోరకృత్యాలు చేస్తున్నారనే విషయాన్ని నేను మనవిచేస్తున్నాను. ఆర్థికమంత్రిగారు తక్కువ డబ్బివ్వవచ్చును. ఎక్కువ డబ్బివ్వ వచ్చును. దానికోసం నాకేమి బాధలేదు. ఎందుచేతనంటే ఈవేళ ఆర్థికపరిస్థితి బాగులేనప్పుడు డబ్బు తక్కువ యివ్వండి. కాని ప్రధానమైనటువంటి సూత్రాల్లో ప్రధానమైనటువంటి పాలసీలల్లోనే చాల విభిన్నమైనటువంటి దృక్పధాలు ఈ డిపార్టుమెంటులు తరఫున జరుగుతుందనే విషయాన్ని మనవిచేస్తున్నాను. ఒకప్రక్కన మీరు రామరాజ్యాన్ని స్థాపించడానికి సామ్యవాదము స్థాపించడానికి కృష

చేస్తుంటే ఇంకొకప్రక్కన రావణ రాజ్యాన్ని స్థాపించడంకోసం ఉద్యోగస్తులు కృషిచేస్తున్నారని మీకు నేను మనవిచేస్తున్నాను. ఉదాహరణకు ఒక్క చిన్నవిషయము చూచుకుంటే వ్యవసాయ కూలీలకిన్నీ ఒక భూస్వామికిన్నీ జరిగిన సంఘటనల్లో పదిసంవత్సరాలుగా పైలు జరుగలేదు. ఎక్కడ పైలు అక్కడనేఉన్నది. అందుచేత మేము పదిమంది M. L. A లము Representation యిచ్చి అప్పుడు హరిజన మంత్రిగావుండేటటువంటి సంజీవయ్యగారికి మనవిచేసుకున్నాము. "జరుగుమెల్లిపైలు జరుగుట లేదయా, సవినయముగ వినుము సంజీవయా" అంటే జరుపగలిగినట్టి సామార్థ్యముందయా చిత్తగించవయా శ్రీనివాస" అని ఆయన పద్యానికి పద్యమే చెప్పారు. చివరకు ఏమిటయ్యా జరిగిందంటే జరుగుమల్లిలోన జరిగిన కథలంత శ్రద్ధగాను మేము సేకరించి ముఖ్యమంత్రికీయ మూతివిరచెనుగాని న్యాయమేమో చేయడాయె దేవా" అని ఆ హరిజనులు అక్కడ బాధపడే పరిస్థితులు చెపుతున్నవి. దేశములో వ్యవసాయ కూలీలను అభివృద్ధిచేయాలని, భూములన్నీ పేదవాళ్లకు పంపకము చేయాలని చెపుతున్నారు. ఒకప్రక్కన బ్రహ్మాండమైనటువంటి భూదానయజ్ఞము జరుగుతోంది. ప్రభుత్వం భూసంస్కరణలు తెస్తామని పదేపదే చెప్తున్నది. కాని తిండినిపండించే బీదహరిజనుడు దుర్భరపరిస్థితులకు గురిఅవుతుంటే ఎటువంటి సహాయం చేయలేకపోతున్నది. ఇలాంటి పరిస్థితులలో ఎవరి అస్థికలపై ఏ శ్మశానంపై ఈ సోషలిస్టు తరహా సమాజాన్ని స్థాపించ నిశ్చయించుకొన్నదో ఊహకు అందడంలేదు. ఎదో Elections కు తప్ప అన్ని రాజకీయ పార్టీలవారు, కేవలము పాలిటేరిక్ డిక్టేటర్‌షిప్పు కావాలనిచెప్పేవారుకూడా. ఇటువంటి విషయములో ఒక సత్యాగ్రహసన్నాహమో, ఒక సమరసన్నాహమో, ఒక విప్లవ సన్నాహమో, ఎదో చేసి దీనికోసం కృషిచేయడంకూడ కనిపించడములేదు. నాకు తెలుసు. ఈ సోషలిస్టు సూత్రాలను వల్లించేవారు, మార్కిస్టు సూత్రాలువల్లించే మహానుభావులంతా చాల High status నుంచి వచ్చినటువంటివారు. "ఆకలిగొన్నవాడెరుగు ఆకలి బాధ, సమస్త రుచ్యముల్ పీకసమెక్క బెవ్వుమని పీల్చెడివా డెరుంగునే ఆకలి బాధ" గుడ్లు పైకొచ్చేవరకు గులాబుజామ్, ఆయాసము వచ్చేవరకు పాయసము తిని టెంబోసిల్కు ధరించి క్యాప్‌స్టన్ సిగరెట్టుకాల్చి ఎదో ఒకజండా బుజానవేసుకొని ఆకలి ఆకలి అని అరుస్తే అంతమాత్రముచేత ప్రజల ఆకలికి సహాయము చేసేదానికి పనికిరాదు. కాకపోతె ఒకపర్యాయము M. L. A లుగా అవడానికి వీలుకల్గించింది తప్ప అంతకు మినహా దేనికీ పనికిరాలేదు.

అందుచేత ఆసెంబ్లీలో నేడు అందరు శాసనసభ్యులు చూడవలసింది ఏమిటి ? బట్ట ఉత్పత్తి సందర్భంలో మీరు Cess Fund ఇస్తున్నారు. రైతులకు ఋణాలు

Sri N. Sreenivasa Rao] [7th March 1956

ఇస్తున్నారు. నీళ్లు విడవకపోతే బావికి ఋణాలు ఇస్తున్నారు. నాలుగు నెలలు పని ఉండి, ఎనిమిది నెలలు పని లేకుండా నికృష్ట జీవితంగడిపే అన్నా ఉత్పత్తి చేస్తున్న వ్యవసాయకూలీకి మీరు ఇస్తున్న Subsidy ఏమిటి అని ఆలోచించాలి. చేనేత రంగంలో అనేకమంది హరిజనులున్నారు. నూలునేత, సాలెనేత అనే సామెత మనకు ఉన్నది. గుంటూరుజిల్లాలో, నెల్లూరుజిల్లాలో, రాయలసీమలో అనేక చోట్ల వందలాది హరిజనులు చేనేత కార్మికులుగా ఉన్నారు. వారిని సిరిజనులు Co-operative Societies లో చేర్చుకోరు. ప్రత్యేకంగా వారు societies పెట్టుకోడానికి సావకాశంలేదు. మీరు ఇచ్చిన Cess Fund లో నుంచి హరిజన్ Weavers కు ఎంత చేరిందనే విషయంమీద మీరు జవాబు చెప్పాలని కోరుతున్నాను. ఈ ప్రణాళికను అమలుజరపడంలో Budget నిర్మాణాలు చేయడంలో ఉమ్మడి రాష్ట్రంలో ఆర్థిక మంత్రిగా పనిచేసిన మన ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారికి అనుభవంలేదని చెప్పను. కొంచెం తీరిక చేసుకొని వెనుకబడిన ప్రాంతాలను గురించి ఆలోచించాలని కోరుతున్నాను. అభివృద్ధి చెందిన ప్రాంతాలలోమాదిరిగానే వెనుకబడిన ప్రాంతాలలో అర్థగ్రాంటు, నాలుగవవంతు గ్రాంటు పెడితే కష్టంగా ఉంటుంది. కరువు ప్రాంతాలను నిర్ణయించేటప్పుడు స్థానికంగా ఉండే రివిన్యూ అధికారుల రిపోర్టులమీద ఆధారపడి కరువు ఉన్నదని ఎట్లా నిర్ణయిస్తారో అదే విధంగా వెనుకబడిన ప్రాంతాలనుగురించి మీకు ఏమి రిపోర్టులు పంపుతున్నారు ; సాధారణమైన నాలుగు అణాలు పంట అయినా ఉన్నదా ; రహదారులున్నాయా లేవా ; Forest produce ఏమిటి ; సాధక బాధకాలు గమనించి Backward Areas కు ఆదనంగా సహాయంచేయాలనేది చూడవలసి ఉంటుంది. చింతలపూడి నియోజకవర్గంలో వందలాది గ్రామాలకు రహదారి సౌకర్యాలులేవు. ఉండడానికి అరణ్యాలున్నాయి. Water Water Everywhere అన్నట్లు అన్నీ అడవులే కాని వంట చేసుకోడానికి వంట చెరుకులేదు. దీనిని గురించి వేలకొలది మహజర్లు పంపాము. Chief Minister దీనిని గురించి ఏదో కమిటీవేసినారు. Forest లో ఉన్న వాళ్లకు పుల్లలు దొరకని పరిస్థితి వస్తోంది. ఇటువంటి ప్రజావసరాలను తీర్చే విషయంలో జాప్యంచేయకుండా సత్వరమైన కార్యాచరణ తీసుకుంటే ప్రజామోదము పొందడానికి, గోపాలుడు భూపాలుడుగా నిర్ణయించుకోబడడానికి సావకాశం ఉంటుందని నాకు కనిపిస్తోంది. తరువాత వైజ్ఞానిక రంగానికి సంబంధించినంత వరకు మనం దేశంనుంచి విదేశాలకు Cultural Delegations పంపుతున్నారు. వైజ్ఞానిక రంగంలో, సాంస్కృతిక రంగంలో ఎంతో అభివృద్ధి చెందవలసియున్నది. ఇక్కడ ఆంధ్ర నాటకకళా పరిషత్తుకు అధినేతలున్నారు. భాషాపోషకులున్నారు. కవులున్నారు, గాయకులున్నారు. మంచి నటనా చాతుర్యం ఉన్న నా మిత్రుడు

శీర్ల బ్రహ్మయ్యగారివంటి వారున్నారు. నాటకాలంటే Objectionable నాటకాలు - హింసావాదాన్ని, వ్యక్తిగత వాదాన్ని ప్రేరేపించే - నాటకాలు లేవు. దేశంలో బ్రహ్మాండమైన అభివృద్ధి ప్రణాళికలు జరుగుతున్నాయి. వాటిని ప్రజల దగ్గరకు తీసుకుపోయి ప్రజలు ఎందుకు సహకరించాలనే విషయం మీద చక్కని బుర్రకథలను, నాటకాలను రచించి దానికై కనీసం-ఒక Minister Port Folio ఇవ్వాలని నేనడంలేదు. అది ఇప్పట్లో తేలే విషయంకాదు. ఒక Deputy Minister ను అయినా cultural activities కోసం వేసి ఒక branch ను స్థాపించి ఆంధ్రదేశంలో నశించిన కళలు ఏమిటి? ఉద్భవించవలసిన కళలు ఏమి? ఉన్న కళారూపాలను ఏ విధంగా దోహదం చేసుకోవాలనేది గోపాలరెడ్డిగారే పూనుకోకపోతే మరొకరెవరూ పూనుకోవడానికి సావకాశం లేదు. ఎందుచేతనంటే రవీంద్రుని శిష్యులైన కవిచాతుర్యం కలిగిన, సమయోచితంగా మాట్లాడగలిగిన, చక్కగా దాటిపోగలిగిన అనేక అవకాశాలు కలిగిన గోపాలరెడ్డిగారే కళలను పోషించలేకపోతే ఇంక పోషించేవారు ఉండరేమో అనిపిస్తుంది. ఇది అన్నిపార్టీలకు ఆమోదకరమైన విషయం. మన వైజ్ఞానిక రంగాన్ని అభివృద్ధి చేయడానికి State లో కొంత ధనాన్ని వేరుగా చేయాలి. దానికి ఒక port folio create చేయాలి ప్రతిజిల్లాలో మద్యపాన నిషేధం, Health, పంచవర్ష ప్రణాళిక, అస్పృశ్యతా నివారణ అనేక విషయాలను చక్కగా నాటకాలుగా, బుఱ్ఱకథలుగా, సినీరీల్సుగా పంపి ప్రచారం చేసుకోవాలని మనవిచేస్తున్నాను ఆఖరుగా ఒకవిషయం మనవిచేస్తున్నాను. మనం ఏ చట్టాలు తయారుచేసినా సూటిగా ప్రజలదగ్గరకు వెళ్లడానికి మధ్యగాఉండే రాయబారులనంపి, రాయబారులనండి, తాచేరాల్లనండి executive ఆఫీలరు లనండి——వీరు మార్పుచేయడానికి ఏమిచేయాలని ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి చేసిన ఘోర తపస్సుకంటే భారతదేశానికి స్వరాజ్యం సంపాదించడానికి తలలు వేడెక్కి కారాగారాల్లో కుంగి కృశించినదానికంటే మరింత ఎక్కువగా కృషిచేస్తున్నారు. జుట్టుపన్ను వచ్చిందిఅంటే నా ఒక్కడిదే జుట్టు; మా తాతజుట్టు రాలిపోయింది! మా కుర్రవాడికి జుట్టేలేదు, అన్నాడట ఒకడు. ఒరేయ్! జుట్టుకు రు 15 లు గవర్నమెంటువారు ఇస్తున్నారురా! అంటే, నాకుజుట్టు, మా తండ్రిజుట్టు, మా తాతజుట్టు, మా వేలువిడిచిన బావమరిది జుట్టు, నాభార్య గర్భిణితో ఉన్నది. మగపిల్లవాడని జ్యోతిష్కుడు చెప్పాడు. వాడిదొకజుట్టు కాబట్టి ఏడుజుట్లకు ఏడు పదిహేనులు యిమ్మన్నాడట. ఈరకం వారు బయలుదేరారు. పన్నులు వేయవలసివస్తే తక్కువభూమి చూపించడం, తక్కువయిండ్లు చూపించడం, తక్కువ income చూపించడం, ఈ ఉపాయం డిపార్టుమెంటువారు అపాయం లేకుండా సిపాయిలవలె ప్రభుత్వంవారు వస్తే

జండాలు పుచ్చుకొని వారివెనకాల తిరగడం, వారికి డిన్నర్లు యిప్పించడం, దానిపై పన్ను తగ్గించాలి, దానిపై పన్ను తగ్గించా లనడం, దానిని శాసనసభ్యులు భుజాన వేసుకుని నిజమే—ఉల్లిపాయలకు తగ్గాలి : పుప్పుకు తగ్గాలి ; పప్పుకు తగ్గాలి ; పెట్రోలుకు తగ్గాలి; ఇవన్నీ రైతులమీద పన్నులే—అసలు ప్రజలపైపన్నులే ఉండ నక్కరలేదు. మాకు బ్రహ్మాండమైన తారురోడ్లు, electric లైట్లు వుంటే చాలు నని అంటారు. ప్రభుత్వం యంత్రాంగాన్ని overhaul చేసి అవసరమయితే replace చేయడం అవసరం. సర్వీసు కమిషనువారితో డిగ్రీలున్నవారినే తీసుకునే పద్ధతి అనుసరిస్తారా; లేక honest గా కాలినడకన స్వతంత్రలో యోధులు మాదిరి పనిచేసిన graduates సలహాలను తీసుకుని కాని వారిని absorb చేసికాని పనిచేయిస్తారా అనేది విషయం. కేవలం degrees తెచ్చుకున్న వాంతోనే మన degree పెంచుకునేదానికన్న నన్ను అడిగితే వయస్సుపరిమితి అక్కరలేకుండా దేశంకోసం త్యాగంచేసి ప్రణాళికలు రచించిన అనేక విషయాలలో ఆరితేరిన విజ్ఞానవేత్తల సేవ వినియోగించుకుని తద్వారా మన ప్రభుత్వాన్ని ముందుకు తీసుకు వెళ్లడానికి ప్రయత్నం చేయాలి. లేకపోతే 214 కోట్లు ఖర్చుచేయాలనుకుంటే పై 14 కోట్లు అయినా పజలకు వెళ్లవు. అందరికీ తెలిసినవిషయమే ఇది. అందరూ feel అవుతున్న విషయమే. దీనిని గురించి సరిఅయిన కృషిచేయవలసిందని మనవిచేస్తూ ఈ అవకాశం ఇచ్చినటువంటి డిప్యూటీ స్పీకరుగారికి నమస్కారాలు చెల్లిస్తూ విరమిస్తున్నాను.

*SRI P. GOPALAKRISHNA GUPTA :—ఉపాధ్యక్షా, మనఆంధ్రరాష్ట్ర ఆర్థిక శాఖామాత్యులు ప్రతిపాదించిన ఈ budget proposals ను నేను బలపరుస్తున్నాను. వారు ఆర్థిక శాస్త్రంలో నిపుణులనే విషయం అందరికి తెలిసిన విషయమే. ఆంధ్రరాష్ట్రంలో నేడు వున్నటువంటి మంత్రులందరు చాలా మేధావంతులని అందరికి తెలిసిన విషయమే. అయితే ప్రజానీకం మాత్రం ఒకప్రశ్న అడుగుతున్నారు. ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి తదితర మంత్రులు ఏంతో నిపుణులనే విషయం ఒప్పుకుంటున్నాము. కాని దినదినం దేశంలోపెరిగే లంచగొండితనాన్ని అరికట్టడానికి ఏఒక్క సదుపాయం వారికి తోచలేదా అని అడిగినప్పుడుమాత్రం కొంతవరకు తలవంచుకోవలసి వస్తున్నది. ప్రజాప్రతినిధులకు, కేంద్రప్రభుత్వంలో లంచగొండితనాన్ని అరికట్టేందుకు ప్రత్యేకం ఒకమంత్రిని నియమించడం non-official సభ్యులతో ఒక advisory committee ఏర్పరచి లంచగొండితనాన్ని అరికట్టేందుకు ప్రయత్నం చేస్తున్నారని పత్రికామూలంగా తెలుస్తున్నది. ఆదే ప్రకారంగా మన రాష్ట్రంలోకూడా ఇటువంటి సలహాను అనుసరిస్తారని మనవి చేస్తున్నాను. రెండవ విషయం ఏమిటంటే, ఈ రోజున రాష్ట్రంలో ప్రజలకు

వారి ఆస్తిపాస్తులను ప్రాణాలను రక్షించుకునేందుకు అవకాశాలు తక్కువగా వున్నాయి. ఇందులకు కారణం పోలీసుల అసమర్థత అని తప్పక చెప్పవలసియున్నది. కొద్దిమంది న్యాయంగా శక్తిసంపన్నులై పనిచేసేవారిని C. I. D కో S. B కో తీసుకుంటున్నారు. ఎందుకూ నిరుపయోగమయిన వారినే మామూలు కార్యక్రమం సాగించేందుకు తాలూకాల్లో పెడుతున్నారు. వారు ప్రజల కష్టసుఖాలు కాని ఆస్థిపాస్తులు కాని సంరక్షించే స్థితిలో లేరనే విషయం ప్రభుత్వంవారి దృష్టికి తీసుకు వస్తున్నాను.

P. W. D. శాఖను మనము అందరమూ కూడా Enemy No. 1 గా పరిగణించవలసినదే. ఇందులో చాలా దుబారాగా ధన వ్యయము జరుగుతున్నది. అందుకు Estimate Committee ని ఒక దానిని వేయమని సభ్యులు పదే పదే ప్రభుత్వము దృష్టికి తీసుకువచ్చినా ఆ పని ఇంతవరకు జరగలేదు. ఇటీవల హైవేస్ శాఖవారు ట్రంకురోడ్లను వెడల్పు చేయుటలో విచిత్రమైన పద్ధతులను కొన్నింటిని అవలంబిస్తున్నారు. రోడ్లను వెడల్పు చేయుటకు చెఱువులను గుంటలను పూడుస్తున్నారు

మదనపల్లి తాలూకాలోను మదనపల్లికి 6 మైళ్లు దూరంలో రామక్క చెఱువు అని ఒక చెఱువున్నది. దాని గట్టుమీద నుంచి ఒక రోడ్డు పోవుచున్నది. దానిని వెడల్పు చేయుటకు 10 అడుగుల వెడల్పున చెఱువును పూడుస్తున్నారు. రివెన్యూ డిపార్టుమెంటువారు డబ్బు ఖర్చుచేసి చెఱువులలో పూడికలు తీయుట, కట్టలు తెగిపోతే కట్టలువేయుట చేస్తూ, హైవేస్ డిపార్టుమెంటువారు రోడ్ల వెడల్పుకుగాను వాటిని పూడుస్తున్నారు. అదే విధంగా మదనపల్లి వద్ద బురకాయలకోట ఈ గ్రామంలో ఒక చెఱువు ఉన్నది. ఆ చెఱువు మధ్యలోనే రోడ్డు వేస్తున్నారు. కాబట్టి ప్రభుత్వమువారు, హైవేస్ డిపార్టుమెంటువారు ఇటువంటి పనులు చేయకుండా ఉత్తర్వులు జారీ చేయాలని కోరుతున్నాను.

ఈ బడ్జటులో మైనరు ఇరిగేషన్ పనులకు చాలా కొద్ది మొత్తమును కేటాయించారు. ఇదిపొరపాటున ఏ గుమస్తానో తప్పు అంకెవేస్తే దీనిని వీరు మార్చడం ఎందుకని ఆమోదించినట్లున్నారని నేను అనుకొంటున్నాను. ఈ విషయం ఆర్థిక మంత్రిగారికి కూడా తెలిసియే యుండును. దాని క్రింద కొన్ని కోట్లరూపాయిలు కేటాయించడానికి బదులు కొన్ని లక్షలు రూపాయిలు మాత్రమే కేటాయించారు. చిత్తూరు మొదలైన ఎత్తైన ప్రదేశాలలో చెఱువులు మీద ఆధారపడి వ్యవసాయము చేసుకోవలసిందేగాని వారికి ఇతరత్ర మార్గములులేవు. అటువంటి ప్రదేశాలలో ఈ మైనరు ఇరిగేషన్ పనులు ఎక్కువగాచేస్తే ఇంకా అధిక ఉత్పత్తికి అవకాశం

Sri P. Gopalakrishna Gupta] [7th March 1956

ఉంటుంది. ఎన్నో కోట్ల కొలది రూపాయలు పెద్ద పెద్ద ప్రాజెక్టుల క్రింద ఖర్చు పెడుతున్నారు. నేను వద్దనడంలేదు. కాని ఆ ప్రాజెక్టులు ఎంతోకాలమునకు గాని పూర్తి కావు. ఎన్నో తరాలకు గాని వాటి క్రింద భూములు సాగులోనికివచ్చి పంటలు పండవు. ఈ మైనరు ఇరిగేషన్ పనులు అలాంటివి కావు. ఇప్పుడు కట్టలు తెగిపోయి అట్లాగే ఉన్న చెఱువులు పూడిపోయిన చెఱువులు వగైరా అన్నీ మరమ్మతులు చేయిస్తే ఎక్కువగా పంటలు వెంటనే పండే దానికి అవకాశం ఉంటుంది. అందువల్ల ఈ విషయాన్ని ముఖ్య మంత్రిగారు గమనించాలని కోరుతున్నాను.

గ్రామాలలో వైద్య సౌకర్యాలు చాలా తక్కువగా ఉంటున్నాయి. నిన్నటి దినమున మదనపల్లినుంచి కొందరు మిత్రులు నాకు జాబువ్రాశారు. దినమునకు 400,500 మంది అనారోగ్యులు హాజరయ్యే ఆస్పత్రిలో ప్రస్తుతం ఒక్క లేడీ డాక్టరు మాత్రమే ఉన్నది. అక్కడ డాక్టరును చాలా కాలం క్రిందటనే బదిలీ చేశారు. మరల ఆ స్థానంలో ఎవరిని వేయలేదు. M. B., B. S., ప్యాసు అయిన వైద్యులు చాలా మంది అక్కడ ఆనరరీగా పనిచేస్తామని చాలా కాలం క్రిందటనే దరఖాస్తులు పెట్టుకున్నారు. ఇంతవరకు వాటిమీద చర్య తీసుకొని ఉచితంగా ప్రజా సేవచేస్తామన్న డాక్టర్లకు కూడా ఉత్తర్వులు ఇవ్వడానికి ప్రభుత్వంవారికి చాలా కష్టంగా ఉన్నదా అని అడుగుతున్నాను.

ఇటీవల స్థానిక పరిపాలనాశాఖామాత్యులు అయిన నాగేశ్వరరావుగారు చిత్తూరు జిల్లా పర్యటన చేసి వచ్చారు. వారు వచ్చిన తరువాత ప్రజలలో ఒకనినాదము బయలుదేరింది. ఆ విషయమును మంత్రుల అందరి దృష్టికి తీసుకోవలసిన అవసరము ఉన్నది. మంత్రులు జిల్లాలలో, తాలూకాలలో, గ్రామాలలో పర్యటన చేస్తూన్నప్పుడు విందులను, టీ పార్టీలను, వేదికలమీద పుష్పమాలలను ఆశించుట కంటే వారికి సంబంధించిన కార్యాలయాలకు వెళ్లి తాలూకా ఆఫీసులలోకి, సబ్ కలెక్టరు ఆఫీసులలోకి, P. W. D. ఆఫీసులలోకి వెళ్లి ఆ ఆఫీసులలో ఏ చర్యలు తీసుకోకుండా ఎంతోకాలం నుంచి ఉన్నటువంటి కాగితాలు చాలా ఉంటున్నాయి. అవి ఎందుకు నిలువ ఉంటున్నాయి ? పని ఉన్నటువంటి గుమాస్తాలు ఎవరు ? పని లేకుండా నిష్కారణంగా జీతాలు తీసుకునేవారు ఎవరు ? అనేటటువంటి విషయాలను తెలుసుకొంటే ప్రజలకు ఎక్కువ సహాయం చేసినవారవుతారు గదా అని ఒక నినాదం ప్రజలలో బయలుదేరింది. అందులో వాస్తవము ఉన్నదని నా అభిప్రాయం. అందువల్ల మంత్రులందరూ తమ పర్యటనలో ఛాయా పటాలను బహిర్గత పరచడం ఇటువంటి పనికంటె అటువంటి పనులన్నిచేస్తే ప్రజలకు, దేశానికి సేవ చేసేందుకు

అవకాశం ఉంటుందని కోరుతున్నాను. ఈ అవకాశం ఇచ్చినందులకు ఉపాధ్యక్షుల వారికి వందనములు సమర్పిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

*SRI E. NAGAYYA :—అధ్యక్షా, మొన్న మన మంత్రిగారు ప్రవేశ పెట్టిన బడ్జటులో లోపల ఏ లోటుపాట్లు ఉన్నప్పటికీ పుస్తకంపై బైండింగు చాలా అందంగా ఉన్నందుకు సంతోషిస్తూ, దానిని నేను ఆమోదిస్తున్నాను. బడ్జటు ఎలాగు ఉన్నప్పటికీ, అది అయినా సరిగా అమలుజరుగుతున్నదని నేను నమ్మలేకుండా ఉన్నాను.

Block developemnt areas లో ప్రజలు చాలామంది శ్రమదానంచేసి మట్టిరోడ్లువేసి ఉన్నారు. దానిని గవర్నమెంటువారు మెటలింగ్ చేస్తామని చెప్పారు. అవి పూర్తియై 8, 9 నెలలు అయినప్పటికీ ఇంతవరకు ఏమీపని జరుగలేదు. ఈ లోపున వర్షాకాలంవచ్చి ఆ రోడ్లుకొస్తా కొట్టుకుపోతాయిఅని ఆ డిపార్టుమెంటు లోఉన్న పెద్ద పెద్ద ఉద్యోగస్థులకు ఈ విషయమును తెలియజేశాము. వారు బడ్జటు లోటుగా ఉన్నదంటున్నారు.

మా జిల్లాలో చిన్న చిన్న చెఱువులు చాలా ఎన్నో సంవత్సరములనుంచి పాడుపడి ఉన్నాయి. వాటి మరమ్మతులకొఱకు P. W. D వారికి తెలియచేస్తే వాటిని చేసేదిమేలుకాదు. Food Production division అంటూ మాజిల్లాలో ఉన్నది. వారుచేస్తారని చెబుతున్నారు. వారివద్దకు వెళ్ళిఅడిగితే అది మేము చేసేదికాదు విజయనగరం మైనరు ఇరిగేషన్అంటూ ఒక ఇంజనీరింగు డిపార్టుమెంటు ఉన్నది వారుచేస్తారని చెబుతున్నారు. వారిదగ్గరకువెళ్ళితే వారికి ఏ గ్రామంవారు అయినాగాని రూ. 100, 200 లు ఇస్తే వారికి కావలసినపనులు మాత్రమే చేస్తు న్నారు. కాని నిజముగా చెఱువులు , కాలువలు పాడైపోయిన ప్రాంతాలలో ఏ విధ మైన సహకారం చేయకుండా ఉన్నారని మనవిచేస్తున్నాను.

అనకాపల్లి తాలూకాలో దుద్దుపల్లెఅనే ఒక ఆ గ్రామంలో ఒక చెరువున్నది. దీనిపొడవు 200 అడుగులు. అది పూర్వము flood damages లోకి పోయిన సంగతి గవర్నమెంటువారికి తెలుసును, అప్పుడే 5 సం॥లు కావస్తున్నది. అధమంవాళ్లకు Water sources వచ్చేట్టుగాచేసినా బాగుండేది. ఇంతవరకు అటువంటిదేమీ చేయకపోవడంచూస్తే అది administration లోపమో లేక మన పరిపాలన లోపము అనుకోవాలో నాకు ఏమీ బోధపడ్డంలేదు. గవర్నమెంటు వారిని ఏదైనా ఒక ప్రయోజనకరమైనపని చేయమని అడిగితే లోటుబడ్జటు, గవర్నమెంటుకు డబ్బులేదు అంటారు. అలా చెప్పడంచూస్తే నాకు చాలా చిన్నతనంగా

వుంది. లోటుబడ్జటు అని చెప్పేబదులు మనకువచ్చే ఆదాయాన్ని సరిగా రాబట్టారంటే లోటుబడ్జటు ఎందుకు అవుతుంది ? మొన్న నేను ఒక పేపరులో చూచాను. మాడుగుల forest produce contract సంవత్సరానికి 15 వేలకు contract కు యిచ్చినట్లు అది 2 సంవత్సరాలకు కలిపి ఒకలక్ష 50 వేల రూపాయలు రాబడివస్తుందని ఆ పేపరు మూలకంగా ఆ ప్రాంతవాసులు తెలియచేసిన విషయం కాంగ్రెసు పెద్దలకు తెలిసేవుండును అనుకొంటున్నాను. ఇంక labour విషయంలో చూస్తే విశాఖపట్నంజిల్లాలో కావలసినన్ని ప్రాజెక్టులు కడుతున్నారు. Industries 4, 5 చేస్తున్నారు. Wagon factory పెట్టి wagons తయారుచేస్తున్నారు. ఇవన్ని చేస్తున్నారని చెప్పడంచూస్తే నాకు చాలా సంతోషంగావున్నది. అందులో మన ఆంధ్రప్రజలకు ఎంతవరకు ప్రయోజనకారిగా వున్నదో చెప్పవలసిందని నేను మనవిచేస్తున్నాను. సింధియా కంపెనిలో జరిగే అన్యాయాలు చెప్పడానికి వీలులేదు. Caltex కంపెనీలో మన ఆంధ్రులు నూటికి అయిదుగురైనా వున్నారోలేదో తెలియదు. Labour officer అనిచెప్పి ఒక George ని బొంబాయినుంచి తీసికొని వచ్చారు. ఆయన బొంబాయినుంచి, కలకత్తానుంచి, మలయాల ప్రాంతంనుంచి ప్రజలను recruit చేసి కంపెనీలలో ఉద్యోగాలు యిస్తున్నారుకాని మన ఆంధ్ర ప్రజలు కంపెనీచుట్టూ రోజూ 4 సార్లు తిరిగినా వారివైపు చూసేవారేకారు. ఎవరైనా యిదేమి న్యాయమని అడిగితే ఆంధ్రులకు పనితెలియదు. పని తెలిసినవాళ్లను తీసుకొచ్చి చేయిస్తున్నామని చెపుతారు. అది ఆలా జరగకుండా Central Government తో సంప్రతించి సరియైన యేర్పాటుచేస్తారని మనవి చేసుకొంటున్నాను.

Sri R. JAGANNADHAM :—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు యీమధ్య ప్రవేశపెట్టిన బడ్జటులో వెనుకపడిన ప్రాంతాల ప్రజల గురించి, కార్మికుల గురించి, కర్షకుల గురించి అభివృద్ధి ప్రణాళికలు వేసినట్లు కనబడ్డంలేదు. ఇది నాకు చాలా విచారకరంగా వున్నది. మా ప్రాంతమైన విశాఖపట్నం జిల్లాలోని తాలూకాలు చాలా వెనుకబడి వున్నవి. అక్కడ చెరువులు పూర్వం జమీందారీ area లో వుండుటచేత సరియైన మరమ్మతులు లేక, నీటిసౌకర్యములు లేక ప్రజలు అనేక బాధలు పడుతున్నారు. ఈ ప్రాంతమంతా జనావృతమై వ్యవసాయంచేసుకోడానికి భూవసతులు లేక, వ్యవసాయంచేసే భూములకు నీటిసౌకర్యాలు లేక ప్రజలు అనేక కష్టనష్టాలకు లోనగుచున్నారు. ప్రభుత్వం గమనించి కూడా ఆ ప్రదేశంలో ఒక జాతీయ వికాస కేంద్రాన్ని నిర్మించి ప్రజల కష్టములను బాపుటకు ప్రభుత్వం ఏమీ ప్రయత్నం చేయకపోవడం చాలా శోచనీయంగా ఉన్నది. ఇక్కడ రాకపోకల సౌకర్యాలు లేక ప్రజలు పండించిన పంటలను మార్కెట్టుకు తీసికొనిపోయి అమ్ముకునే అవకాశాలు లేక ప్రజలు అనేక కష్టాలు పడుతున్నారు. ఈ ఏజెన్సీలో సరి

మైన రాకపోకల సౌకర్యములు లేనందున పండించిన పంటకు సరియైన ధర రాక వారు చాలా నష్టపోతున్నారు. సంస్కృతి, విద్య, వైద్యము మున్నగునవి అభివృద్ధి చెందాలంటే రోడ్లు వుండడం చాలా అవసరము. చోడవరం, శృంగవరపుకోట తాలూకాలు చాలా విశాలమైనవి. ఈ ప్రదేశంలోని ప్రజలు వ్యవసాయం వల్లనే జీవించుచున్నారు. ఈ ప్రదేశంలో నదులు, గడ్డలు ప్రవహించుచున్నవి. ఆప్రాంత అభివృద్ధికోసం ప్రాజెక్టులేమీ నిర్మించలేదు. అందువల్ల అక్కడి ప్రజలు "ప్రభుత్వం వారు అభివృద్ధి వున్న ప్రదేశములలో వలె వెనుకబడిన ప్రాంతపువారమైన మామీద కూడా ఎక్కువ పన్నులు విధిస్తున్నారు. ఇది చాలా అన్యాయము"ని బాధపడు తున్నారు. "మన ప్రదేశంలో నీటి సౌకర్యాలు చాలా తక్కువగా వున్నాయి అటువంటప్పుడు మనమీద పన్నులు విపరీతంగా ఉండడం చాలా అన్యాయంగా వుంద"ని అక్కడి ప్రజలలో కొంత అసంతృప్తి కలుగుచున్నది. ఇదివరకు రెవిన్యూ మంత్రిగారు శాసనసభలో మాట్లాడుతూ జమీందారీ గ్రామోద్యోగస్థులకు, మామూలు రైత్వారీ ఉద్యోగస్థులకిస్తున్న జీతాలు యిస్తామని చెప్పారు. గజెటులో మాకెక్కడా కనిపించలేదు. అక్కడ వైద్యసౌకర్యాలు లేవు. అక్కడ dispensary లు కాని, నేటివ్ వైద్యులనుగాని నియమించే యేర్పాటు చేయలేదు. వాళ్లకు యేదైనా అనారోగ్యం వచ్చినప్పుడు కేంద్రంలో ఉన్న హాస్పిటల్సుకు వెళ్ల వలసివస్తుంది. రాకపోక సౌకర్యములు లేక ప్రజలు చాలా బాధ పడుతున్నారు. వర్షాకాలం చాలా బాధపడుతున్నారు. ఇవన్నీ కూడా ప్రభుత్వం పరిశీలించి యీ ప్రాంతానికి తగు సహాయం చేయమని మనవిచేస్తున్నాను.

SRI A. BHAGAVANTA RAO :—అధ్యక్షా, ఈ బడ్జటు ప్రతిపాదనను విన్నకొలది మన ఆంధ్రరాష్ట్రం చాలా backward రాష్ట్రంగా ఉందని తెలుస్తున్నది. ఇప్పుడు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ద్వారా జీవిత పరిమితిని వృద్ధి చేయడంకోసమని, జాతీయాభివృద్ధికోసమని, వెనుకబడిన జాతులవారి అభివృద్ధికోసమని ఉపయోగపడుతున్నది. బడ్జట్టులో ఇవన్నీ ప్రతిపాదించుట లాభదాయకమైన విషయం. అయితే బడ్జటులో ప్రతిపాదించినవన్నీ బడ్జటులో ఉన్నట్టుగా సమగ్రంగా సక్రమమైన రూపములో ఉంటుందాఅని సంకోచం యేర్పడుతోంది. ఈ బడ్జటులో ముఖ్యమైన 3 అంశాలను ప్రతిపాదించినందుకు ముఖ్య మంత్రిగార్ని అభినందించక తప్పదు. (1) రెవిన్యూ డిపార్టుమెంటునుంచి ట్రెజరీ డిపార్టుమెంటును వేరుచేయాలనడం, ఇది చాలా మంచి సూచన. (2) Uniformities of water rates కి తగిన ప్రాతిపదిక చేస్తామని, తయారు చేయవలసిన అగత్యం వుందని సూచించుట. ఇది చాలా సంతోషించతగ్గ విషయం. (3) Progressive element intimation అనేది introduce చేశాము. ఇందుకు మేము కూడా ముఖ్య మంత్రిగారితో పాటు ఏకీభవిస్తున్నాము.

ఇలాంటి మూడు ముఖ్యాంశాలు budget లో ప్రతిపాదించడంచేత budget ను as a whole mixed feelings తో welcome చేయవలసిన అగత్యము ఉన్నది. Administrative system కు సంబంధించినంతవరకు Revenue Treasury Department ను విడదీయాలనేది కాకుండా talk heavy గా ఉన్నటువంటి administrative system ను overhaul చేయడముకోసముగాని, ఖర్చు ఎక్కువగా అవుతోందని administrative system ను మార్పుచేసేదానికొరకుగాని, administrative system ను Social Welfare State అనే సాంప్రదాయానికి అనుగుణముగా ఉండేటట్లు మార్చడానికి గల సూచనలుగాని, మార్గాలుగాని అన్వేషించి committee ని వేయవలసినటువంటి అగత్యము ప్రభుత్వానికి ఉన్నదని నా ఉద్దేశ్యము. Administrative system లో కొన్ని లోపాలు కనబడుతున్నాయి. ఈ system of mechanism లో ముఖ్యంగా Disrict Boards ఎక్కువగా ఉండడము, District Boards యొక్క powers ఏరోజుకారోజు తగ్గిపోవడం కనబడుతోంది. District Boards set up లో ఉంచకుండా ఆ స్థానే Development Boards స్థాపించి, ప్రస్తుతము కలెక్టర్లద్వారా సాధించదలచు కొన్ని పనులను Development Boards ద్వారా చేయించడానికి పూనుకుంటే జిల్లా administration కొంత చక్కబడవచ్చునని నా ఉద్దేశ్యము. Democratic set up లో ఉన్నటువంటి hereditary Institutions అన్ని abolish చేయాలనే సిద్ధాంతాన్ని ఈనాటికైన తీసుకోకపోయినట్లయితే మనం democracy అని చెప్పుకోవడానికి కొంత కొరత ఏర్పడుతుంది. కాబట్టి ఇలాంటి విషయాలన్ని సమగ్రంగా Government వారు మరొకసారి ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. రైతులకు సంబంధించినంత వరకు Land Reforms introduce చేయడమన్నది ఖాయమైనప్పుడు, ఇప్పటికే ప్రతిపాదించబడిన పన్నులన్నీ ముఖ్యంగా రైతులమీద ఉన్నప్పుడు ఇంకా అదనంగా రైతుల మీద పన్నులు వేసేదానికిముందు వారికి taxable capacity ఉన్నదా లేదా అనేది నిర్ణయించవలసిన అగత్యము ప్రభుత్వానికి ఉన్నది. Food grains యొక్క prices stabilize చేయడముకోసమని భారత ప్రభుత్వము ఇప్పుడొక సంఘాన్ని నియమించినట్లు మనకు తెలుస్తున్నది. ఈ stabilization of prices జరిగే ముందు రైతులమీద అదనంగా పన్నులు వేయడము మంచిదికాదు. అందుచేత ఈ budget లో అదనంగా పన్నులు వేయడానికి గల సూచనలుగాని, మార్గాలుగాని ఏమి కానందుకు ముఖ్య మంత్రిగారిని మనం అభినందించక తప్పదు.

Water rate uniformity కూడా తప్పనిసరిగా జరిగి తీరాల్సినదే. Stabilization of prices ను గురించి మనం గట్టిగా ఒక నిర్ణయం చేసుకోగలిగిన

నాడు రైతులమీద పన్నులు వేయవచ్చునా లేక ఎందుకు వేయకూడదనే అంశాన్ని అర్థంచేసుకునే అవకాశం కలుగుతుందని నేను ఆశిస్తున్నాను. Second five year plan గురించి చర్చించుకొన్నప్పుడు Second five year plan లో national income 100 కి 25 వంతులు మనం అభివృద్ధి చేసుకోవాలి. దేశంలో కనీసము 8 మిలియన్ల ప్రజానీకానికి employment చేకూర్చాలనే సిద్ధాంతాన్ని మనం ఒప్పుకొన్నప్పుడు Parliament లో శ్రీ C. D. దేశముక్ గారు చెప్పిన అంశాన్ని ముఖ్యమంత్రిగారి గుర్తుకు తీసుకోవాలని అనుకొంటున్నాను. అది ఇంగ్లీషులో ఉంది.

The problem is not merely one of raising the statistical average as per capita income which could easily be a will-o-the-wisp. Thus it is one of raising the lowest incomes and of opening out to the younger generation avenues of growth and advancement that will bring out the best in them.

అందుచేతనే national income అభివృద్ధిచే విషయంలో 100 కి 25పాళ్లు-అభివృద్ధి పొందిందా లేక 50 పాళ్లు అభివృద్ధిపొందిందా అనే సాంప్రదాయముకాదు.

It is one of raising the lowest incomes and of opening out to the younger generation avenues of growth.

అని శ్రీ దేశముఖ్ గారు పార్లమెంటులో ప్రవేశ పెట్టిన సిద్ధాంతాన్ని పూర్తిగా గుర్తెరిగి ముఖ్యమంత్రిగారు budget రూపొందించాల్సిన విధానం వున్నదని చెప్తున్నాను. ఇక రెండవది యేమిటంటే budget లో fresh proposals of taxation లేకపోవడమువల్ల ఇదిఅంతా spectacular గా ఉన్నటువంటి budget కాదనే నిర్ణయానికి రాగలిగాము. Fresh proposals of taxation ఎందుచేతలేవో ఆలోచించుకుంటే మనకు మనమే అనుకొన్నటువంటి సిద్ధాంతానికి దూరముగా పోతున్నామనే అభిప్రాయం కలుగక తప్పదు. ఇదే Parliament లో మాట్లాడుతూ Sri C. D. దేశముఖ్ ఒకమాట అన్నారు.

Additional taxation is inseperable from a bolder plan of economic development.

అని ఆయన చెప్పారు. అంటే additional proposals ఈ plan కు సంబంధించినంతవరకు తప్పనిసరిగా ఉండాలి. Additional taxation proposals budget ప్రతిపాదనలో లేకపోవడం విచారకరమైనటువంటి విషయమని అనుకొంటున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—Sales Tax Enquiry Committee వాళ్లుచేసే report కోసము మేము await చేస్తున్నాము. అవిరాగానే పరిశీలన చేస్తాము. అది మీరు కొంచెము గమనించండి. Standardisation of land revenue and enhancement of water rates and all that అని కూడా చెపుతున్నాము. Diesel oil మీదకూడా చూస్తామని చెప్పినాము. అది ఇంతకుముందే జరిగిపోయింది. ఇవన్నీకూడా కొంచెము సర్వగర్భంగా చెప్పబడినాయి.

SRI A. BHAGAVANTA RAO :—ప్రధాన మంత్రిగారు చెప్పిన విషయాలన్నీ ఇదివరకే అసెంబ్లీలో పాస్ చేయబడినటువంటివని ఈ water rates కు సంబంధించిన uniformity చేస్తున్నామనేది మాత్రం ఈ plan లో కొత్త proposal Second Five Year Plan లో మనం సాధించదలచుకొన్నవి, సక్రమమైన పంథాలో నడవాలి అంటే తప్పనిసరిగా budget లో క్రొత్త proposals ప్రవేశపెట్టాలి. Taxation proposals sources of revenue మాత్రమే క్రొత్త proposals. రైతులకు సంబంధించిన సమస్య exhaust అయిపోయింది కాబట్టి sources of income మిగతా sources అన్నీ ఈ budget proposals గావేసి కొంత ఆదాయాన్ని పెంచడానికి అవకాశం ఉన్నంతవరకు మనం ప్రయత్నం చేయాలి. ఈనాడు constitutional గా మనకు ఒక draw back ఉన్నదని మన ప్రధానమంత్రిగారు చెప్పడము వింటూనే వున్నాము. Constitution ప్రకారము central లో ఉన్నటువంటి అవకాశము మన provincial budget లో introduce చేయడానికి అవకాశం లేకపోవచ్చు. కాని statutory financial committee వచ్చినపుడు ఆ కమిటీవారితో సంప్రతించి ముఖ్యంగా provincial allotment కు సంబంధించినటువంటి sources of income బాగా ఆదాయం వచ్చేటటువంటి మార్గాలు అన్వేషిస్తారని నేను గట్టిగా ఆశిస్తున్నాను. ఇప్పుడు ఈ budget యొక్క proposals చూచినపుడు మనం అనుకొన్న ప్రకారము lower income groups లో ఎంతవరకు సాధించగలిగామనే విషయంలో నాకు చాలా అనుమానమైన పరిస్థితిగా కనబడుతోంది. Lower income groups raise చేయుటకుగాను budget లో ఏవిధమైనటువంటి ప్రతిపాదనలుగాని, ఆలోచనలుగాని లేవు. ఈ విధంగా ఏ కొద్దిమందికో కొనుగోలుశక్తి ఉండడము, మిగతా 100 కి 80, 90 మందికి కొనుగోలుశక్తి తక్కువగా ఉండడము జరుగుతోంది. కొనుగోలుశక్తి పెంచడానికిగాని జీవిత పరిణామాన్ని అభివృద్ధి చేయడానికిగాని గల సూచనలేమి budget లో ఎక్కువగా కనబడడం లేదు. అందుచేత budget లో వున్నటువంటి అంశాలనుబట్టి చూస్తే మనల్ని ఆకర్షించేవి అంతగా లేవు.

అందుచేత national development సిద్ధాంతాన్ని పెట్టుకొని plan లో వున్నటువంటి సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని lower income groups కు సంబంధించినటువంటి వారి purchasing powers బాగా అభివృద్ధి చేయడానికిగల సూచనలు గాని, proposals గాని budget ప్రతిపాదనలో ఇకముందు అయినా వస్తాయని ఆశిస్తున్నాను.

ముఖ్యంగా ఈ బడ్జెటులో Irrigation, Electricity, Highways, వీటిని గురించి ప్రభుత్వాన్ని అభినందించవలసియున్నది. Highways కు సంబంధించినంతవరకు, District Board Roads అన్ని Highways కు తీసుకొంటున్నాము అనేటటువంటి మంచి ప్రతిపాదనలు ఇందులో ఉన్నాయి. కాని విద్యా విషయములో Schedule Tribes, Backward Classes, వీరి అభివృద్ధి గురించి ఇది ప్రోత్సాహకరంగా లేనటువంటి సంగతి మన మిత్రులు ఇదివరకే చెప్పారు. దీన్ని బట్టి, Social Welfare State కు అనుగుణంగా ఈ బడ్జెటు ప్రతిపాదన కనుపించనందుకు విచారిస్తున్నాను. మిగత విషయాలలో మాత్రము, ఈ బడ్జెటు "A model for the family budget" లాగా ఉన్నది. అంతేగాని, there is absolutely no spectacular changes in the budget అని చెప్తున్నాను.

Sri. Ch. S. R. V. P. MURTHI RAJU:—అధ్యక్షా, ప్రస్తుతము మనకు ఇచ్చినటువంటి బడ్జెటు చూడడానికి చాలా సంతోషంగా ఉన్నది. పుస్తకము నేను మోయలేనంత బరువుగా ఉన్నది. కాని ఇందులో సంతోషించదగు విషయాలేమి కనబడలేదు. అయినప్పటికి నేను ఈ బడ్జెటును మాత్రము బలపరుస్తున్నాను. ఇక మనకు వచ్చేటటువంటి ఆదాయాన్నిబట్టి ఖర్చుచేయడం అనేది మన ముఖ్యమంత్రిగారికి తెలిసినట్లు ఇంకెవరికి తెలియదని అనుకొంటాను. కాని, వచ్చే దాన్నిబట్టి ఖర్చుపెట్టడం అనే దానికంటే, ఎంత డబ్బైనా ఖర్చుపెట్టి, అప్పులు ఎక్కువ తెచ్చి అయినా, ప్రజలకు ఉపకారము జరిగేటట్లు చూడడం మంచిది

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇచ్చేవాళ్లు ఉండవద్దు ?

SRI Ch. S. R. V. P. MURTHI RAJU :— అప్పులు తీసుకొనేదానికి అలవాటు పడితే, ఇచ్చేవాళ్లు చాలా మంది ఉంటారు. మనము ఇప్పటికే 70 కోట్లు చేస్తున్నాము. ఇంకెంత చేసినా పరవాలేదు! కనుక మన ప్రజాశ్రేయస్సుకోసం, కావలసిన బడ్జెటును తయారుచేయడం చాలా అవసరం. ఇప్పుడిచ్చినటువంటి

బడ్జెటును చూచినట్లైయితే మేము గ్రామాలకువెళ్లి వాళ్లకు ఏమి చెప్పుకోవాలో నా కేమి అర్థం కావడంలేదు. ఎందువల్లనంటే గ్రామాలలో నేడు రోడ్లు విషయం చూచినా, స్కూల్సు విషయంచూచినా, మరేది చూచినా, అక్కడ ప్రజలు నివసించలేనటువంటి పరిస్థితులున్నాయి. ప్రభుత్వము అప్పు అయినాచేసి వారికి సదుపాయాలు కలుగజేయవలసిన అవసరమున్నది. ప్రజలకు కావలసినటువంటి Elementary needs అయినా మనము fulfil చేయలేకపోతే మనము చేయగలిగిందేమి అనేది ఆలోచించాలి. మనము Socialistic State చేద్దామనుకొనే ఈ రోజులలో ఎక్కడ చూచినా అడుక్కొని తినే వాళ్లు కనపడుతున్నారు. ఈ అసెంబ్లీ హాలు విడిచి బయటికిపోయి చూడండి తెలుస్తుంది. మనలను చూడడానికి కూడ భయపడి బెదిరే వాళ్లను కూడ మనము చాలా మందిని చూస్తున్నాము. వాళ్లందరికి కావలసినటువంటి సహాయము వారికి ఏ విధంగా సహాయపడాలి అనేది ఆలోచించకుండా ఉన్నాము. వారికి ఏలాటి సదుపాయాలు కలుగజేయకుండా ఉన్నాము. అంతేకాదు అనాథులకు ప్రత్యేకంగా సహాయపడాలి అని అనేక సంస్థలు పెట్టారు. కాని ఆ సంస్థలకు grant ఇవ్వడంలో, ప్రత్యేకముగా ఏదో కులము చెప్పలేదనే కారణంచేత, వాటికి ఇదివరకు grants ఇవ్వకుండా ఉండడం వల్ల ఎంత అన్యాయం జరుగుతున్నదో, అది వారికి ఎంత కష్టంగా ఉంటుందో కూడ గమనించి వాటికి కావలసిన సహాయము చేయవలసియున్నది. అంతే కాదు, దేశముపైకి రావాలి, అభివృద్ధి చెందాలి అన్నప్పుడు, పిల్లల యొక్క చదువు, వారి ఔన్నత్యము చూడాలి. ఇప్పుడు విద్యాభ్యాసములో పిల్లలకు ఏమి చెప్పడంలేదు. చిన్న పిల్లవాళ్లకు తగినటువంటి schools పెట్టడం, వాటిలో మంచి విద్య నేర్పడం, వారికి మంచి భోజనం పెట్టడం, మంచి అలవాట్లు నేర్పడం, ఇటువంటి సదుపాయాలు ఏర్పరచక పోవడం చాలా విచారకరము, చాలా అన్యాయము. దీనికి కావలసి నటువంటి ఏర్పాట్లు కూడ గవర్నమెంటు చేయవలసిన అవసర మున్నది.

**1954** లో పశ్చిమగోదావరిలో వరదలువచ్చినప్పుడు, ఆ పరిస్థితులు మంత్రులు చూచి తప్పకుండా grants ఇస్తామని చెప్పారు. కాని ఆ మంత్రులు వెళ్లిపోయారు. ఆ గవర్నమెంటు పడిపోయింది. ఇప్పుడు ఈ మంత్రులువచ్చి ఆ విషయం పట్టించుకోవడంలేదు. గట్లుతెగిపోయి మంచి నీళ్ల చెరువులకు దారి లేకుండా పోవడం, ఈ నాటికి వాటిని, చక్క పెట్టకపోవడం చాలా విచారకరంగా ఉన్నది. మేము ఎన్నిక అయిన తరువాత ఇన్నాళ్లనుంచి ఏమి జరుగుతున్నది మీ రేమి చేస్తున్నారంటె, మేము ఏమి చెప్పుకోవాలి గ్రామాలలోకి వెళ్లి కనుక మా పరిస్థితి ఏమిటి అనేది కూడ కృసించవలసినటువంటి అవసరమున్నదని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను ఏటన్నటికి డబ్బు లేదని చెప్పకండి. అప్పు అయినాచేసి, తాకట్లు అయినా పెట్టి.

మొత్తంమీద ప్రజలకు కావలసినటువంటి పనులను చేయించవలసిన బాధ్యత మాత్రం ప్రభుత్వం మీద ఉన్నదని మనవిచేస్తున్నాను. అంతేకాదు, రైతులకు, రైతుకూలీలకు వారి విద్యా సౌకర్యము కొరకు ప్రభుత్వము ఏమీ చేయడంలేదు. రైతులమీద అంతా పన్నులు వేయడానికి అంగీకరించమంటున్నారు కాని వారికి కావలసిన సదుపాయాలు ఏమి చేస్తున్నారు ప్రభుత్వము అని అడిగితే ఏమి చెప్పాలో మాకు అర్థం కావడంలేదు. రైతులకుగాని, రైతుకూలీలకుగాని, కావలసిన విద్య, వైద్య సౌకర్యములు సమకూరే టటువంటి ఏర్పాటులు ఏమీ ఇందులో కనబడడంలేదు. ఈ పరిస్థితులనుబట్టి మనము ముందుకు వెళ్లుతున్నామా, వెనుకకు వెళ్లుతున్నామా అంటె వెనుకకు తప్ప, ముందుకు ఒక అడుగు కూడ వెళ్లడంలేదని చెప్పవలసియుంటుంది. ఇక ఇళ్ల విషయములో కూడ పేద వాళ్లకు మన మేమి సహాయం చేయడంలేదు. పేదవాళ్లకు ఇళ్లుకొనడానికని Central Government గాని, మన గవర్నమెంటుగాని సగము ఖరీదు ఇచ్చి, మిగతా సగము పేదవాళ్లు భరించుకోవలసిందిగా చెప్పి, ఆ విధముగా వారికి ఇళ్లు కట్టించే బాధ్యత కూడ మన మీదే ఉన్నది. దానికి గాను Central Government వారు grants ఇవ్వడానికి కూడ సిద్ధముగా ఉన్నా; మన ప్రభుత్వము నాలుగవ వంతు కూడ భరించడానికి సిద్ధముగాలేదని నేను చాలా బాధపడుతున్నాను. ఈ విషయములో Central Government తో మీరిచ్చే సహాయం మీరు ఇవ్వండి, మిగతాది మేము భరిస్తామని మీరు చెప్పండి, లేకపోతే, మీరిచ్చే డబ్బు మీరు ఇవ్వండి, మిగతాది ప్రజలు పెట్టుకోడానికి సిద్ధంగా ఉన్నారని చెప్పండి. అంతే కాకుండా, ఈనాడు schoolsకు కావలసినటువంటి Agriclutural Farms పెట్టాలనే ఉద్దేశముతో మేమొక Plan ఇచ్చి అనేకసార్లు చెప్పాము. దానిని ఎన్నిసార్లు recommend చేయమని అన్నా కూడ, డబ్బులేదు కాబట్టి ఆ విధంగా చేయడానికి వీలులేదని అంటున్నారు. Agricultural Farms schools కు attach చేసి ఉండాలని చెప్పాము. ఎందువల్లనంటే ఇప్పుడు ఇచ్చేటటువంటి విత్తనాలు సరిగా రావడంలేదు. ఇప్పుడు ఒక పెద్ద రైతు దగ్గర విత్తనాలు తీసుకొనివచ్చి అవే మంచి seeds అని రైతులకు ఇస్తున్నారు. అటువంటి seeds ప్రతి రైతువద్ద ఉంటాయి. అటువంటివి ప్రత్యేకంగా గవర్నమెంటు కాని ఇవ్వవలసిన అవసరములేదు. దానికి కావలసిన పరిస్థితులు న్యాయంగా జరుగుతూ ఉన్నాయా లేదా అని చూడవలసియుంటుంది. Agricultural Farmsను schools కు attach చేసి, వాటిని demonstration plots గా 30 ఎకరాలకు తక్కువ లేకుండా ఏర్పాటుచేసి వాటిలో మంచి విత్తనాలు తయారుచేసి ఇచ్చినట్లయితే నిజాయితీ కన్పిస్తుంది. అంతేగాని, Agriculrural Department ను ఎక్కడో విత్తనాలు తీసుకు రమ్మనడం, వారు ఎక్కడివో తీసుకురావడం, ఆ విత్తనాలు భాగ

Sri Ch. S. R. V. P. Murthi Raju] [7th March 1956

లేవని రైతులు బాధపడడం, ఈ విధంగా జరగడం చాలా అన్యాయము. అనవసరంగా మనకు ఈ విధంగా డబ్బు ఎందుకు ఖర్చు పెట్టాలో నాకు అర్థం కావడంలేదు. కాబట్టి Agricultural Farms ను schools కు attach చేసి, అక్కడ సరియైనటువంటి Demonstrator ను వేసి అతని ద్వారా మంచి Experimental Plots తయారుచేయించి, అందులో నుంచి మంచి విత్తనాలు ఇప్పించడానికి ప్రయత్నము చేయవలసిందని కోరుతున్నాను. తరువాత Inspector of Local Boards కు పంచాయితీలకుగాను మీరు grants ఇస్తున్నారు. ఆ ఇచ్చేది తక్కువే గాని, దానిలో హడావిడి మాత్రం ఎక్కువగా కనిపిస్తున్నది. గ్రామాలు బాగు పడాలి అని అంటున్నప్పుడు, దానికి సంబంధించిన కార్యకలాపాలకు, సగము గ్రామాలు భరించుకుంటె, తక్కినది Central Government ఇస్తుందని అంటున్నారు. పదివేల రూపాయలకు దాటితే Centre ఇవ్వదు కాబట్టి పదివేల రూపాయలు దాటిన వాటికోసం మన State లో చాలా డబ్బు కావలసియున్నది. ప్రతి గ్రామానికి రోడ్లు మొదలగు సౌకర్యాలు ఏర్పాటుచేయవలసిన అవసరమున్నది. కాబట్టి Inspector of Local Boards కు grants ఇచ్చే విషయంలో పది లక్షలకు తక్కువ లేకుండా ప్రతి సంవత్సరం కేటాయించవలసిందిగా కోరుతున్నాను.

ఇక ఆరోగ్య విషయములో, మనకు ముఖ్యంగా ఉండవలసి నటువంటి ప్రచార మేమిలేదు. ప్రజలకు ఆరోగ్యము విషయములో కూడ సరియైన ప్రచారము లేనప్పుడు మన మేమి చేయగలుగుతామని అడుగుతున్నాను. మానవుడు ఎలా జీవించాలి అనే దానికి గాను ప్రచారములు ముఖ్యంగా కావలసియున్నవి. ఆరోగ్యనికి కావలసిన సదుపాయాలు ఏర్పాటుచేసి, ఆహార నియమాలు మొదలైనటువంటి ఆరోగ్య సూచనలు నిర్ణయించి ప్రచారం చేయవలసిన బాధ్యత కూడ ప్రభుత్వము వహించవలసిన అవసరమున్నదని మనవిచేస్తున్నాను.

ఈనాడు ఏది తింటే బలము, ఏది తింటే బలముకాదు అనేదికూడ తెలుసుకునే స్థితిలో ప్రజలలో ఒక్కరు కూడా లేరు. ఇలాంటి స్థితిలో ప్రజలు ఉన్నప్పుడు కోట్లకొలది డబ్బు ఆరోగ్యముకొరకు ఖర్చుచేయడము ఎందుకో నాకు అర్థము కావడములేదు. ఈరోజు ఎక్కడ చూచినా ప్రభుత్వము డాక్టర్లను ఉత్తీర్ణులనుచేయటానికిగాని, వారికి హాస్పిటల్సుకు buildings కట్టించే నిమిత్తముగాని, ప్రభుత్వము ఎంత డబ్బు ఖర్చు చేస్తున్నదో చూస్తే, దానికి తగినట్లుగా ప్రజలకు అవి ఉపయోగపడుతున్నవా లేదా, ఈ డాక్టర్లు ప్రజలకు సరిగా చికిత్సచేసి, వచ్చిన జబ్బులు నయము చేస్తున్నారా లేదా అనేది ఆలోచిస్తే, చాలా తక్కువనే చెప్పవచ్చు. అంటే వ్యయానికి తగిన ఫలితము కనబడడములేదు. ఎవరైనా యీ

చికిత్సాసిద్ధాంతము యేమిటి అని బాగా ఆలోచించి చూస్తే, ప్రభుత్వము ధనము వ్యయముచేసే సిద్ధాంతముతప్ప మరేమి కనబడదు. మానవుడు అనేవాడు, ఆడవారుగాని, మగవారుగాని సక్రమ పంథాలో ఉదయము నుంచి సాయంత్రము వరకూ పనిచేస్తూ, నడుచుకుంటూ ఉంటే యిందులో ఎవరికి కూడ అనారోగ్యము సాధారణముగా రాదని నా నమ్మకము. ప్రతివారుకూడా తాను తినే ఆహారపదార్థములో యేమి ఉన్నది, మంచి ఉన్నదా, చెడు ఉన్నదా, దీనిని భుజించినట్లయితే ఫలితము యేమిటి అనేది ఆలోచించాలి. ఈనాడు ప్రభుత్వమువారు ఏదో హాస్పిటల్సు అని, వైద్యము అని లక్షలకు కోట్లకు ఖర్చుచేసేబదులు కొంతవరకు ప్రకృతి వైద్యసిద్ధాంతము దానియొక్క ఉపయోగముగూడ కొంతవరకు విచారించి, యీ ప్రకృతివైద్యమునుగూడ ప్రోత్సహించవలసిందిగా కోరుతున్నాను. ప్రకృతి వైద్య సిద్ధాంతమును అమలులోకి తేవటానికి మనము యిప్పుడు ఖర్చు చేస్తున్నంత డబ్బు వ్యయపరచ నక్కరలేదు. ప్రకృతిసిద్ధాంతము అంటే నేచర్ క్యూర్ అని అంటారు. మానవునికి యేజబ్బు వచ్చినను నేచరు వల్లనే ఆ జబ్బు నివారణ చేసుకోవచ్చు. ఆ విధముగా నివారణ అవుతున్న కేసులు ఎన్నో ఉన్నవి. ఒక్కసారి ప్రభుత్వము దీనియందు శ్రద్ధ చూపించమని అంటున్నాను. ప్రస్తుతము యీ ఆరోగ్యముక్రింద కోట్లు ఖర్చు చేసేబదులు కొంత సొమ్ము యీ ప్రకృతివైద్యమునకు ఖర్చుచేయాలని అంటున్నాను. ఈవైద్యముయొక్క ప్రభావము, ఫలితము ఎంతో ఉన్నది. దీన్ని గురించి ప్రజలలో ప్రచారము చేసినట్లయితే, చాలా ఉపయోగము కనబడుతుంది. ఈ నాడు మన దేశములో ప్రస్తుతవైద్యశాస్త్రములో నమ్మకము రానురాను పోయి, అనేకమందికి ప్రకృతివైద్యశాస్త్రములో నమ్మకము కలిగింది. ప్రకృతివైద్యశాస్త్రమును అమలులోకి తెస్తే, ప్రజలు అదే ఎక్కువగా అవలంభిస్తారు. కారణము యేమిటంటే, డబ్బు ఖర్చు తక్కువ. డాక్టర్లవద్దకు పోయి రూపాయలు ఖర్చుచేయ నక్కరలేదు. అందువల్ల కనీసము యీ ప్రకృతివైద్యశాస్త్రమును ప్రోత్సహించటానికి ఒక లక్ష రూపాయలు కేటాయించండి. ఈ సొమ్ము దానియొక్క ప్రచారమునకైతే నేమి, దానియొక్క elementary principles ప్రజలకు బోధించటానికి ప్రచారానికైతే నేమి, కేటాయించమని కోరుతున్నాను. ఇటివంటి చికిత్సకు ప్రజలు అలవాటు పడితే, ప్రజలలో అనారోగ్యము వెంట వెంటనే కలగదు. డబ్బు కూడ వ్యయము చేయవలసిన అవసరము ఉండదు. ఈ వైద్యము చిన్న చిన్న పిల్లలుగా ఉండినప్పటి నుంచి, వారిని యీ అలవాటులోకి మార్చవలసి యున్నది. చిన్నప్పటినుంచి వాళ్లకు బోధించినట్లయితే, వారు పెద్దవారైనను దానికే అలవాటుపడి ఉంటారు. పిల్లలకు స్కూల్సులో గూడ యీ వైద్యశాస్త్రము బోధింపజేయాల్సి వున్నది. ఈ శాస్త్రము కూడ వారి యితర పాఠముల్లతో పాటు నేర్పింపజేయమని నా కోరిక. వెనుక

Sri Ch. S. R. V. P. Murthi Raju] [7th March 1956

ప్రకాశం పంతులుగారి హయాములో ఒక పర్యాయము దీనికి కొంత సొమ్ము యిచ్చారు. మరల క్రిందటిసారి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా ఉండగా అయిదు వేల రూపాయలు గ్రాంటుగా యిచ్చారు. ఈ వైద్యమును గురించి ఎవరికి అయితే తెలుసునో, వారిచేత సిఫార్సు చేయిస్తే తప్ప దానికి గ్రాంటు యివ్వము అని ప్రభుత్వము అంటున్నది. వైద్యుల వద్దకు వెళ్లి మా ప్రకృతి సిద్ధాంతము సంగతి చూడండి అంటే, ఎవరు వింటారు? ఏదో సామెత చెప్పినట్లు డబ్బు వదిలితేగాని, ఛిద్రము వదలదు అనేమాదిరిగా, ప్రతి జబ్బుకు డబ్బు వదిలితేగాని, జబ్బు నయము అయినా కాకపోయినా, మనస్సుకు అది ఒక రకమైన తృప్తి, ఆనందము కాబోలు. ఇదివరకు గ్రాంటుచేసిన అయిదు వేల రూపాయలు యివ్వలేదు సరికదా, అసలు యీ వైద్యమును encourage చేస్తాము అనేమాట కూడ ప్రభుత్వము చెప్పలేదు. కాబట్టి ఇప్పటికైనా ముఖ్యమంత్రిగారు దీనియందు కొంత శ్రద్ధవహిస్తారని, గ్రాంటుగా యిస్తామన్న సొమ్ము అయినా యిచ్చి దీనికి కావలసిన సదుపాయాలు చేయిస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను. ఇంకా ఎన్నో విషయాలు ఉన్నవి. వాటి విషయము తరువాత మనవిచేస్తాను.

SRI. A. VENKATARAMAYYA :—ఉపాధ్యక్షా, ఈనాడు ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి అయిన గోపాలరెడ్డిగారు ప్రవేశపెట్టిన బడ్జటును నేను బలపరుస్తూ, ముఖ్యమైనవి రెండుమూడు విషయాలు మాత్రము ప్రభుత్వమువారి దృష్టికి తీసుకొని రావలసిన అవసరము గలిగింది. ముఖ్యంగా ఈనాటి బడ్జటులోని విషయములు చూస్తే, ప్రభుత్వము రైతాంగముమీదనే ఎక్కువగా పన్నులు వేస్తున్నట్లుగా కనబడుతున్నవి. దీనివల్ల రైతులు అనేకవిధములుగా బాధపడుతారని ప్రభుత్వానికి తెలియని విషయముకాదు. రైతుకు ప్రభుత్వానికి పన్నుల మూలముగా డబ్బు అందజేస్తున్నప్పుడు, వారికి ప్రభుత్వము కావలసిన సౌకర్యాలు కలుగజేస్తున్నారా, లేదా, అనేదిచూస్తే, అందులో ఏఒక్కటిగూడ సక్రమముగా యివ్వడములేదని చెప్పక తప్పదు. ఈనాడు మా డెల్టా ఏరియాలోవున్న రైతాంగానికి మాగాణి భూమికి యిచ్చే నీరును బ్రిటిషువారి హయాములో వున్న యింజనీర్లు అనేకవిధములుగా పన్నురూపములో తీసుకొని, వారికి కావలసిన నీరును యిచ్చేవారు. సాగుకుకూడా యిబ్బందిలేకుండా పోయిందని అది మనకు ఒకవిధముగా మంచిదిగా తోచినప్పటికినీ, ఆనాడు నీరు వున్నంతమాత్రముచేత అది యిచ్చినంత మాత్రముచేత, రైతాంగము సరియైనపంట పండించి, ఆర్థిక స్తోమతు చేకూర్చుకోటానికి అవకాశాలు చాలా తక్కువగా వుండేవి. కారణము ఏమిటంటే సకాలములో నీరు యిచ్చినప్పటికినీ, excess గా వచ్చిన నీరును బయటికి పంపించే

మార్గము యింతవరకు చేయలేదు. మా డెల్టా తాలూకాలలో, అందులో ముఖ్యంగా మా తెనాలి తాలూకాలో అనేక సంవత్సరాలనుంచి drainage schemes కొరకు ఆందోళనచేస్తూ వస్తున్నాము. అందులో తుంగభద్ర డ్రేనేజి స్కీము అని, భట్టిప్రోలు డ్రైనేజిస్కీము అని, యీ రెండూ ఏర్పాటుచేయమని ఎంతోకాలముగా ఆందోళన చేస్తూవచ్చిన పరిస్థితులు వున్నవి. ఈ స్కీములు అమలులోకి తీసుకుని రాకపోయినందువల్ల, అక్కడ రైతాంగము చాలా కష్టనష్టాలకు గురిఅవుతున్నారు. పండించే పంటకూడ దక్కించుకోలేక పోతున్నారు. క్రొత్తగావేసే పన్నులవల్ల ప్రభుత్వానికి సుమారు 45 లక్షలు వస్తుందనుకొంటున్నప్పుడు, ఇందులోనుంచి కనీసము 25—30 లక్షలుదాకా ఖర్చుచేసి యీ రెండు డ్రైనేజి స్కీములు అమలులోకి వచ్చేటట్లుగా ప్రభుత్వము ఏర్పాటు చేయకపోతే రైతులు అనేక బాధలకు, నష్టాలకు గురికావలసి వస్తుంది. రైతులవద్ద అధికంగా పన్నులు వసూలు చేసేటప్పుడు, దానికి తగిన ప్రత్యామ్నాయ ప్రతిఫలము చూపించవలసిన బాధ్యత ప్రభుత్వమునకు ఉంటుందని ప్రభుత్వము తెలుసుకోగలదని ఆశిస్తున్నాను. అందువల్ల యీ అధిక పన్నులద్వారా వచ్చే సొమ్ములోనుంచి కొంత సొమ్మును యీ రెండు drainage schemes క్రింద ఖర్చు చేయవలసిందిగా కోరుతున్నాను. ఇంతేకాకుండా, యిప్పటికే రైతులవద్దనుంచి యింతసొమ్మును ప్రభుత్వము రాబట్టుతున్నప్పుడు వారికి కావలసిన కనీస సౌకర్యాలైనా లేకుండ వుంటున్నవి. అదృష్టవశాత్తు యీమధ్య మన ఆంధ్ర ప్రభుత్వమువారు ఎరువుల పంపకము మాత్రము వ్యక్తులచేతులలో నుంచి తీసుకుని, కో-ఆపరేటివ్ సొసైటీలద్వారా సప్లయి చేయించటానికి ఏర్పాటు చేశారు. అందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసినదే కాని యిది చాలదని చెప్పక తప్పదు. ప్రభుత్వము రైతాంగము వద్ద పన్నుల రూపములో అనేకవిధములుగా వసూలు చేయదలచుకున్నప్పుడు, వసూలు చేస్తున్నప్పుడు, వారికి కావలసిన సౌకర్యాలు యింకా ఎన్నో వున్నవని అంటున్నాను. ఉదహారణ చెప్పాలంటే యిదివరకు బండిపట్టాలు 25, 30 రూపాయలకు దొరకుతూ ఉండేవి. ప్రతి రైతుకున్నూ యివి ముఖ్యంగా కావలసిన పరికరములు. బండిపట్టాలు ఈరోజున 80, 90 రూపాయలకు అమ్ముతున్నారు. ఈ పట్టాలకు యింతఖరీదు ఎక్కటానికి కారణము యేమిటో ప్రభుత్వమే గ్రహించాలి. ప్రభుత్వము యేమిచేస్తున్నదని ప్రజలలో ఆందోళనగా వున్నది. ఇదిగాక సిమెంటుబస్తాల విషయము చూడండి. సిమెంటుబస్తా యిదివరకు నాలుగు అయిదు రూపాయలకంటె ధరలేదు. అటువంటిది యీరోజున మార్కెటులో ఎనిమిది రూపాయలకు అమ్ముతున్నది. ఈ విధంగా ప్రతివస్తువున్నూ, అందులో ముఖ్యంగా వ్యవసాయదారునకు కావలసిన ప్రతి వ్యవసాయ పరికరమున్నూ యీ విధంగా

Sri A. Venkataramayya] [7th March 1956

ఎక్కువ ధరలకు అమ్మేటట్లుగా వుంటే, రైతాంగానికి చాల కష్టతరమవుతుందనేది గుర్తించాలి. ఈ విషయము ప్రభుత్వముదృష్టికి వచ్చిందో రాలేదో తెలియలేదు. ఈ విధముగా ప్రతిఏస్తువున్న హెచ్చుధరలకు అమ్ముతుంటే, ప్రభుత్వము ఎందుకు మిన్నకుండా వున్నదో అర్థముకావడము లేదు. ఇటువంటి పరిస్థితులలో వ్యవసాయదారుడైన వాడికి కావలసిన వస్తుసామగ్రి నంతా కో-ఆపరేటివు సొసైటీల ద్వారానే సక్రమమయిన ధరలకు రైతాంగానికి సరఫరా అయేటట్లు చూడాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో వాణిజ్యపంటలు పొగాకు, చెరుకుతోబాటు పసుపుగూడ వేస్తున్నారు ఈ పసుపుపంట యెక్కువగా మన దేశమునకే గాకుండా విదేశాలకు పంపించగలిగినంత turmeric నూ గుంటూరు జిల్లాలోనే పండించడ మవుతున్నది. పొగాకు విదేశాలకు పంపడము వల్ల మనము డాలర్లను ఏ విధముగా ప్రభుత్వానికి సంపాదించ గలుగజేయుచున్నామో, అదేవిధముగా పసుపువల్లకూడ డాలర్ల సంపాదనకు అవకాశములు ఉన్నవి. ఈనాడు మా గుంటూరు జిల్లాలో పసుపు ఎక్కువగా పొగాకుతోబాటు సరిసమానంగా పండిస్తున్నారు. ఎంతో అభివృద్ధిలోకి వచ్చినది పొగాకుకు ఏర్పరచిన మాదిరిగా, ఈ పసుపుకుగూడ Central Committee ని ఒక దానిని ఏర్పాటుచేస్తే, పసుపు పండించే రైతులకు ఎంతో ఉపయోగముగా ఉంటుంది. మన రాష్ట్రములో ఎంతోమంది backward communities వున్నవి. వారికి విద్యావిధానము సరిగా జరగడము లేదు ఉచిత విద్యాబోధన చేయించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. వాళ్లకు medical సౌకర్యాలు బొత్తిగా కనబడడము లేదు. ప్రభుత్వము యీ రోజులలో డాక్టర్లనుగా తయారు చేయటానికి ఇంజనీర్లను తయారు చేయటానికి stipends మూలముగా యెంతో ధన సహాయము చేస్తున్నారు. వారు ఉత్తీర్ణులై వచ్చిన తరువాత ప్రభుత్వమునకు వారి యొక్క సర్వీసెసును ఉపయోగించుకోడానికి ప్రభుత్వము ప్రయత్నించుటలేదు. ప్రభుత్వము యొక్క ధన సహాయముచేత చదువుకొని, ఉత్తీర్ణులై వచ్చి, ప్రైవేటు ప్రాక్టీసు పెట్టుకుని వేలకొలది డబ్బు సంపాదించుకొంటున్నారు. ఆ విధంగా ధన సహాయము ప్రభుత్వమునుంచి పొందిన వారిని ప్రభుత్వము తరపుననే ఎందుకు పనులు చేయించుకోకూడదు? రైతాంగముమీద, Betterment Tax అని, ఆపన్ను అని, యీపన్ను అని ఎన్నోవిధాలుగా రైతాంగమును బాధించి సేకరించిన డబ్బును యీ విధముగా ప్రజలకు ఉపయోగించని వారికిగాను ప్రభుత్వం ఎందుకు ఖర్చుచేయాలి? రైతాంగానికి నీరుయిచ్చి, Betterment Tax ను ఏ విధముగా వసూలు చేస్తున్నారో, అదేవిధముగా ప్రభుత్వము యిచ్చిన డబ్బుతో చదువుకొనివచ్చి, ప్రైవేటు ప్రాక్టీసు పెట్టుకుని డబ్బు గణించు

కుని పోయేటట్లు అయితే, అటువంటి వారివద్దనుంచి ప్రభుత్వము ఆ సొమ్మును ఎందుకు వాపసు రాబట్టకూడదు? ఈ విధానము ప్రభుత్వము అవలంభించేటట్లయితే, ప్రభుత్వపు డబ్బు తిరిగివస్తుంది. లేకపోతే, ప్రభుత్వానికయినా వుపయోగపడతారు గదా! ఈ విధానమును అవలంభించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :— ఇంజనీర్లు, డాక్టర్లేనా? లాయర్లు కూడానా?

SRI A. VENKATARAMAYYA :— లాయర్లుకూడానండి.

AN. HON. MEMBER :— అంటే వృత్తిపన్ను వేయమనా?

SRI A. VENKATARAMAYYA :— వృత్తిపన్ను వేయమనికాదు. ప్రభుత్వముఇచ్చిన సొమ్మును వాపసు తీసుకోమని.

THE HON. SRI A. B. NAGESWARA RAO :— డాక్టర్లకు, లాయర్లకు మీ బోటి ధనవంతులు ప్రభుత్వమునకు డబ్బు పెట్టుబడిపెట్టి, ఆవిధముగా చేయమంటే, ప్రభుత్వానికి ఏ విధముగాను అభ్యంతరము ఉండదు.

SRI A. VENKATARAMAYYA :— మాబోటివారు కాదు. ప్రభుత్వము యింతవరకు విద్యకొరకు డబ్బు సహాయము చేసినవారి విషయమును గురించి చెబుతున్నాను. (Interruption) మాబోటివారు యిచ్చేడబ్బు అంటే ప్రత్యేకంగా రైతులనుంచి taxes రూపములో ప్రభుత్వము వసూలుచేసే డబ్బు విషయమును గురించే నేను చెబుతున్నాను. ఇది అంతా మా బోటివారు యిచ్చే డబ్బుఅనే చెప్పటానికి తప్పడములేదని అంటున్నాను. అందువల్ల యిలాంటి పరిస్థితులు ప్రభుత్వము ఆలోచించాలని అంటున్నాను. ఈనాడు నేను ప్రభుత్వాన్ని ముఖ్యముగా కోరేది యీ drainage schemes ను గురించే. ప్రభుత్వము అనేక విధములుగా రైతాంగమునుంచి taxes రూపములో డబ్బు వసూలు చేస్తున్నప్పుడు, రైతాంగానికి ముఖ్యావసరమైన యీ drainage schemesను అమలు పరచటానికి ప్రభుత్వానికివున్న అభ్యంతరము ఏమిటి? ఇవి లేకపోతే, రైతాంగము చాలా నష్టపడుచున్నది గదా! కాబట్టి యీ సౌకర్యము ముందుగా చేయించమని కోరుతున్నాను. ఇదేవిధంగా manures, వ్యవసాయ పరికరాలు, అంటే బండిపట్టాలు యింకను వారికి కావలసిన యినుము వగైరాలు co-operative societies ద్వారానే సరఫరా చేయించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ముఖ్యంగా

Sri A. Venkataramayya] [7th March 1956

Black Market ను వెంటనే అరికట్టింప జేయాలని ప్రభుత్వాన్ని అర్థిస్తున్నాను. ఉపాధ్యక్షులవారు యీనాడు నేను మాట్లాడటానికి అవకాశ మిచ్చినందులకు వారిని నేను హృదయపూర్వకముగా నా కృతజ్ఞత తెలుపుకుంటూ విరమిస్తున్నాను.

*SRI G. SURYARAYANA :—ఉపాధ్యక్షా, దేశంలో బంజరు భూములను పేద ప్రజానీకానికి యిచ్చి, వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడతామని పదే పదే ప్రభుత్వం ప్రకటనలుచేస్తూ వచ్చింది. అదీకాకుండా 1954 సంవత్సరంలో వాల్తేరులో జరిగిన ఆంధ్ర శాసనసభా సమావేశంలో పేదలకు బంజరుభూము లివ్వాలని ఒక తీర్మానం pass చేసినారు. ఆనాడు Revenue మంత్రిగా ఉన్న శ్రీ కోటిరెడ్డిగారు కొన్ని భూముల పంపకవిధాన కార్యక్రమం మొదలు పెట్టారు. ఈనాడు ప్రభుత్వం ఆ కార్యక్రమాన్ని త్రోసిపుచ్చి, పేదలకు బంజరుభూములు ఉచితంగా యిస్తే గవర్నమెంటుకు డబ్బు లోటువస్తుందని బంజరు భూములను అమ్మకానికిపెట్టే విధానం నిర్ణయించారు. అది ఎవరికి లాభం? అది పేదప్రజలకు లాభమా, లేక ధనికవర్గానికి, భూఖామందులకు లాభమా అనే విషయం ప్రభుత్వం గుర్తించలేదు. ఈనాడు ఈ బంజరుభూముల అమ్మకం డబ్బున్నవారికి, ఎక్కువగా భూములున్నవారికే లాభంకాని పేద ప్రజానీకాని కెంతమాత్రం లాభంలేదని నే ననుకొంటున్నాను. దేశాన్ని socialist వ్యవస్థగా రూపొందించి, ఆ socialist పునర్నిర్మాణంలో ప్రజల జీవిత ప్రమాణాన్ని అభివృద్ధి పరుస్తాము, నిరుద్యోగ సమస్య లేకుండా చేస్తామని కాంగ్రెస్ ప్రభుత్వం పదేపదే చెబుతూ వస్తున్నారు. ఒకప్రక్క socialist విధానం అమలు పరుస్తున్నామని ఇంకొక వైపున రైతులపై పన్నుభారం ఎక్కువచేయుటకు ప్రభుత్వం నిర్ణయించుకుందంటే అది చాలా విచారకరమైన విషయం. ఇదేనా socialist వ్యవస్థ నెలకొల్పడం. ఇదేనా socialist సిద్ధాంతాలపై దేశాన్ని పునర్నిర్మాణం చేయడం? ఈ నూతనమైన పద్ధతిపై ప్రజలకు ఉండడానికి యిల్లు, తినడానికి తిండి, కట్టడానికి బట్ట కల్పిస్తామని నాయకులు చెబుతున్నారు. పెద్దలందరూ సోషలిస్టు సమాజాన్ని గురించి గొప్పగా చెబుతూవుంటారు కాని వ్యవసాయ కూలీలకు, పేదప్రజానీకానికీ ఏమీ చేయలేదని నా మిత్రుడు శ్రీనివాసరావుగారన్నారు. గత డిశెంబరు నెలలో నందికొండ ప్రాజెక్టు క్రిందవుండే బంజరు భూముల వేలంపద్ధతి ప్రభుత్వం నిర్ణయిస్తే, అది న్యాయంకాదు పేదప్రజానీకానికి చాలా నష్టం. ఈ పద్ధతి విరమించుకోండని ఒక memorandum తీసుకుని socialist party అధ్వర్యాన కొన్నివేలమంది ప్రజలు నందికొండ ప్రాజెక్టు శంఖుస్థాపన సందర్భంలో శ్రీ జవహర్లాలు నెహ్రూగారువచ్చినప్పుడు శాంతియుతంగా తమ కోర్కెలను వారికితెలియ

7th March 1956] [Sri G. Suryanarayana

జేయడానికి వెళ్లగా మధ్యత్రోవలో socialist సభ్యుల నందరనూకూడా ఈ ప్రభుత్వం arrest చేసింది. ఇదేనా socialist వ్యవస్థను స్థాపించడం ? హరిజనులను గురించి బడ్జటు పుస్తకాలలోమాత్రం వారి ఆర్థిక పురోభివృద్ధికిగాను అనేక సూచనలు చేస్తారు. ఇవి ఒకజిల్లాలో అయినాసరే అమలు పరచారా అని అడుగుతున్నాను. ఇండ్లస్థలాలు యిస్తున్నాం, మంచినీళ్ళ బావు లిస్తున్నాం, బంజరుభూము లిస్తున్నాం అని చెప్పడమే గాని చేసిన కార్యక్రమం శూన్యం. ఈ ప్రభుత్వంలో హరిజనులు ఏమీ అభివృద్ధి కాలేదని బాహాటంగా చెప్పగలను. మన దేశానికి స్వాతంత్ర్యంవచ్చిన తరువాత విశాఖపట్టణం జిల్లాలో బంజరు భూములను గురించి, ఇండ్లస్థలాలను గురించి, వయోజన పాఠశాలలను గురించి ఎన్నోసార్లు అర్జీలు పెట్టుకున్నారు. హరిజనులు అస్పృశ్యతవల్ల ప్రక్కనున్న గ్రామాలలో సవర్ణ హిందువులు హరిజన బాలబాలికలను బడిలోకి రానీయకుండా ఆటంకం చేస్తున్నారు. మా పేటలలో ఎక్కువ జనాభా అంటె 100, 200 కుటుంబాలున్నచోట ఒక వయోజన పాఠశాల యివ్వండి. మా పిల్లలకు విద్యవుంటే ఏనాటికైనా పైకి వస్తామని అంటే, ఒక్క గ్రామంలో కూడా వయోజన పాఠశాల పెట్టలేదు. ఒక శ్రీకాకుళంజిల్లా మిత్రుడు ప్రశ్నిస్తే 300 వందల కుటుంబాలకు ఇళ్లస్థలాలు యిస్తున్నా మన్నారు. విశాఖపట్టణం జిల్లాలో ఎన్ని ఇచ్చారో, తూర్పుగోదావరి జిల్లాలో ఎన్ని యిచ్చారో నాకు తెలియదుకాని ప్రకాశం మంత్రివర్గంలో కోటిన్నరరూపాయ లిచ్చారు. అప్పటినుంచి యిప్పటివరకుకూడా ప్రతి సంవత్సరం డబ్బు కేటాయిస్తూనే ఉన్నారు. ఈ డబ్బు ఏమవుతోంది ? ఈ డబ్బు దుబారాగా ఖర్చవుతోందా లేక హరిజనులకు ప్రయోజన పడుతోందా అంటే మాత్రం నాకేమీ కనిపించడంలేదు. Marketing society పెట్టుకుంటాం. మాకు share ధనం కట్టడానికిమాకు డబ్బులేదు, ప్రభుత్వం మాకు సహకారబ్యాంకులు పెట్టండి, మాకు వృత్తులు కల్పించండి, నిరుద్యోగ సమస్య తీర్చండి అని ప్రభుత్వాన్ని పదేపదే అడిగినా మాకు సంబంధంలేదు. మీరేమైనా డబ్బు తీసుకువచ్చి కట్టండి, దానిపైన మేమిస్తాం అంటారు. ఇది ఎంతవరకూ హరిజనాభివృద్ధి కార్యక్రమం అమలు పరుస్తుందో నాకు తెలియడంలేదు. ఇంక శిల్పకారు లున్నారు. వారి ఆర్థికపరిస్థితి బాగుచేయుటకు వారికి మార్కెటింగు society ఏర్పాటుచేసి వాటిద్వారా వారి వస్తువులను తీసుకుని డబ్బు సహాయంచేసి వాళ్లకు జీవనాధారం కల్పించమని నే నిదివరకు చెప్పాను. దాన్ని గురించికూడా ఈ బడ్జటులో లేదు. ఆంధ్రదేశంలో సముద్రతీర గ్రామాలలో చేపలు పట్టుకుని జీవించేవారు చాలామంది ఉన్నారు. వారికి విద్యాసౌకర్యాలుగాని, వైద్య సౌకర్యాలుగాని ఏమీలేవు. వారి పేటలకుపోయి చూస్తే చాలా

Sri G. Suryanarayana] [7th March 1956

అసహ్యంగా ఉంటుంది. వారిని పైకి తీసుకురావాలంటే 2, 3 గ్రామాలకు ఒక సంఘం స్థాపించి వారికి సౌకర్యం కలుగచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించమని చాలామంది చెబుతున్నారు. 14 గ్రామాలకు ఈ వ్యవసాయ కూలీ చట్టం వర్తిస్తుందన్నారు. కాని ఆంధ్రదేశంలో ఉన్నవి ఈ 14 గ్రామాలేనా ? దేశం అంతా ఈ వ్యవసాయకూలీ కనీస వేతన చట్టం అమలు పరచాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మా విజయనగరం area లో ఒక Industrial co-operative society పెట్టి దానికి ప్రభుత్వం కొంత ధనసహాయం చేయవలెనని కోరుతున్నాను. 8, 9 class ల వరకూ చదువుకున్న విద్యార్థులున్నారు వారికి వృత్తులులేవు. ఆత్మహత్యకుకూడా సిద్ధపడుతున్నారు. అల్లాంటి వారికి చేతిపనులు నేర్పి వృత్తి కల్పించాలని కోరుతున్నాను.

చదువుకొన్న హరిజన విద్యార్థులు ఉన్నారు. అనవసరముగా దిక్కులేక జీవహత్య చేసికొనడానికి సిద్ధముగా ఉన్నారు. వారికి రెండువృత్తులులేవు. వారు చాలా వెనుకబడిఉన్నారు. వారిని బైటకు తీసుకురావాలంటే చేతిపనులను కల్పించి వారికి జీవితమార్గము చూపించవలెనని ఒక సొసైటీద్వారా అడిగినాను. దానిని ఇంతవరకు కూడా ప్రభుత్వంవారి దృష్టిలో పెట్టుకొనందులకు విచారిస్తున్నాను. ప్రతి తాలూకాలోను ఈ హరిజన విద్యార్థులకు Industrial societies basis మీద సహాయము చెయ్యవలెను. హరిజన విద్యార్థులకు స్కాలరుషిప్పులు ఇస్తున్నాము. మధ్యాహ్నము భోజనములు ఇస్తున్నామని చెప్పవచ్చును. కాని ఇవి ఎంతవరకు లభిస్తున్నవి. వీటితో హరిజనులు విద్యాభివృద్ధి చెందినారాఅంటే అది లేదు. ప్రభుత్వంమాత్రము డబ్బు ఖర్చుచేస్తున్నారు. జిల్లా హరిజన Welfare Officer లను అడిగితే మాకు తెలియదు మీరు అసెంబ్లీ తీర్మానముచేసిన విధముగా మేము చేస్తున్నాము. ప్రతి సంవత్సరము estimates తయారు చేస్తున్నాము అనడమేగాని 10, 20 గ్రామాలకైనా ఇండ్లస్థలాలు ఇచ్చినట్లులేదు. హరిజన Welfare Department ఏమిచేస్తున్నది ? తాలూకా తహసీల్దారును అడిగితే నాకు ఏమీ తెలియదు అంటారు. మీకు ప్రత్యేకముగా Harijan Welfare Department ఉన్నది అంటారు. మంచి నీటి నూతులు గ్రామాలలోలేవు. హరిజనోద్ధరణ కార్యక్రమాలు అమలుజరగడములేదు. విశాఖపట్నంజిల్లాలో 4, 5 సంవత్సరములనుండి ఇండ్లస్థలాలకు దరఖాస్తులు పెట్టడము రెవెన్యూ ఇన్స్పెక్టరు రావడము హరిజన వెల్ఫేరు ఆఫీసరు రావడము జరిగిందిగాని మాకు ఇండ్లస్థలాలు ఇవ్వడములేదు, అని ప్రతివారు రిపోర్టులు చేస్తున్నారు. జిల్లాకు 30, 40 గ్రామాలకైనా ఈ స్కీము అమలుచేస్తారని అనుకొంటున్నాను. ప్రభుత్వం 250/- రూపాయలు ఉచితముగా యిస్తున్నాము, ప్రభుత్వం 250/-

రూపాయలు అప్పుగా ఇస్తుంది, ఈ 500/- రూపాయలు పెట్టి హరిజనులకు ఇండ్లు కట్టించడానికి స్కీము పెట్టినాము, అని గత జిల్లా ప్లానింగుకమిటీలో ఆఫీసరుగారు అన్నారు. మేము ఆశపడ్డాము. ఇవి అన్నీ సూచనలుగానే ఉన్నవిగాని హరిజనులకు ఎంతమాత్రము లభించడములేదు.

మొన్న 25 వ తారీఖు పేపరులో, శ్రీకాకుళం విశాఖపట్నం జిల్లాలలో అంటరానితనము ఎక్కువగా ఉన్నదని ప్రకటించినారు నిజమే, విచారకరమైన విషయము దానిని నిర్మూలన చెయ్యడానికి ప్రభుత్వం ఏమిచేసినది? ఏదైనా రాజకీయ పార్టీలు మీటింగులంటే C. I. D. రిపోర్టర్లు వచ్చి వ్రాసుకుంటూరు ? అస్పృశ్యత నిర్మూలనకు C. I. D. Staff లాగ ఎందుకు వెయ్యకూడదు. గ్రామకరణము, మునసబులు ఇవి అమలుచేసేటట్టు ఉత్తర్వులు ఇవ్వాలి. హరిజన విద్యార్థులకు Co-opertaive society పెట్టి వృత్తులు కల్పించాలి అని కోరుచున్నాను

(At this stage Mr. Speaker resumed the Chair)

SRI SHAIK MAHAMMAD RAHIMTULLA :—అధ్యక్షా, ఆర్థిక మంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జటును బలపరుస్తూ కొన్ని విషయాలు మాత్రము చెప్ప తలచుకున్నాను.

ఇర్రిగేషనుకు, P. W. D కు మాత్రము కొంతడబ్బు కేటాయించినారు. కాని ఆ డబ్బు సక్రమముగా ఖర్చుపెట్టడము అనేది నమ్మకములేదు. P. W. D లో వేలు, లక్షలకొలది ఎస్టిమెట్లు చేస్తున్నారు. ఈ డబ్బు ఎక్కడకు పోతున్నది ? Material led అని వేస్తారు. 4 మైళ్లు led అంటే 8, 10 led వేస్తే unit ఒకటి అగుతుంది. ఇది జాస్తిఅయి ప్రభుత్వానికి చాలా నష్టముగాఉన్నది. P.W.D లో చిన్న చిన్న పనులు 20,000, 30,000 విలువగల పనులు ఎన్నో ఉన్నవి. వీటినిమాత్రము చెయ్యకుండా పెద్ద పెద్ద పనులు తీసుకోవలెనని నేను ప్రభుత్వంవారిని ప్రార్థిస్తున్నాను

కడప తాలూకా లో రేగులవాగు, నల్లవాగుకు 20,000. 30,000 రు॥లు ఖర్చు చేస్తే వాటిక్రింద నీటిపారుదల 250, గాని 300 ఎకరాలకు ఉంటుంది. 30 సంవత్సరాలనుంచి రైతులు కష్టపడుతున్నారు. ఇంతవరకు ప్రభుత్వము ఏమీ చర్య తీసుకోలేదు. దయయుంచి ప్రభుత్వంవారికి మనవిచేస్తున్నాను. ఈ చిన్న చిన్న పనులలో 25,000, 30,000 రు॥లు ఖర్చుతో ప్రభుత్వానికి ఆదాయముకూడా వస్తుంది; దానిలో ప్రభుత్వానికి నష్టములేదు. ప్రజలకు మేలుచేసినట్లు అవుతుంది,

హెల్తుడిపార్టుమెంటు, మొట్టమొదట health and wealth అన్నారు. ఎక్కడచూసినా anti-malaria declare చేసిన గ్రామాలు చాలా ఉన్నవి. మ్యునిసిపాలిటీలలో investigation కు ఎక్కువగా డబ్బుఖర్చు పెడుతున్నారు. కడప Town లో 1940 లో 3000/- రూపాయలు ఖర్చుచేసినారు. ఈ ధనము ఏమైనదో తెలియకుండా ఉన్నది. దయచేసి మలేరియా డిక్లేరు చేసినచోట్ల త్వరగా పనులు పూర్తిచెయ్యవలెనని ప్రార్థించుచున్నాను.

District Board Dispensaries కు సంవత్సరానికి 1200/- రూపాయలు గ్రాంటు ఇస్తారు. దీనిలో establsihment chargesకు ఎంత? మందులకు ఎంత? ఇస్తున్నారు. నెలకు 100/- రూపాయలంటే "ఎంతమంది రోగులకు మందులు ఇవ్వగలరో ఆలోచించవలెను. Dispensary లకు District Board funds లేనపుడు గవర్నమెంటు సహాయము చెయ్యవలెను. ప్రతిజిల్లాలో కూడా ఈ మాదిరిగా మందుఉంటే డాక్టరు ఉండరని, డాక్టరుఉంటే మందులు ఉండవని కొంతమంది సభ్యులు చెప్పినారు. అలాకాకుండా సక్రమముగా మందులు ఉన్నావా, డాక్టరు ఉన్నారా పరిశీలించి ప్రతి District Board Hospital కు ప్రభుత్వంవారు సహాయము చెయ్యవలెను అని ప్రార్థించుచున్నాను.

మన ఆంధ్రదేశములో గనులు, Minerals ఉన్నవి. Soapstone ? ఆంధ్ర, నుంచి పోయిన soapstone 90/- 100/- రూపాయిలవరకు snow white soap stone ఉంది. అది తీసుకుపోయి వేరేదేశాలలో 15. 16 వేలకు అమ్ముతున్నారు. ప్రభుత్వంవారు ఎందుకు చెయ్యకూడదు ? Iudustries మంత్రివద్దకుపోతే మీది సగము, మాది సగము అంటారు. ఈ అర్థం అనేది లేకుండా ప్రభుత్వంవారు లాభం వచ్చేటట్లు ఎందుకు చెయ్యకూడదు ? ప్యాపలి, డోను దగ్గర ఇది దొరుకుతుంది. విదేశాలకు, అమెరికాకు ఎక్కువగా పోతున్నది. 15, 16 వేలకు అమ్ముతున్నారు. దయచేసి, రు. 50 వేలుగాని లక్షగాని అయ్యేపరిశ్రమను ప్రభుత్వంవారు తీసుకోవాలని ప్రార్థిస్తున్నాను. దానిలో చాలా ఆదాయము వస్తుంది.

ఇనుపరాయిని గురించి ఇంతకుముందుకూడా నేను మనవిచేసియున్నాను. ఆంధ్రులు గనులుత్రవ్వి తీస్తుండే రాయికి ఆంధ్రులకు వచ్చేది టన్నుకు రెండు రూపాయలుమాత్రమే. డబ్బు సంపాదించేదెవరు ? మార్వాడీలు కష్టపడి చేసినందులకు ఆంధ్రులకేదైనా డబ్బువస్తుందా ? అదిలేదు. మార్వాడీలు మద్రాసులో స్టాకుచేసి దానిని విదేశాలకు పంపిస్తే టన్నుకు 12 రూపాయలు వస్తాయి. ప్రభుత్వమే విదేశాలకు ఈ యినుపరాయిని ఎగుమతి చెయ్యకూడదా ? ప్రభుత్వమే ఈ పనికి పూనుకుంటే లక్షల ఆదాయంవస్తుంది. అటువంటి పనిచేస్తే deficit అంతా పోతుందని నేను మనవిచేస్తున్నాను.

ఇప్పుడు ఆంధ్రలో మోటారు ఆపరేటర్లున్నారు. వాళ్లుకూడా ఆంధ్రులే విదేశాలవాళ్లు గారు. వాళ్లు ఒక్కొక్క బస్సుకు 28 వేలు, 25 వేలు రూపాయలు పెడితేగాని కొనలేకపోతున్నారు. వాళ్లలో డబ్బులేనివాళ్లు Mint street కు పోయి సాధారణంగా నూటికి రెండు లేక మూడు రూపాయలు వడ్డీయిచ్చి తెస్తున్నారు. ఆవిధంగానూ మార్వాడీలు లక్షలాది రూపాయలను తింటున్నారు. ఇందుకోసం ఒక Finance Corporation అనిపెట్టి దానికి కొంతడబ్బు కేటాయించి, "కొత్తబస్సు కొన్నవారికి 10 వేల రూపాయలు అప్పుయిస్తాం. 5 ఏండ్లలో మీరు తీర్చుకోండి" అనినప్పుడు పాతబస్సులుపోయి కొత్తబస్సులు వస్తాయి. ఆవిధంగా ప్రజలకు మేలుజేసినట్లవుతుంది. ఎందుకు మన మీపని చేయకూడదు? ఈ పని చేసినట్లయితే ప్రభుత్వానికేగాక ప్రజలకుకూడా మేలుజేసినట్లవుతుంది. రెండవది ఇప్పుడు Perkins engines విషయము. ఆంధ్రలో ఒక్కరికికూడా agency లేదు. దానివల్ల యింజన్లు కొనవలెనంటే Madras కు పోయి ముందు డబ్బుకట్టి దండంపెట్టి కాచుకునియుండవలయును. మనకు Industries Department ఉన్నది. Industries Department Secretary కై వారు గారున్నారు. చాలా మంచివారు. వేయియింజన్లు తెప్పిస్తే ఏ పదిలక్షల రూపాయలో లాభంవస్తుంది. అటువంటి పనులు మనం యేమీ చెయ్యడంలేదు. పెట్టెలు తీసిపెట్టేది. వచ్చిన ఇంజన్లకు డబ్బుకట్టి చెలానుచూపిస్తే పెట్టెలుయిచ్చేసేది. ఇటువంటి పనులుచేస్తేనే గాని లోటుతీరదు. తక్కువ జీతాలవారికి యిండ్లు కట్టించే నిమిత్తం ఒక పథకము వేశాము. ఇంతవరకూ ఏ ఒకటి రెండుచోట్లలోనో యిండ్లు కట్టించ కలిగాము. రాష్ట్రంలో 30 మునిసిపాలిటీలున్నాయి. అన్ని మునిసిపాలిటీలలోను మూడునెలల లోపల ప్లాను పూర్తికావలెనని పని ఆరంభిస్తే ఎంతోపని జరుగుతుంది. ప్రభుత్వంవారు దయచేసి తక్షణం ఈ స్కీమును తీసుకొని కొన్ని తావులలోనైనా అంటే, బీద జిల్లాలలో, బీదజిల్లాఅయిన రాయలసీమలోని కడపజిల్లాయందు తక్షణం పని పూర్తి చేస్తే ప్రజలకు మేలుజేసినటువంటి పుణ్యం మనకుంటుంది. ఇటువంటి జిల్లాలలో కొంచెం తొందరగా ప్రారంభించాలని నేను ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు cement జాస్తి ధరకు అమ్ముతున్నట్లు కొంతమంది సభ్యులుకూడా చెప్పినారు. ధర నాలుగు రెట్లు పెరిగిందని అన్నారు. అంతేకాకుండా ప్రభుత్వం తరఫున contractor లు చేస్తున్నపనులలో cement ను సరిగా వినియోగించడంలేదు. అయితే సిమెంటులో వాడకం specification ప్రకారంఉందా? అని చూస్తే ప్రభుత్వమునకు మేలుకల్గుతుంది. అట్లాలేకుండా 1. 6 వేసినా ఎవరూ చూసేవారు లేకపోయినట్లయితే ప్రభుత్వానికి నష్టమే ఏర్పడుతుంది. ప్రభుత్వానికి లాభం రావాలంటే surprise visit చేసి ఈ పనులను తనిఖీ చేయవలసిఉంటుంది. ఒక special department ను అయినాపెట్టి దానిని పరిశీలించవలయునని ప్రార్థించుచూ, ఇప్పుడు ఇచ్చిన అవకాశమునకు అధ్యక్షులవారికి వందనములు.

SRI SHAIK MOWLA SAHIEB :— నిన్నగాక మొన్నవచ్చిన ఈ బురఖాలకంతా యిన్వంగా 1921 వ సంవత్సరంనుంచి, ఇందులో పాటుపడి ఈ త్రాటిమీద నడచినటువంటివాడిని, మూడురోజులక్రింపట నేను permission కోరితే ఇప్పటివరకూ ఇవ్వకపోవడం అనేది ఏ దృష్టితో ప్రభుత్వం పరిపాలిస్తుందనే దానికి ఇక వేరే సాక్ష్యమక్కరలేదు, Sir.

Mr. DEPUTY SPEAKER :—ఇంకా 1½ గంటసేపు అవకాశం ఉంది. మీ turn వచ్చినప్పుడు మీరు మాట్లాడవచ్చును.

SRI P. KODANDA RAMAYYA :—అధ్యక్షా, Finance Minister గారు ప్రతిపాదించు నటువంటి Budget ను నేను పార్టీ సభ్యునిగా బలపర స్తున్నాను. కాని నా వ్యక్తిగత అభిప్రాయాలను విషయాలను ఇప్పుడిక్కడ తప్ప కుండా చెప్పాలనే కోరికతోనే నేను నిలబడ్డాను. ఈ దేశంలో ఇది Budget ల కాలం. Central Budget, తదితర రాష్ట్రాల budget లన్నీ కూడా ప్రవేశ పెట్టారు. అన్నీ కూడా Deficit Budget లే. ఒక్క Bombay తప్ప బడ్జట్టులో అధిక పన్నులు విధించినట్లు కనపరచకుండా మొట్టమొదటనే భూమిపై Surcharge విధించి తర్వాత బడ్జెటును తీసుకొచ్చారు. ఆ విషయంలో మన మంత్రిగారి యొక్క చాక చక్యానికి మనం అభినందించవలసిందే. అయితే దేశంలోని ప్రజల మనస్తత్వం, గుర్తించాలి ప్రజల ముఖ్యావసరాలేవో గమనించాలి. దేశంలో ఈలాటి బాధలను తొలగించి సర్వేజనః సుఖనోభవంతు అనేటట్లుగా రాజ్యాన్ని పరి పాలించాలి గాని పన్నులు వసూలుచెయ్యడం, ఖర్చు పెట్టడమేనా మన లక్ష్యం? ఇదేనా రాజ్యానికి పాలనకు ప్రధానమైన సూత్రం? ఎంత సేపు డబ్బు, డబ్బు అని చెప్పడం కన్న నైతిక దృక్పధాన్ని అలవరచుకోవడం అత్యావసరం. మాన వునికి ఏదైనా ఔన్నత్యం అన్నది రావాలంటే కేవలం ఆర్థికాన్నే base చేసుకొంటే కాదు. ఈలాంటి Budget లు పెట్టి మన మెప్పుడూ లోటు కనబరస్తూ, ఉండి నట్లయితే మనం రాజ్యాన్ని కొనసాగించడం అనే విషయాన్ని ఆలోచించాలి. ప్రస్తుత పరిస్థితులలో ఉన్న limitations నుబట్టి, చట్టాలనుబట్టి, వ్యవహారాలనుబట్టి ఇంతకంటే ఎక్కువగా వెళ్లలేరని నాకు కూడా తెలుసు. ఇక్కడ యుండే సభ్యులలో ఎవరినైనా ఆ స్థానంలో కూర్చుబెట్టినా ఇంత కంటే వేరేగా వెళ్తారనే నమ్మకం నాకేమియులేదు. అయితే పూర్తిగా విధానాన్ని మార్చాలి. మన దేశంలో వర్తకం చేయడంకోసమే వచ్చిన తెల్లవాళ్లు ప్రవేశపెట్టి నటువంటి విధా నాన్నే కాపీచేసి ఇంతవరకు, అనుసరిస్తున్నా మన్నమాట చెప్పక తప్పదు. ఏ ఇంగ్లాండో, ఏ అమెరికాయో, ఏ రష్యాయో చేసేటటువంటి విధానాన్నే మనం

పెట్టుకొన్నట్లు కనబడుతున్నది. అయినా ప్రస్తుత విధానంలో కొద్ది కొద్ది మార్పులు అవసరమని నేను చెప్పాను. అది ఏలాంటి మార్పులో మనం ముఖ్యంగా ఆలోచించుకోవాలి. నా ఉద్దేశ్యము ప్రకారం ఈ దేశంలో ఒకటే budget, ఒక్కటే రాజ్యం, ఒక్కటే పార్లమెంటు ఉండాలి గాని ఇప్పటి లాగా పలు రాష్ట్రాలుండి, అధిక పన్నులు వసూలుచేస్తూ మనం రాజ్యంచేస్తామంటే, ఈ దేశంలో ఏ మాత్రం పరిపాలన సాగజాలదని, ఈ రాజ్యాంగం ప్రజలకు యే విధంగాను శ్రేయస్సుకలుగజాలమని నేను దృఢంగా నమ్ముతూ, ఆ మాట చెప్పడం కోసమే నేను యిక్కడ నిలబడి యున్నాను. సైమన్ కమిషన్‌వచ్చిన నాటినుండి, ఈలాంటి భావం నాలో ఏర్పడి, ఈనాడు దానిని ధైర్యంగా మీ ముందర చెప్పడానికి సాహసించుచున్నాను. ఈ దేశంలో మీరు Planning పెట్టాలంటే, planning జరపాలి అంటే, planning ఏలా జరుపుతారు మీరు ? ఈ Agricultural Country లో రైతులమీద అధిక పన్నులువేస్తే, వారు పన్నులు కట్టలేక పూర్వపు భూములను వదలిపెట్టుకొంటారు. కూలీలు వక్రించినారు. భూమికిచ్చే పన్ను ఎక్కువ అయింది భూమి సాగుచేసుకునే రైతులకు ఖర్చులు ఎక్కువ అయినవి. ఈనాడువేసిన రోడ్లు నడవడానికి వీల్లేదంటున్నారు ప్రజలు. రామాచార్యులు చెవుల్లో పెట్టుకోవడానికి మూదిపంజి హాస్పిటల్సులో లేవన్నారు. ఈ జనవరి 21 వ తారీఖున కోయవాడకు వెళ్లాను. 34 సంవత్సరములకు పూర్వం నేను అక్కడికి వెళ్లితే ఆ కోయ ప్రజలు నన్ను ఏమీ అడుగలేదు. ఏమీ కోరలేదు. ఎప్పుడు ఎంత కావాలి అన్నా ఏమీ అక్కర్లేదు అనేవారు. ఆలాంటి వారు యిప్పుడు కొండలను చూపించి, “ఇదిగో! మాజిల్లేరుకు Project కట్టించు” అన్నారు. మాకు Hospital లేదన్నారు. మాకు School లేదన్నారు. మాకు రోడ్లు లేవన్నారు. మాకు ఈ ప్రభుత్వం యేమీ చెయ్యడం లేదన్నారు. ఈలాగా ప్రతిచోట మాకు ఇది చెయ్యి, అది చెయ్యి అని అడుగుతున్నారు. ఒక గిరిజనులు కోరిన కోరికలకే budget అంతా రద్దుచేసి ఆ డబ్బంతా అచ్చట ఖర్చు పెట్టినా చాలదు. ఇట్లాగే ప్రతిచోట ప్రజల మనస్తత్వం అన్ని చోట్ల అన్నీ కావాలనే కోరికలతో Prototype గా తయారుచేసింది. కావున ఈ ప్రభుత్వం యిదివరదాకా యుండే కొన్ని విధానాలను మార్చాలి. భారత సేవక్ సమాజంవారు కొంతవరకు సరిచేయిద్దామని ప్రయత్నించారు. తర్వాత Firka Development Scheme ను ఈ విధంగా తయారుచేయిద్దామని జనులుచేయిస్తున్నారు. వీటిలో ఆర్థిక విధానంలో ముఖ్యంగా యెక్కువ మార్పు మీరు తీసుకురావాలి. ఈ మార్పును అందరూ కూడా Administrative ఖర్చు అంటారు. నిజంగా ఒక్క సెంట్రల్ బడ్జెట్టే అయితే Governors కు జీతాలక్కరలేదు.

THE HON. SRI. A. B. NAGESWARA RAO :—గౌరవ సభ్యుడు ఏమైనా నిర్మాణాత్మకమైన సూచనలుచేస్తే సంతోషిస్తాము. తప్పకుండా అటు వంటి సూచనలు విమర్శలు చేయవచ్చునుగానీ, వారు ఎంత ఆవేశనతో చెప్పు తున్నారో, అంత ఆవేదనతో నిర్మాణాత్మకమైన సూచనలు చేయవలయునని కోరు తున్నాను.

SRI P. KODANDA RAMAYYA :—నేను సూచనలు చేయడానికి యేమీ అభ్యంతరంలేదు డిప్టీ ఇన్స్పెక్టరుగారు పత్రికల్లో మహాజన్ గారు కోదండ రావుగారు వ్రాస్తున్నారు. నాకన్నా ఎక్కువ బుద్ధిశాలురు, ఘనులు వ్రాస్తున్నారు. కనుక ఇంకాటయాం తీసుకొని ఇతర సభ్యులను యిబ్బంది పరచకుండా నేను విరమించు కొంటున్నాను.

SRI. SHAIK MOWLA SAHIB :—అధ్యక్షా, బడి పంతులు పిల్లకాయ లకు పాఠాలు చెప్పడానికి నిర్ణయించిన Time table మాదిరిగా మనం ద్వితీయ పంచవర్ష ప్రణాళికను భావించుకోవలసి యున్నది. కాని మన ముఖ్యమంత్రిగారు ఈనాడు ప్రవేశపెట్టిన బడ్జెటు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రథమ సోపానంగా భావించవలసి యున్నది. ఇదివరలో మన దేశపు డబ్బు పర ప్రాంతాలకు పోతూ ఉండేది. అప్పుడు అభివృద్ధి లేదు, ఇపుడు ఈ దేశంలో డబ్బు ఇక్కడే ఉంటోంది. దీనివల్ల అభివృద్ధి కనిపిస్తోంది. సంతోషము, ఒక రకంగా సంతోషము, మరొక రకంగా దుఃఖంగా ఉంటోంది, ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నామని కాదు. ప్రభుత్వం లోని లోటు పాట్లన్ని సద్దుకొని న్యాయంగా పాలిస్తారనే ఉద్దేశంతో సలహా ఇస్తున్నాను. ఇది కాక ప్రభుత్వానికి అదనంగా డబ్బువచ్చే విధానం సూచించా లనుకుంటున్నాను. ఇంగ్లీషు వారున్నప్పుడు ఏ ప్రాంతాలు అభివృద్ధి చెందినవో ఆ ప్రాంతాలకే ఇప్పుడు కూడా అభివృద్ధి కలుగుతుంది, ఆనాడు అహల్యాదేవి శాపంతో మ్రగ్గిపోతున్నట్లు వెనుకబడిన ప్రాంతాల్లో త్రాగడానికి మంచి నీళ్లు లేక బాధలుపడుతున్నారు. పాలలోనికి చక్కెరకోసం చూస్తున్నారుకాని నీళ్ల లోనికి ఉప్పులేని వాళ్ల విషయం చూడడమేలేదు, దానిని అమలుచేసి రాష్ట్రానికే కాకుండా దేశానికంతకు ప్రభుత్వ ఆదర్శాలు చాటిస్తారని మనవి చేస్తున్నాను. వెనుక గోపాలరెడ్డిగారు ఒక ఫిర్కాలో తిరుగుతూ-ఆవంచ, ఈ ఫిర్కాలకు శ్రీ రామ చంద్రుడువచ్చి అహల్యాదేవి శాపం తీర్చినట్లు జరగాలి తప్ప వేరుగత్యంతరంలేదని చెప్పారు. ఆ గోపాలరెడ్డిగారు ఇప్పుడు ముఖ్య మంత్రి అయినారు. ఆ ప్రాంతా లకు శాపవిముక్తి జరిగిందని ఆశించాము. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అటువంటి శాపవిముక్తి కలుగచేస్తారని ఆశిస్తున్నాను. 35 సంవత్సరాలనుంచి అంటే 1921 నుంచి

నెల్లూరుజిల్లాలో కాంగ్రెసు ముస్లిములలో నేను మొదటి వాణ్ణిగా ఉంటూ వచ్చాను. కాంగ్రెసులో ముఠా, రాజకీయాలు పెరిగి 0-4-0 కట్టి ప్రాథమిక సభ్యులను కూడా చేర్చుకోడానికి లేక ఆ పుస్తకాలను కూడా తిరిగి ఇచ్చివేయవలసి వచ్చింది. శాసన సభ్యుల సీట్లలో కూడా ఇక్కడ హెచ్చు తగ్గులు, తేడాలు ఉన్నట్లు కనిపిస్తోంది. ఈ సందేహాలన్నీ ప్రభుత్వంవారు పాటించాలని బ్రిటిషు గవర్నమెంటు మాదిరిగా వ్యవహరించవద్దని కోరుతున్నాను. బ్రిటీషు రాజ్యాంగ చట్టం, డిగ్రీలు, భాష డూప్లికేటు మాదిరిగా స్వతంత్రంవచ్చిన తరువాత హిందూ దేశానికి తీసుకురావద్దని కోరుతున్నాను. ఆనాడు బ్రిటీషుగవర్నమెంటుకు ఫాదరీలు, బైబిలు తోడైనాయి. ఆ పద్ధతిలో endowment చట్టాలు చేయకూడదు. శ్రీ కృష్ణ భగవానుడు భారతములో భగవద్గీత చెప్పినట్లు, హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడు భగవ ల్లీలను చూపినట్లు, హితవును పాటించి ప్రభుత్వం వ్యవహరించాలని కోరుతున్నాను. అసెంబ్లీ మెంబర్లను గురించి ప్రజలు ఏమనుకుంటున్నారంటే వేసే పన్నులను గురించి, ఆదాయం గురించి, ఖర్చులు గురించి ప్రభుత్వమువారు డిమాండ్లు తెస్తే sanction చేయడం, ఏవో ఉపన్యాసాలు చేయడం, అవసరం వచ్చినపుడు block వారీగా లేవడం, కావాలనడం తప్ప వీరికి ఉద్యోగం ఏమీ లేదని అనుకుంటున్నారు. ఇంత మాత్రమే అయితే ఇది ప్రజాప్రభుత్వం కాదు. గూర్పుతత్వాలు, ముఠాతత్వాలు ఈవిధంగా కాంగ్రెసులో ఉంటే ప్రతిపక్షాలు ఏవిధంగా ఉన్నా సముద్రంలో కలిసిపోక ఎట్లా ఉంటుంవి అనిపిస్తుంది. ఈ బడ్జెటునుచూస్తే బీదజనాభా నాశనం అవుతుంది అనిపిస్తోంది. ఇది రెండుకోట్ల జనాభా, ఒకకోటి జనాభా అయ్యే విధానము, ఎందువల్ల ఇలా అనుమానించవలసి వచ్చిందంటే బీదప్రజల అభివృద్ధికి ఎక్కువ డబ్బు కేటాయించబడలేదు. జీవనోపాధి గడవాలంటే ఉద్యోగాలు దొరికే అవకాశాలులేవు. భూములు సాగుచేసుకుందాము అంటే బంజర్లు ఇవ్వరు. నందికొండ వస్తే నీళ్లు వస్తాయి అనుకున్నాము కాని నందికొండ నీళ్లు గుంటూరు జిల్లావారికేగాని, నెల్లూరుజిల్లావారికి రావు అనే భయోత్పాతం కలుగచేస్తున్నది. Land Reforms వచ్చినా రాకపోయినా భూములు సాగుచేసుకొనడానికి ఒక విధమైన permission ఎందుకు ఇవ్వకూడదు? వారికి ఇప్పుడు జీవనోపాయం లేకుండాపోతున్నది. తక్కువ జీతగాళ్ల సంగతి తీసుకుంటే 20, 30 రూపాయల జీతాలలో క్రుంగిపోతున్నారు. వీళ్లవిషయమైఎన్నిసార్లు చెప్పినా జోక్యం కలిగించుకోడంలేదు. వేల రూపాయలు పుచ్చుకునేవాళ్ల జీతాలు ఎందుకు తగ్గించకూడదు? ఈ పరిస్థితులు ఇట్లాగే కొన సాగితే లేనిపోని ఆహారకొరతలు ఏర్పడి సగం జనం చస్తారు; నిజంగా ధనవంతులే మిగులుతున్నారు. అప్పుడు నిజంగా అందరూ సమానంగా ఉంటారు; సోషలిజం

Sri Shaik Mowla Sahib] [7th March 1956

ఏర్పడుతుంది. నేననునది ఏమిటంటే అవిధమైన సోషలిజం ఏర్పడుతుందే తప్ప సమాజంలో ఇప్పుడున్న తేడాలు పోయి సమానత్వం ఏర్పడదని. ధనవంతులే ఉంటారు. అదే సోషలిజం అవుతుంది. రెవెన్యూలో లోటు అంటున్నారు—ఎందుకు వస్తుంది ? Settlement అనేది న్యాయరీత్యా భూసారాన్ని అనుసరించి జరిపితే నాలుగు కోట్లు వస్తుంది. R.D.O. లు, Board of Revenue లు ఎందుకు? ఇవి తగ్గిస్తే చాలా డబ్బు మిగులుతుంది. స్నేహితులనో, చుట్టాలనో ఊరుకోవడంవల్ల గనులవిషయంలో కోటి రూపాయల వరకు నష్టం వస్తుంది. ఇల్లు కట్టుకుంటే ground value మీద పన్ను వేసినట్లే గనుల విషయంలో metal ను దృష్టిలో పెట్టుకొని ton కు ఇంత, పౌనుకు ఇంత అని వసూలుచేస్తే కోటి రూపాయలు ఆదాయం వస్తుంది. ఆ విధంగా ఎందుకు చేయకూడదు ?

Sri P. SATYANARAYANA :—అధ్యక్షా, చారిత్రాత్మికంగా ప్రధానమైన ఘట్టంలో మనము ఈ బడ్జట్టును చర్చిస్తున్నాము. ఇటీవలనే మన దేశంలో 36 కోట్ల మంది ప్రజలు విముక్తి పొందటంతోపాటు, మరొక 60 కోట్ల మంది ప్రజలు చైనాలో విముక్తి పొందడంతోపాటు దాదాపు అర్ధ ప్రపంచపు ప్రజలు బానిస స్వభావము నుండి విముక్తిపొంది, అభివృద్ధిపొందే దశకు వచ్చాము. కేవలము విముక్తి పొందడమే కాకుండా ఈ 100 కోట్ల మంది ప్రజలను కూడా అభివృద్ధి చేసుకోవడానికి బ్రహ్మాండమైన ప్రణాళికలు వేసుకుంటూ ముందుకు పోతున్నాము. దీనిని మిగతా ప్రపంచము అంతాకూడా చాలా శ్రద్ధగా గమనిస్తున్నది. కొంతమంది సంతోషముతో, సత్‌బుద్ధితో చూస్తున్నారు. మరికొంతమంది ఈ భారత, చైనాలు రెండూ కలిపి వారికి బజార్లలో ఉండేబదులు, స్వాతంత్ర్యము సంపాదించుకున్నారు అనే కుచ్చితబుద్ధితో చూస్తున్నారు మొత్తముమీద ఈ రెండు దేశములు బ్రహ్మాండమైన పథకములతో ముందుకు పోవడము అనేది ప్రపంచములో ఒక ప్రధానమైన ఘట్టము. ఈ సందర్భములో మనము పంచవర్ష ప్రణాళికలు తయారుచేసి దారిద్రంమీద, వ్యాధిమీద, నిరక్షరాస్యత మీద యుద్ధాన్ని ప్రకటించి, దానిని 5 బడ్జట్లులుగా భాగించి, ఇప్పుడు ఆ 5 ఇంటిలో మొదటి బడ్జట్టు మీద చర్చించుకుంటున్నాము. ఈ చారిత్రిక ప్రాముఖ్యమును దాని విలువను దృష్టిలో పెట్టుకుంటే ఈ బడ్జట్లు ఎంతమాత్రము కూడా. దాని స్వరూపము, దాని చట్టము పనికిరానట్లుగా కనిపిస్తున్నది. అభివృద్ధికొరకు ఇంతవరకు ఉన్నటువంటి దృక్పథాన్ని విడచి, క్రొత్త దృక్పథాన్ని అవలంబించమని ఒక ప్రతిపదికను ప్లానింగు కమిషన్ మనకు ఇచ్చింది. physical approach. financial approach కాదు. "నీ దగ్గర ఎంత డబ్బు ఉన్నది. నువ్వు ఎంత ఖర్చు పెడుతున్నావు." అనే దృక్పథమును ఖచ్చితంగా

విడనాడమని చెప్పారు మన బడ్జెట్టులో అది విడిచిపెట్టలేదు. వారు ఇచ్చిన సూచనలు ఏమిటంటే:—భౌతిక సావకాశములు ఏమి ఉన్నాయి? మనుష్యులు ఎందరు? వారి యోగ్యతలు ఏమిటి? వారికి ఉన్న నైపుణ్యము ఏమిటి? ఈ నాడు నీ చేతులలో ఉన్న పరికరాలు ఏమిటి? వాటి స్థాయి ఏమిటి? గర్భితంగా ఉన్న సావకాశములు ఏమిటి? భూముల్లో గాని, గనుల్లో గాని, మనుష్యులలో గాని ఉన్న సావకాశములు ఏమిటి? వాటినన్నింటిని సమన్వయ పరచుకుంటూ అభివృద్ధి ప్రణాళికలు తయారుచేయాలిగాని, జమ, ఖర్చు, చిట్టా మొదలైనవాటి దృక్పథంలో సంకుచితంగా దీనిని చేయవద్దు అని ఒక ప్రాతిపదిక ఇచ్చారు. దానిని మనము ఇందులో విడనాడాము. ఆ దృక్పథానికి న్యాయము కలుగచేయవలసి వస్తుంది. ప్రధాన మంత్రిగారు ఇచ్చిన ఉపన్యాసము రెండవ పంచవర్ష ప్రణాళికలో 5 బడ్జెట్టులలో మనము ఏ లక్ష్యాన్ని సాధించవలెనో అందులో మొదటి దశలో ఈ మెట్టునుండి ఈ మెట్టు వరకు పోగలము అనే ధోరణిలో ఎంతమాత్రము లేదు. మనముందు ఉన్న కర్తవ్యములలో మొదట భారతదేశ ఆర్థికవిధానము పరాధీనత నుండి తొలగించాలి అన్నారు. రెండవది నిరుద్యోగమును నివారించాలి అన్నారు. మూడవది సోషలిస్టు విధానములో, సమాజము, వర్గాల మధ్య సామరస్యము తీసుకరావాలన్నారు. ఈ చట్టంలో బడ్జెట్టును తయారుచేసి మన ముందు ఉంచలేదు. ఆంధ్రదేశములో నేటికి పరాధీనత ఎంత వరకు ఉన్నది? ఏ రూపంలో ఉన్నది? రాష్ట్రప్రభుత్వమునకు ఏ భాగము సాధ్యము అవుతుంది? దానిని ఎదుర్కోవడానికి ఒక చిన్న ఉదాహరణ మనవిచేస్తాను. ఈనాడు మనకు ఐ. ఎల్. డి. టి. కంపెనీ ఉన్నది. ఇది ఆర్థిక బానిసత్వానికి గుర్తు. ఎంతకాలంనుంచో దీనిని ప్రభుత్వము తీసుకోవాలని, ప్రభుత్వముయొక్క ఆర్థిక అవసరములను అభివృద్ధి చేసుకోవాలని, రైతాంగాన్ని అభివృద్ధి చేయవలసినది అని కోరుతున్నాము. కాని సాహసోపేతమైనటువంటి కార్యక్రమము విషయంలో వీరు చాలా వెనుకంజ వేసినారు.

నిరుద్యోగసమస్య మరొకటి ఉన్నది. అసలు ఆంధ్రదేశములో నిరుద్యోగము యొక్క రూపము ఏవిధముగా ఉన్నది? పూర్తి నిరుద్యోగులు ఎందరు? అర్థ నిరుద్యోగులు ఎందరు? వ్యవసాయములో ఎందరు? పరిశ్రమలలో ఎందరు? వారిలో చదువుకున్నవారు ఎందరు? చదువురానివారు ఎందరు? శాంపిల్ సర్వే చేయనివి, rough estimates వేసుకోవడానికి తగినటువంటి సావకాశములకు పూర్తి data అంతా మన దగ్గర ఉన్నది. సాధ్యమైన అంకెలన్నీ కూడా కేంద్ర ప్రభుత్వము ఖర్చుతో శాంపిల్ సర్వే చేయించి మన ముందుంచారు.

Sri P. Satyanarayana] [7th March 1956

దానిని లెక్కలోకి తీసుకున్నారా ? దానినిబట్టి ఒకచిత్రాన్ని చిత్రించి మాముందు వుంచారా ? ఎంతమాత్రంలేదు. అసలు ఈ చారిత్రకదశలో మనం సాధించవలసిన విషయాలను దృష్టిలోకి తీసుకొన్నారా ? సోషలిజంకూడా నిర్మించాలన్నారు. మొన్న అమృత్ సర్ కాంగ్రెసులో శ్రీ నెహ్రూగారు మాట్లాడుతూ విధానాలు వేరైనప్పటికీ వేగంలోమాత్రం ఎంతమాత్రం వెనుకబడము, రష్యా, చైనాలవలెనే మేముకూడా వేగంగా ముందుకు సాగిపోగలమని చెప్పేరు. చాలా మంచిది. దానిని రాష్ట్రప్రభుత్వాలు మాత్రం గమనించినట్లు ఎక్కడా కనుపించదు. ఉదాహరణకు 1950 సం॥రములో మొదటి పంచవర్ష ప్రణాళిక రచించినపుడు నాగలి దున్నడానికి వీలైన 10, 12 ఎకరాలభూమిని కుటుంబపరిమితిగా చేయాలన్నారు. దానికి మూడింతలు ఒక ceiling పెట్టామన్నారు. వ్యవసాయకూలీల విషయంలో వారిది పెద్ద జనాభా. కనుక కేవలం sub-human standard లో బ్రతుకుతున్నారు. కనుక వారి అభివృద్ధికోసం 4 directives యిచ్చారు. 1950లో యిది నిర్ణయించారు. (1) కనీసవేతనాలు నిర్ణయించుట. (2) భూమిలో పునరావాసాన్ని యేర్పరచుట. (3) గృహావసతులు కల్పించుట. (4) వ్యవసాయకార్మిక రంగంలో Co-operative societies నిర్మించుట. ఈ 4 directives 1950 సం॥లో యిచ్చారు. ఆంధ్రదేశంలో ఆనాటినుంచి యీనాటివరకు ప్రభుత్వం కాంగ్రెసు చేతిలోనేవున్నది. ఇందులో ఎంతవరకు అభివృద్ధిచెందారు ? మొదటి 5 సం॥రాలలో మేము యింతవరకు అభివృద్ధిలోకి తీసుకువచ్చాము, ఇప్పుడు యీ దశలోవున్నది, ఇప్పుడు యీ సమస్యలున్నాయి, వచ్చేసంవత్సరానికి యీ స్థితిలో వుంటాము అనే ధోరణి ఎక్కడాలేదు. అందుచేతనే ప్రతిపక్షంలో ఉన్నటువంటి మేము ఈ బడ్జటును తిరస్కరించడంలో ఆశ్చర్యమేమీలేదు కాని విశేషమేమిటంటే కాంగ్రెస్ పక్షంనుండి మాట్లాడుతున్న ప్రతి ఒక్కరూకూడా దీనియందు ఏదో విధమైన అసంతృప్తిని తెలియపరుస్తూనేవున్నారు. కొంతమంది సూటిగా "ఈ బడ్జటు సమర్థనీయంగాలేదు. అందువల్ల మేము బలపర్చలేక పోతున్నాము" అని చెప్తున్నారు. కాశీశ్వరావుగార్లాంటివారు "ఈ బడ్జటు మంచిదే. మేము తప్పకుండా బలపరుస్తాము. కాని దీంట్లో imagination లేదు. ఆకర్షణలేదు." ఇంత నిర్గుణమైన బడ్జటును తయారుచేసినందుకు వారిని అభినందిస్తున్నాము అన్నారు. ఈ విధంగా కాంగ్రెసువారంతాకూడా దీనిని వ్యతిరేకిస్తున్నారు. ఇది చాలా మంచికేవచ్చింది. కొందరు బడ్జటు బాగానేవుందని చెప్తూ దానిలోని విధానాలను మాత్రమే వ్యతిరేకిస్తూ మాట్లాడారు. నేను వారిమాటలు సంగతిమాత్రమే చెప్తున్నాను, ఓటుసంగతి చెప్పడంలేదు. మాటలో వ్యతిరేకత, ఓటులో అనుకూలత వుండనేవుంటుంది. ఇప్పుడు మాట్లాడినవారిలో కొంతమంది ప్రధాన

మంత్రిగారిని చాలా నూటియైన ప్రశ్న వేశారు, జిల్లా farmers forum ప్రధాన మంత్రిగారు మాట్లాడుతూ ప్లానింగ్ కమిషన్ నిర్ణయించిన సీలింగులు నాకు పనికిరావు. అవి వ్యక్తిగతంగా నాకు సమ్మతంకాదు అన్నారు. అవి 2 వందలు వుండాలని, 3 వందలు ఉండాలని చెప్పారు.

THE HON. DR. B. GOPALA REDDI:—నిన్న వావిలాల గోపాల కృష్ణయ్య చేసినటువంటి పొరపాటే ఇప్పుడు మీరు చేస్తున్నారు. 2 వందలు 3 వందలు అని నేను అన్నానని మీరు అనవద్దు. ఆ మాట నేను అనలేదు. నిన్న గోపాలకృష్ణయ్యగారుకూడా యిదే పొరపాటుచేశారు. ఇందులో సిగ్గుపడవలసినపని లేదు. వాళ్లు సిగ్గుపడ్డంలేదు. మీరు సిగ్గుపడవలసిన అవసరంలేదని చెప్పాను.

SRI P. SATYANARAYANA :—నేను విన్నంతవరకు దీనిని గురించి కాంగ్రెసువారు ఒక నూటియైన ప్రశ్న వేశారు. ప్రగడ కోటయ్యగారు ఒకరు వేశారు. "ఏమండీ మీరు యీ విధంగా మార్చేస్తే మొత్తంమీద Planning Commission ధోరణి ఒక లాగవుంది, మీ ధోరణి యింకోలావుంది. గందరగోళంగా ఉందని" కాంగ్రెసు మిత్రులుకూడా మాట్లాడారు. ఇప్పుడు గమనించవలసిన విషయం ఏమిటంటే వారు యిట్లా మాట్లాడుతున్నప్పుడు వారి వెనకాల వున్న చాలామంది ప్రజానీకంయొక్క ఆందోళనలన్నీకూడా అందులో ప్రతిబింబిస్తున్నాయి. మాట్లాడినది ఒక వ్యక్తికాదు. ఆ వ్యక్తి వెనకాల లక్షలాది జనం వున్నారు. ఇది మనం గమనించవలసియున్నది. మేము ఓటులో, మాటలో కూడా ప్రతిఘటిస్తున్నాము. వారు ఓటు గురించి ఎట్లావున్నప్పటికీ మాటలో ప్రతిఘటిస్తున్నారు. మొత్తంమీద ఈ విషయంలో వారివెనకాల వున్నటువంటి 30 లక్షలమంది ఓటర్లకు మా వెనకాల వున్నటువంటి 25 లక్షలమంది ఓటర్లకు యిందులో ఏకాభిప్రాయంవుంది. భూసంస్కరణాల విషయంలో ప్లానింగ్ కమిషన్ నిర్ణయించిన వ్యవహారములో మన అందరి వెనకాలవున్న ప్రజానీకం తమ తమ పార్టీలయందు భక్తి విశ్వాసాలు వుంచుకుంటూనే ఈ సమస్యలపట్ల ఏకాభిప్రాయం, ఏకత్వం కనపరుస్తున్నారు. దాన్ని పురస్కరించుకొని మనం ముందుకు పోవాలని వుంటుంది.

SRI S. VEMAYYA :—వారు 30 లక్షలు, 25 లక్షలు జభాభామాట మాత్రమే చెప్పారు. మరి మిగతా జనాభా ఏమైపోయిందండీ.

MR. SPEAKER :—మనకు ఆ విషయంతో యిప్పుడేమీ పనిలేదు.

* SRI A. LAKSHMU NAIDU :—అధ్యక్షా! మహాశయా! శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం తాలూకా ఏజెన్సీ కొండజాతులకు unreserve, reserve లో కూడా పోళ్లు మానిపించివేసినారు. అందుచేత అక్కడి ప్రజలు చాలా కష్టాలకు లోనగుచున్నారు. నూటికి 90 మంది పోళ్లవలననే జీవించుచున్నారు. కాని unreserve లో కూడా ప్రభుత్వం పోళ్లు వ్యవసాయంచేయుట మానిపించివేసినారు. వారికి జీవనోపాధి కల్పించేవరకు unreserve లో పోళ్లుచేయుటకు వారికి orders ఇవ్వాలి, ఈ కొండజాతులను పీడిస్తున్న మలేరియా జబ్బును రాకుండా చేయుటకు ప్రభుత్వం సహాయంచేయాలి. ఈ ఏజెన్సీ ప్రాంతంలో రహదార్లు కల్పించి, ఈ కొండజాతులకు కూలికూడా యేర్పాటు చేయించవలెనని కోరుచున్నాను. ఈ కొండ జాతులకు, హరిజనులకు society లు పెట్టి అప్పులు యిప్పించి societyలకు చెల్లించ వలసినషేరు ధనంలో ప్రభుత్వంవారు సహాయం చేయవలసినదిగా కోరుచున్నాను. ఈ ఏజెన్సీ ప్రాంతంలో చిన్న చిన్న గెడ్డలకు డాములు కట్టించి అచ్చటి బంజరు భూములు సాగులోనికి తీసుకువచ్చే యేర్పాటు చేయించాలని ప్రభుత్వంవారిని కోరు తున్నాను. పార్వతీపురం తాలూకాలో (1) గుమ్మడిగెడ్డ (2) మండగెడ్డ, (3) బీమలగూడగెడ్డ, (4) మంగళపురం దరితాడిగెడ్డ. ఈ గెడ్డలుకు రిజర్వాయరు కట్టించుటకు ప్రభుత్వంవారు sanction చేసియుండికూడా యింతవరకు పనులు ప్రారంభింపబడలేదు. అటువంటి పనులను ప్రభుత్వంవారు త్వరగా చేయించవలసిన దని కోరుచున్నాను. ఈ ఏజెన్సీ ప్రాంతాలలో 20, 30 ఎకరాల భూమిగల రైతులు వున్నారు. ఆ రైతులు వారి భూములను మరమ్మతులు చేసుకోడానికి రూ 500/-లు loans యివ్వవలసినదని కోరుచున్నాను. రైతులు తహశీల్దారువారికి దరఖాస్తులు పెట్టుకున్నారు.

ఇంతవరకు సదరు రైతులకు డబ్బు ముట్టుటలేదు. రైతులకు త్వరగా డబ్బు అందే ఏర్పాటు చేయించమని కోరుతున్నాను. పార్వతీపురం గుమ్మలక్ష్మీపురం ఫిర్కాకు చెందిన పియారుటి గ్రామములోని aided school లో 90 మంది కొండ జాతి పిల్లలు చదువుచున్నారు. వారు తినటానికి తిండి, కట్టుటకు బట్టలులేని పిల్లలు. వారికి మూడుపూటల భోజనవసతి కల్పిస్తూ సదరు school ను higher elementary school గా మార్చవలెనని ప్రార్థిస్తున్నాను. గుమ్మలక్ష్మీపురంలో ఉన్న middle school ను training school గా మార్చమని కోరుతున్నాను. పాలకొండ ఏజెన్సీ స్కూల్సులో బోర్డింగ్ హోమ్ యివ్వమని కోరుచున్నాను. కురపాము ఎల్విన్ పేటకు electricity ఇవ్వమనికోరుతున్నాను. గుమ్మలక్ష్మీపురంలో telegraph office యివ్వమని కోరుతున్నాను. ఎల్విన్ పేట గ్రామములో 10

12 మంచాలతో ఆసుపత్రి యివ్వమని కోరుతున్నాను. కురపాంలోఉన్న ఆస్పత్రి గోడలన్నీ పడిపోవుచున్నందున దానిని మరమ్మత్తు చేయించమని కోరుతున్నాను. గుమ్మ లక్ష్మీపురం ఫిర్కాకు చెందిన ఏజెన్సీ గ్రామాదులకు అందిడిగాఉన్న ఇండి గ్రామమునకు ఒక post office ఇవ్వమని కోరుతున్నాను. గుమ్మ లక్ష్మీపురం ఫిర్కాకు చెందిన ఏజెన్సీ గ్రామాదులలో (1) బప్పంగి (2) వత్తాడ (3) తోలు కరజ గ్రామాలలో మంచినీటిబావులు త్రవ్వించమని కోరుతున్నాను. కురపాము, పార్వతీపురము వగైరా గ్రామాలలోఉన్న చెరువులకు గండ్లుపడి పాడైపోవుచున్నందున వాటిని మరమత్తు చేయించమని కోరుతున్నాను. గుమ్మ లక్ష్మీపురంఫిర్కాకు చెందిన ఏజెన్సీ గ్రామాలలో (1) వత్తాడ (2) తోలుగజ్జ (3) ఏగులవాడలోను లక్ష్మీపురం పిర్కాలో దడ్డుగల్లుగడ్డ, ఈ నాలుగు గడ్డలకు డాములు కట్టించి సాగుకువచ్చే ఏర్పాటు చేయించమని కోరుతున్నాను. ఏజెన్సి గ్రామాలలో ఉన్నటువంటి aided schools పిల్లలకు ఒకపూట ఉచితభోజనసౌకర్యము కల్పించమని కోరుతున్నాను.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా, రెండవ తేదీన పూజ్యులు గోపాలరెడ్డిగారు ప్రతిపాదించినటువంటి బడ్జటును నేను బలపరుస్తున్నాను. అంతేగాక గతసంవత్సరం జూలై నెలలో బడ్జటు మీటింగులో హామీయిచ్చిన ప్రకారము తెలుగులో స్పష్టమైన అంకెలతో ఉపన్యసించినందులకు వారికి నా మనఃపూర్వక వందనము లర్పిస్తున్నాను. ఏడుతరాలనుంచి పెద్దలు, పూజ్యులుఅయిన ప్రకాశం గారు, కాశేశ్వరరావుగారు, Deputy Speaker గారైన కల్లూరి సుబ్బారావుగారు మొదలైనటువంటి పెద్దలు ఆంధ్ర ప్రభుత్వ నాయకులైన గోపాలరెడ్డి, సంజీవరెడ్డి అధ్యక్షులవారి కృషివల్లనే విశాలాంధ్ర మనకు లభించింది. ఆంధ్రదేశంలో ఉత్తరదిశలో ఉన్నటువంటి పర్లాకిమిడి, ఛత్రపురం, బరంపురం, గునుపురము, రాయగడంలలో 100 కి 76 మంది తెలుగుప్రజలు ఉన్నారు. ఆ ప్రజలనుకూడా ఆంధ్రదేశంలో కలుపుటకు విశాలమైన హృదయంతో గోపాలరెడ్డిగారు కృషిచేసి మన రాష్ట్రంలోకి ఆ ప్రాంతాలను తెప్పిస్తారనే ఆశిస్తూ ఇంకొకదఫా వారిని అభినందిస్తున్నాను. ప్రస్తుతం ఉన్నటువంటి బడ్జెటును గురించి ఇప్పటివరకు అనేక మంది సభ్యులు మాట్లాడారు. కాని ముఖ్యమైనటువంటి విషయాలు బడ్జెటులో లేవు కాబట్టి ఇటుపైనఅయినా ప్రభుత్వము చేయడానికి ఆలోచిస్తారని నమ్ముతున్నాను. అదేమిటంటే ప్రభుత్వానికి మూలకరమైనటువంటి రైతాంగం ఒక గంట నాగలి పట్టుకొని దున్నకపోయినట్లయితే బీదవారి దగ్గరనుంచి ministers వరకుకూడా పస్తుపడుకోవలసి ఉంటుంది. అలాంటి రైతాంగానికి తగినటువంటి

Sri P. Gunnayya] [7th March 1956

సదుపాయములు లేనందుకు విచారిస్తున్నాను. Budget తెలుగులో యివ్వనందున ఆ అంకెలు తెలుసుకున్నాను. ఈ మధ్య నలుగురు B. A. candidates Collector దగ్గరికి interview కు రాగా వాళ్లద్వారా English లో అన్ని అంకెలు తెలుసుకున్నాను.

ప్రధానంగా రైతాంగానికి కావలసిన నీటిపారుదల వైద్య సౌకర్యాలు ఈ budget లో లేవని గట్టిగా చెప్తున్నాను. electricity 600 వందల గ్రామాలకు యిచ్చామని budget లో చెప్పారు. కడుపుకు తిండిలేక మృష్టివాళ్లవలె లక్షలాది ప్రజలు చచ్చిపోతుంటే దీపాలుపెట్టుకొని ఏమిచేస్తారు? రైతాంగానికి ముఖ్యంగా కావలసినటువంటివి చెరువులు మరమ్మతు చేయించడం, వాగులు బాగుచేయించడం మొదలగునవి Krishna regulator కు 2 కోట్ల 70 లక్షలు, తుంగభద్ర ప్రాజెక్టుకు 120 కోట్లు యిచ్చినట్లు తెలుస్తున్నది. ఇంకా సిమెంటురోడ్లకు 10 లక్షలు యిచ్చినట్లుకూడా ఉన్నది. కోట్లకొలది ఖర్చు పెట్టమనే మా ఉద్దేశ్యము కాని వెనుకబడినటువంటి ప్రాంతాలకు ప్రాతినిధ్యం యివ్వలేదనే మా విచారము. కోట్లకొలది ఖర్చుపెట్టినది క్రమంగా జరగవలసినవి. ప్రస్తుతం జరగబోయేటటువంటి పని విశాఖపట్టణం శ్రీకాకుళం జిల్లాలలోనే. ఇప్పటికీ నేను మద్రాసులో రెండు, కర్నూలులో రెండు ఇదిఒకటి మొత్తం 5 శాసనసభలలో ఉన్నాను. మా జిల్లావిషయంలో ఇంతవరకు ఒక చెరువుకూడా మరమ్మతు కాలేదు. కృష్ణా రెగ్యులేటర్ కు ఇచ్చేటటువంటి 2 కోట్ల 20 లక్షలలో 2 కోట్లుయిస్తే మా జిల్లాలో ఉన్న చెరువులన్నీ బాగుపడతాయి. అదేప్రకారము సిమెంటురోడ్లకు లక్షలు, కోట్లు ఖర్చు అవుతోంది. రోడ్లులేక త్రోవలులేక గ్రామాలలో అనేకమయిన ఇబ్బందులు పడుతుంటే సిమెంటురోడ్లు ఎందుకు? మామూలురోడ్లు చాలవా? ఇలాంటప్పుడు 20 లక్షలు ఖర్చుపెడితే మా జిల్లాలో రోడ్లన్నీ బాగుపడతాయి. మా జిల్లాకు సంబంధించినంతవరకు పాతపట్నం తాలూకాలో 2 వేల చెరువులు ఉన్నాయి. 20 సంవత్సరాలనుంచి వీటికి ఎటువంటి మరమ్మతులు లేవు. పర్లాకిమిడి మహారాజుగారున్నప్పుడే బాగాచేశారు. ఇప్పుడేమి ఒక్కపనికూడా కాలేదు. ఇదివరకు రాజాగారువేసిన మట్టిరోడ్లు వున్నాయి. అవికూడా బాగాలేవు. సంవత్సరమునుంచి ఆందోళన చేస్తున్నాము. ఒక్కపనికూడా కాలేదు. ఈ మధ్యన పన్నులువేసి లక్షలు వసూలుచేశారు. ఇంకా ఏ పన్నులు వేసినా మేమంతా support చేస్తాము. కాని ప్రజలకు ఎలాంటి సౌకర్యము కలుగచేయడములేదు. అందుచేత ఈమారు మేము elections కు నిలబడితే ఓట్లు ఎవరికీ రావనే గంటాపథంగా చెప్తున్నాను. అందుకు మన ప్రభుత్వము మైనరు ఇరి

సేవన్ పనులు చేయించి రైతుల, కూలీల యిబ్బందులు తొలగిస్తారని ఆశిస్తున్నాను.

SRI G. RAMASWAMI REDDI :— అధ్యక్షా, ముఖ్యమంత్రి గారు ప్రవేశపెట్టినటువంటి యీ బడ్జెటును బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్పదలచుకొన్నాను. ఈ బడ్జెటులో ముఖ్యంగా నీటిపారుదలకు, electricity కొరకు ఎక్కువగా డబ్బు కేటాయించడమనేది అభినందించవలసిన విషయమే. కాని ముఖ్యంగా lift irrigation కు ప్రాధాన్యత యివ్వనందుకు చింతించుచున్నాను. మా ప్రాంతము, నందికొండ ప్రాజెక్టువల్లగాని, పులిచింతల ప్రాజెక్టుల్లకాని లాభించనటువంటి ప్రాంతమని తెలుస్తున్నది. అటువంటప్పుడు కృష్ణానదీ తీరమున దాదాపు 50 మైళ్ల పొడవునా, నా నియోజకవర్గమునకు సంబంధించిన గ్రామాలలో ఎన్నో lift irrigation shemes కు అవకాశమున్నప్పటికి వాటినిగురించి అయినా ఇదివరకు ప్రభుత్వము ఎలాటిచర్య తీసుకొన్నట్లు కనిపించదు. సారవంతమైన భూములుఉండి, వాటిని సాగుచేసుకోడానికి అవకాశాలు ఉండికూడ, ఆ ప్రాంతపు రైతులపరిస్థితి బాగుగాలేనందున వారేమిచేయలేకుండా ఉన్నారు. కనుక ప్రభుత్వము వెంటనే అటువంటి ప్రాంతాలలో లో ఈ lift irrigation కు ప్రాధాన్యతనిస్తూ వారియొక్క పరిస్థితిని బాగుపరచేందుకు ప్రయత్నించవలసిందని కోరుతున్నాను.

తరువాత విద్యావిషయములో, పాఠశాలలో, 1, 2, 3 వ ఫారములలో పిల్లలు direct గా చేరడానికి అవకాశము లేకుండా ఈ బడ్జెటులో యేర్పాటు చేసినారు. ఇది చాలా అన్యాయమైన విషయము. ఎందుకంటే అనేకమంది తల్లిదండ్రులు తమ బిడ్డలను 2 వ form లోనో, 3 వ form లోనో direct గా చేర్పిస్తామని ఎంతో Tuition పెట్టించి ఎంతోడబ్బు ఖర్చుపెట్టి ఉంటారు. ఇది కూడ ప్రభుత్వము ఆలోచించవలసిన అవసరమున్నది. ఎంతోమంది తల్లిదండ్రులు ఈ విధంగా చేస్తున్నప్పుడు, వారికి notice కూడ లేకుండా, sudden గా ఈ సంవత్సరమే ఈ rule తీసుకురావడమనేది చానా అన్యాయంగా ఉంటుంది. విద్యార్థులలో అనేకమంది తెలివిగలవాళ్లు ఉంటారు. వాళ్ళంతా చురుకుగా చదువుకొని తక్కువ వయస్సులోనే ఎక్కువ అభివృద్ధి కావడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. ఆ రీతిగా విద్యార్థులు అభివృద్ధి కావడానికి వీలులేకుండా, వారి విద్యను ఈ విధంగా restrict చేయడమనేది చాలా అన్యాయము. కాబట్టి ప్రభుత్వము దీన్నిగురించి ఆలోచించి ఈ సంవత్సరానికి ఈ restriction లేకుండా తల్లిదండ్రులకు, ఒక సంవత్సరం నోటీసుఇచ్చి తరువాతచేస్తే బాగుంటుందేమో అనుకొంటాను.

Sri G. Ramaswami Reddi] [7th March 1956

తరువాత హరిజనులకు ఇళ్లస్థలముల గురించి, నాకు తెలిసినంతవరకు అనేక applications వచ్చిఉన్నప్పటికి, వాటినిగురించి ప్రభుత్వము ఏమీ చర్య తీసుకోలేదని తెలుస్తున్నది. కాబట్టి ఈ విషయములో జాప్యములేకుండా ప్రభుత్వము తగు శ్రద్ధ వహించి వారికి సహాయము చేయవలసిందిగా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

* SRI D. RAMABRAHMAM :—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టినటువంటి ఈ బడ్జెటును నేను ఆమోదిస్తూ, మన బడ్జెటులో ఇదివరకు వచ్చినటువంటి లోటును, 2.16 కోట్లవరకు, పన్నులద్వారా పూడ్చి, మన ఆర్థికస్తోమతను హెచ్చించినందుకు, వారిని మనమందరము అభినందించవలసియున్నదని తెలియజేస్తున్నాను. Land Revenue Surcharge అనేది అంచలవారీగా వేసినందుకు, అది మనము చేయదలచుకొన్న Socialistic pattern of society కి ప్రాతిపదికగా భావించవలసియుంటుందని అనుకొంటున్నాను. ఇదివరకు గ్రామప్రాంత ప్రదేశాలలో కొంత అభివృద్ధిజరుగుతూ ఉండినప్పటికీ, ఇప్పుడు మనకు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడి, త్వరలోనే విశాలాంధ్రకు పోతున్నాము గనుక, ఇంతపెద్ద దేశానికి ఇప్పటిరీతిలోనే మనము పరిపాలన సాగించుకుంటే ఈ గ్రామ ప్రాంతాలకు సరియైనటువంటి పనులు సక్రమముగా జరుగవు. కాబట్టి, మన పరిపాలనలో కొంత మార్పు తీసుకురావలసిన అవసరమున్నది. అందుకుగాను ఇకమీదనైన రెవిన్యూబోర్డు రద్దుపరచి, జిల్లావారీగా, జిల్లాకొక ఉపమంత్రిని ఏర్పాటుచేసి ఆ జిల్లాకేంద్రములోనే వారి ఆఫీసులను ఏర్పాటుచేసి, ఆ జిల్లాలో ఉన్నటువంటి M. L. A లు అందరుకూడా District Council గా ఏర్పడి, అన్నిశాఖలపైన ఆ మంత్రిగారికి సలహాలిచ్చి ఆ విధంగా పరిపాలన సక్రమంగా జరిగేటట్లు చేయవలసిందని సూచిస్తున్నాను. ఈ సూచనను ముఖ్యంగా ముఖ్యమంత్రిగారు గమనించవలసిందిగా వారిని ప్రార్థిస్తున్నాను. తరువాత ఇప్పుడు మనకు ఆర్థికస్తోమత చాలా తక్కువగాఉన్నది. కాబట్టి ఇప్పుడు మన దేశములో ఉన్నటువంటి బస్సులను జాతీయము చేసేబదులు, State Bus Corporation అనేది ఒకటి ఏర్పాటుచేసి దానిద్వారా బస్సు యజమానులకు వారికి ఉన్నటువంటి బస్సులకంతటికి ఒక ప్రతిఫలము ముట్టజెప్పి, ఆ ప్రతిఫలము రొక్కరూపంగా కాకుండా, shares certificates ఇచ్చి, అనగా 51 percent ప్రభుత్వానికిన్నీ, 49 percent బస్సుయజమానులకున్నూ Corporation లో shares ఇచ్చి, ప్రభుత్వ అజమాయిషీక్రింద ఆ corporation నడిస్తే, దానివల్ల లక్షలాది డబ్బు ప్రభుత్వానికి రావచ్చునని సూచిస్తున్నాను. తరువాత, ఇప్పుడు మనకు విశాలాంధ్ర వచ్చినాకూడ, మన ఆంధ్ర ప్రజానీకము మాత్రము సంతృప్తిపడడంలేదు. మద్రాసులోను, ఒరిస్సాలోను మనకు రావలసినటు

వంటి కొన్ని ప్రాంతాలు నిలిచిపోయిఉన్నవి. బళ్ళారిజిల్లాను, హోసూరుతాలూకాను మనము ఇప్పుడు కూడగట్టుకోకపోతే, మనకు విశాలాంధ్ర వచ్చినా కూడ నిష్ప్రయోజనమవుతుందేమోనని, రాయలసీమకు ఇదివరకున్న తుంగభద్ర జలాల అనుకూలత లేకపోతుందనే భీతిమాత్రము ప్రజానీకంలో ఉన్నది. కాబట్టి మన ఆంధ్రప్రభుత్వము బళ్ళారి విషయములోను, హోసూరు, కోలారు విషయములోను గట్టిగా పట్టుపట్టాలని కోరుతున్నాను. బళ్ళారి రాకపోయిన, కోలారుఅయినా మనకువచ్చి తీరాలి. అక్కడ ఉన్నటువంటి బంగారుగనులు మనకు రావలసిందే. ఇదివరకు మనకు బళ్ళారి వస్తుందేమోనని కోలారుపైన మనం నిస్పృహ చూపించాము. అక్కడ agitation లేదంటున్నారు. ఇప్పుడు బళ్ళారిలో ఎక్కువ agitation ఉన్నప్పటికీ, బళ్ళారి మనకురాదని, కేంద్రప్రభుత్వము దానికి ఒప్పుకోలేదని పత్రికలు సూచిస్తున్నాయి. కాబట్టి మనకు బళ్ళారి ఏలాగైతే, ఏ కారణముచేతనైతే ఏ దృష్టితోనైతే మనకురాలేదో, ఆ దృష్టితోనే కోలారునైనా మనము రాబట్టుకొని అక్కడి బంగారు గనులనైనా మనము రాబట్టుకునేందుకు ప్రయత్నించాలి. ఇప్పుడు planning విషయం తీసుకొందాము. పల్లె ప్రజానీకంయొక్క ప్రణాళికలు ఎక్కువగా ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో ఏర్పాటుచేశామని చెప్పారు. అయినా కూడ, అది ఆఖరు stage లో కార్యాచరణకు వచ్చేలోపుగా, ఇప్పుడు ఈ ప్రణాళికలంతాకూడ ఎక్కడో పెద్ద పెద్ద factories కు పెద్ద పెద్ద పట్టణాలకు పరిమితమై గ్రామముల విషయములో మాత్రము వెనుకంజవేసినట్లు ఇప్పుడు కనిపిస్తున్నాయి.

అందులోను, ఇదివరకు కేంద్రప్రభుత్వంవారు మనకు ఇస్తున్నటువంటి డబ్బులో చాలా తగ్గించి 116 కోట్లు మాత్రమే ఈ అయిదు సంవత్సరాలకు ఇచ్చేటట్లు వారుచెప్పారు. దానివల్ల మనము దెబ్బతింటామనుకొంటాను. కనుక ఈ ప్రణాళికలను తయారుచేసే విషయంలో, ముఖ్యంగా backward areas లోను, క్షామపీడిత ప్రాంతాలలోను, N. E. S. Blocks ఏర్పాటు చేయవలెనని కోరుతు ఉన్నాను. Minor irrigation కు మాత్రము మన బడ్జెటులో చాలా తక్కువ సొమ్ము కేటాయించారు. ముఖ్యంగా చిత్తూరుజిల్లాలో, ఏ ఒక్క పెద్ద ప్రాజెక్టు గాని నిర్మించడానికి వీలులేని పరిస్థితులు ఉన్నాయి. అక్కడ minor irrigation సౌకర్యాలుతప్ప మరేమి చేయడానికి వీలులేదు. కుప్పము area లో పాలారునది అని ఒకనది పారుతుంది. ఆ నదిలో ప్రవాహానికి ఒక అడ్డముకట్టి దాని కాలవలు ద్వారా చెరువులకు మళ్ళిస్తేతప్ప అక్కడి క్షామప్రాంతాలు బాగుపడవు. దానికి ఇదివరకు Palar Basin Rules అని కొన్ని నిషేధాలు ఉన్నప్పటికికూడ, మైసూరు ప్రభుత్వమువారు ఆ నిషేధాలన్నిటిని violate చేసి అక్కడ వారు అన

Sri D. Ramabrahmam] [7th March 1956

కట్టలు కట్టుకొంటున్నారు. కాబట్టి మన ప్రాంతములో ఆ పాలారునదికి ఆనకట్టలు నిర్మాణంచేసి ఆ నీటిని అంతా కూడ మన చెరువులకు మళ్ళించే ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వము పూనుకోవలసిందని కోరుచున్నాను. 1936 సంవత్సరం, Public works Minister, Yakub Hussain ఉండినప్పటినుంచి ఈ విషయంలో ప్రజాందోళన జరుగుతున్నప్పటికీ, అప్పుడు మనము మద్రాసు రాష్ట్రములో ఉండినాము కాబట్టి, అధికారులయొక్క ప్రాబల్యము ఎక్కువగా ఉండినందువల్ల, ఆ పని పూర్తికాలేదు. అయినా ఇప్పుడు ఆంధ్రరాష్ట్రము వచ్చింది గనుక ఇప్పుడు మన ఆంధ్రప్రభుత్వము దీనిని నెరవేరుస్తుందని అక్కడ ప్రజానీకమంతా ఆశిస్తున్నారు. కాబట్టి మనము విశాలాంధ్రకు పోయేలోపుగానే, దీనికి తగిన ప్రయత్నాలు చేయవలసిందిగా మన ముఖ్యమంత్రిగారిని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

* SRI S. NARAYANAPPA :—అధ్యక్షా, బాగుగా ఆకలిఅయి, యింటికి వెళ్ళే సమయములో నాకు మాట్లాడటానికి అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికి నా అభినందనలు తెలుపుచున్నాను. మన ముఖ్యమంత్రి గోపాల రెడ్డిగారు ప్రవేశపెట్టిన బడ్జటును నేను సమర్థిస్తూ కొన్ని విషయాలను సూచనలు మాత్రము ప్రభుత్వముయొక్క దృష్టికి తీసుకొని రాదలచి మాట్లాడుతున్నాను. కాని ఇటువంటి సూచనలు చేయడము యింతవరకు ఎన్నోసార్లు జరిగిపోయినవి. సూచనలు రికార్డుఅయినవి. పుస్తకములలో అచ్చుకూడ అయినవి. కాని అవి ఆచరణలో పెట్టటానికి మాత్రము ప్రభుత్వము ప్రయత్నించడములేదు. ఇది సభ్యులందరు గమనించదగ్గ విషయము. ప్రభుత్వము యీ విషయాన్ని ముఖ్యముగా దృష్టిలోనుంచుకొని, ఆచరణలో పెట్టిస్తారని ఆశిస్తున్నాను. ఇదిగాక పతిసభ్యుడు తన నియోజకవర్గానికి సంబంధించినవి. శాసనసభ సమావేశములలోచేసిన సూచనలు ప్రభుత్వము చర్చించి తరువాత సాధ్యమైనవాటిని బడ్జటులోనికి తీసుకొనివస్తే, సభ్యులయొక్క నియోజక వర్గములోని ప్రజలకు కొంతవరకైనా తృప్తికరముగా ఉంటుంది. అంతేగాని, మేము యిక్కడచేయు సూచనలు ప్రజలకు సంబంధించినవి. ఆ సూచనలు ప్రజా సమస్యలుగ పరిష్కారము చేయవలసియున్నది. అవి యీ బడ్జటుద్వారా అచరణ లోనికి వచ్చేటట్లు చూచుకోవలసిఉన్నది. కాబట్టి సభ్యులుచేసే సూచనలకనుగుణముగా బడ్జటును తయారుచేస్తే, ఎంతో ఉత్తమమైన విషయముగా ఉంటుంది. మన ఆర్థికమంత్రిగారు చాలా అనుభవజ్ఞులు వారికిఉన్న అనుభవముతోనే యీ బడ్జటును తయారుచేసి తెచ్చారు. నిరుత్సాహ ఉత్సాహ సమ్మేళనముతో అంతా జరిగిపోయింది. ఆర్థికంగా మన రాష్ట్రముయొక్క స్థితి కుంటుపడింది. అందువల్ల కొన్ని పనులద్వారా బడ్జటులోని లోటును కొంతవరకు సర్దుబాటు చేసుకోవాలని అంటున్నారు. ప్రజలుకూడ పన్నులు భరించటానికి సిద్ధముగానే ఉన్నారు. ఆర్థికంగా

బాగుపడిన రైతాంగముగాని, పారిశ్రామికంగా బాగుపడినవారు కాని, ధనవంతులు గాని, యీ అదనపుపన్నులు భరించగలరేకాని, భరించలేని పేదవాళ్ళమీదగూడ పన్నులువేసి రుద్దటము ఏమంత సమంజసమని చెప్పజాలను. ఈ బడ్జటులోని అంశములు పన్నులు భరించలేని ప్రజానీకముయొక్క క్షేమమును దృష్టిలో పెట్టుకుని, పల్లె ప్రాంతములలోనున్న ప్రజలకు అనువైన పద్దులపైన ఖర్చుచేయటానికి తయారుచేసిన బడ్జటుకాదని కొంతమంది సభ్యులు విమర్శిస్తున్నారు. అయినప్పటికినీ మనకు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రాబోతున్నది. రాష్ట్రపునర్వ్యవస్థీకరణ సమస్య పరిష్కారమయ్యే యీ సమయములో మనము విశాలాంధ్రకు వెళ్ళేలోపల మన ఆర్థిక మంత్రిగారు ఆరుకోట్ల రూపాయిలు అప్పుఅయినాచేసి. మన రాష్ట్రాన్ని అభివృద్ధి పరచటానికి ప్రయత్నిస్తున్నందుకు వారిని నేను అభినందిస్తున్నాను. అప్పు అయినా చేసి పప్పుఅన్నము భుజించాలి అనే సామెత చెప్పబడినట్లు, అప్పుచేసిఅయినా రాష్ట్రములోని అభివృద్ధి కార్యక్రమాలను నెరవేర్చటానికి ప్రయత్నిస్తున్నందుకు సంతోషమే. కాని క్షామప్రాంతాలయిన రాయలసీమలోఉన్న తుంగభద్ర ఎగువ కాలవ, గుంటూరుజిల్లాలోఉన్న పులిచింతల, కర్నూజిల్లాలోఉన్న సిద్దేశ్వరము మొదలైన ప్రాజెక్టుల విషయము బడ్జటు ఉపన్యాసములో యిప్పటికి అర్థశతాబ్దముగా ఆందోళన జరుగుచున్నను. సూచనప్రాయముగా పేర్కొనడమేగాని, వాటికొరకు ఒకదమ్మిడీఅయినా కేటాయించబడలేదు. ఇందుకు చాలా చింతించవలసివస్తున్నది. నాగార్జునసాగరు ప్రాజెక్టుకు డబ్బు కేటాయించారు. చాలా సంతోషమే. ఈ ప్రాజెక్టు ఆంధ్రదేశానికి చాలా ప్రధానమైనది. భారతదేశములోకల్ల చాలా పెద్ద ప్రాజెక్టు. ఇంతపెద్ద ప్రాజెక్టు నిర్మాణము కావడము సభ్యులను, ప్రభుత్వాన్ని అభినందించకతప్పదు. ఇంతపెద్ద ప్రాజెక్టును సాధించుకోగలిగాము కాని, క్షామప్రాంతమైన రాయలసీమకు ఎంతో ఉపయోగించే తుంగభద్ర ఎగువకాలవ విషయము, తరువాత బళ్ళారివిషయము వదిలాము. మైసూరు రాష్ట్రములో గుండా మన రాష్ట్రములోనికి ప్రవహించే తుంగభద్రనదీ జలాలను సక్రమంగా మనము వినియోగించుకోటానికి వీలు లేకుండా పోతున్నది. ఈ సమస్యలన్నీ పరిష్కారము చేసుకోవలసియున్నది. బళ్ళారి ప్రాంతమును ఎటులైనా సాధించి తీరాలని ప్రతిజ్ఞ చేసిన మన ఆంధ్ర సభ్యులు ముఖ్యముగా కడసారిగా ప్రధాన మంత్రిగారికి నచ్చచెప్పటానికి రాయభారము కూడ వెళ్లారు. అదే విధముగా తుంగభద్ర ఎగువకాలవ విషయముకూడ మనము సాధించుకోవలసి ఉన్నది. కాబట్టి యీ విషయములలో పట్టుదల వదలకుండా మన ముఖ్యమంత్రిగారు మనందరి కృషి తోడ్పాటుతో యీ సంగతి దృష్టిలో పెట్టుకొని గట్టిగ ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

Sri S. Narayanappa] [7th March 1956

ఇక పోతే చేనేత పారిశ్రామికుల విషయముచూస్తే, వారికిగాను ఒక Financial Corporation ను స్థాపించమని ప్రభుత్వాన్ని యిప్పటికి రెండు సంవత్సరాలుగా ఆందోళనజేస్తూ, కోరుతువస్తున్నాము. ప్రభుత్వము డబ్బు లేదనే ఉద్దేశ్యముతో మిన్నకున్నట్లు తోచుచున్నది. ఇంతవరకు ప్రభుత్వము దాని ప్రసక్తే ఎత్తుకున్నట్లు కన్పించదు. చేనేత పారిశ్రామికులు ప్రభుత్వము యొక్క డబ్బు కోసము ఆశించుకొని ఉండలేదు. ప్రభుత్వము డబ్బు ఆ కార్పొరేషనులో పెట్టమని గూడ కోరడములేదు. వారు కోరేది యేమిటంటే, యిప్పుడు కో ఆపరేటివ్ సొసైటీల అన్నింటిలో ఉన్న reserves ను మాత్రము ఒకచోట కేంద్రీకరించి ఆ కార్పొరేషనులో పెట్టమని కోరుతున్నారు. ఇది చేయుట ప్రభుత్వానికి అసాధ్యమైన పనికాదు. ఆ విషయములో ప్రభుత్వము ఏ జోక్యము కలిగించుకొనక పోవడము చాలా శోచనీయముగా ఉన్నది. ఇది చేయకపోతే, కనీసము హాస్యాస్పదముగ నుండునని ఊహించవలసివచ్చును. Textile పరిశ్రమను వృద్ధి పరచుటకు ఒక Training Centre అయినా ఏర్పాటు చేయమని కోరియున్నాను. ఇటువంటి ట్రైనింగు సెంటరు మన ఆంధ్ర దేశానికి లేనే లేదు. ఇదియును గాక ఒక Bleaching మరియు, Calendering centre చేనేత గుడ్డలకుగాను స్థాపించవలసినదిగా కోరినాను. లాభదాయకమైనవి. ఇటువంటి సెంటరు పారిశ్రామికులకు, వాళ్లు తయారుచేయు గుడ్డలకు ఎంతో ఉపయోగకరముగా ఉంటుంది. వారి గుడ్డల అభివృద్ధికి వేరొక మార్గములేదు. ఈ సెంటరును అందరికి సెంటరుగా ఉన్న బెజవాడలో కాని లేక ఏ నదీప్రాంతముగా ఉన్న చోటునో, అంటే యిక్కడ కర్నూలులోనో, లేక తాడిపత్రి, పామిడిలోనో, యీ చేనేత వర్గమువారు ఎక్కువగా ఉండే ప్రదేశాలలో యీ సెంటరును ఏర్పాటుచేస్తే, వారికి ఎంతో ఉపయోగకరముగా ఉంటుంది. ఈ పరిశ్రమకు మంచి నీరు ఎక్కువగా అవసరము. కాబట్టి నదీప్రాంతములలోనే యీ సెంటరును ఏర్పాటుచేయుట చాలా ముఖ్యము. ఇటువంటి సెంటరును ఏర్పాటుచేస్తే, చేనేత వర్గానికి పనిపాట్లు గూడ ప్రభుత్వము కల్పించటానికి అవకాశము కలుగుతుంది. ప్రభుత్వము చేనేత వర్గానికి యిటువంటి అభివృద్ధికరమైన పనిచేస్తారని ఆశిస్తున్నాను. ఇది గాక చేనేత పని చేసేవారు యితర జాతులలోకూడ ఉన్నారు. ప్రభుత్వము వెనుకబడిన జాతులకు, హరిజనులకు, గిరిజనులకు ఎన్నో సౌకర్యాలు కలిగిస్తున్నది. కాని అవి అంత తృప్తికరముగాలేవు. వారియొక్క పిల్లలు స్కూలులలోగాని, కాలేజీలలోగాని చదువుకొను వీలులేక పోతున్నారు. ముఖ్యముగ వెనుకబడిన జాతుల విద్యార్థులు కాలేజీలలోను, హైస్కూళ్లలోను విద్యా వేతనములు అందకుండా బాధపడుతున్నారు. సంవత్సరము అంతా శ్రమపడినను చిట్ట చివరకు పరీక్షలకు డబ్బు కట్టటానికి బిక్షము ఎత్తవలసి

వస్తున్నది. ఈ వెనుకబడిన జాతులకు విద్యాభివృద్ధి విషయములో ముందుకు రావటానికి విద్యా వేతనములు యిచ్చి, తగు ప్రయత్నము ప్రభుత్వము చేస్తారని ఆశిస్తున్నాను.

తరువాత జమీందారి ఏరియాలలో పనిచేస్తున్న మునసబు కరణములకు డెల్టా ఏరియాలలోను రైత్వారి మెట్ట ప్రాంతాలలోని వారికన్న చాలా తక్కువ జీతాలు యిస్తున్నారు. ఇలాంటి భేదములేకుండా తగ్గించి, అందరికి సమానస్థాయిలో జీతములు యిచ్చేటట్లుగా ప్రభుత్వము ఏర్పాటుచేయాలని అంటున్నాను. మునసబు, కరణములకు కనీసం N. G. O's కు యిచ్చే వైద్య, విద్య సౌకర్యములు ప్రభుత్వం కల్పించే ఉత్తరువులు చేయించాలని కోరుచున్నాను.

తరువాత వ్యవసాయ కూలీలను గురించిచూస్తే, వారికి యింతవరకు కనీసవేతనముల చట్టమును తీసుకొని వస్తామని ప్రభుత్వము అంటున్నారేకాని, ఆ చట్టము యింతవరకు తేబడలేదు. ఈ విషయంలో ఒక బిల్లును వెంటనే ప్రవేశపెట్టి, వారికి యిచ్చే వేతనములు యింత అని నిర్ణయించి, ఆ వేతనములతో వారికి జీవనోపాధి జరిగేటట్లుగా చేయాలని కోరుతున్నాను. వారికి కనీసవేతనముల బిల్లును తీసుకొని రావటానికి ఎంతో కాలముగా ఆందోళన చేస్తున్నారు. ప్రభుత్వము యీ విషయములో తగు శ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను పల్లెలకు రోడ్ల సౌకర్యము, వైద్య సౌకర్యము; పశువుల రోగ-చికిత్స ఆస్పత్రులను అభివృద్ధిచేయుటకు ప్రభుత్వం తమ దృష్టిని కేంద్రీకరించవలయును.

హరిజనులు గిరిజనులకు వెనుకబడిన జాతులవారికి కూడ ఒక ఉన్నతస్థాయిలో ప్రణాళికలనువేసి వారి ఆర్థిక అభివృద్ధికి, విద్యాభివృద్ధికి, యిళ్లవసతికి, తగిన ఏర్పాటులు చేయటానికి, చిన్న చిన్న పరిశ్రమలను అభివృద్ధిపరచి కావలసిన మొత్తమును గూడ కేటాయిస్తారని ఆశిస్తూన్నాను. మేజరు పంచాయితీలలో మంచి నీటి సౌకర్యము, డ్రెయినేజ్ పథకములు అమలుపరచుటకు వెంటనే ప్రభుత్వము ఒక ప్రణాళిక తయారుచేయించి పంచాయితీలను అభివృద్ధిచేయవలయును. ఇంతటితో విరమించుచున్నాను.

SRI C. V. SURYANARAYANA RAJU :—అధ్యక్షా, బడ్జట్టుపై నేను మాట్లాడేముందు తమ దృష్టికి ఒక విషయం తీసుకురావలసి యున్నది. గత సంవత్సరం బడ్జటు discussions proceedings మా కెవ్వరికీ అందించలేదు. క్రిందటిమాటు demands పైన మేము చెప్పినప్పుడు మంత్రులు కొన్ని వాగ్దానాలు చేశారు. అది వారి దృష్టికి తీసుకువద్దామంటే ఆ proceedings తాలూకు కాపీలు ఇంతవఱకూ మాకు అందలేదు. Library లోకూడా పెట్టలేదు. Administration

Sri C. V. Suryanarayana Raju] [7th March 1956

Report ఫిబ్రవరిలో publish చేశారు. Paper లో పడింది. సభ్యులెవ్వరికీ చేరలేదు. ఈ బడ్జెటు బోధపడలేదని చాలామంది complain చేస్తున్నారు. Complain చేసినవారిలో నేనుఒకణ్ణి అనుకోండి కాని ఆ administration reports అయినా యిస్తే మేము చదువుకుని అవగాహన చేసుకొనుటకు సావకాశం ఉంటుంది. Paper లో ఫిబ్రవరి 24 తారీఖున publish అయింది ఇంతవరకూ ఆ copies మాకు చేరలేదు. వెంటనే అందజేసేలా ఉంటే అవి చూడటానికి సావకాశం ఉండేది. ఈ budget మాకు తెలుగులో ఇచ్చారు. చాలా సంతోషించాం. క్రొత్త పన్నులు ఏవీ లేవన్నారు గాని చెరకు మీద టన్నుకు 3 రూపాయిలు వేశాం అన్నారు. అది factory వాళ్ల మీద పడుతుందో లేక రైతులమీద పడుతుందో చెప్పలేకుండా ఉన్నాము. మన ఆంధ్రదేశంలో Sugar Industry చాలా ప్రాధాన్యంలోకి వస్తుంది. ఇప్పుడప్పుడే 8 factory లు పనిచేస్తున్నాయి. ఇంకా నాలుగు factory లో, 5 factory లో పెట్టబోతున్నారు. ఈసమయంలో ఈ 3 రూపాయిల పన్ను చెరకు ఉత్పత్తిదారుమీద పడిందంటే అతడు ఎట్లా ముందుకుపోగలడు? రెండో పంచవర్ష ప్రణాళికలో 9 లక్షల టన్నులు అదనంగా పండించాలని మీరే చెప్పారు. కాని Factory వారు మాకిచ్చే ధరలో, పన్నులువేస్తున్నారని అప్పుడే తగ్గించేశారు. అది మీ దృష్టికి తీసుకువస్తున్నాను. ఇదివరకు 2-8-0 ఇచ్చేవారు. పన్నులు మామీద వేస్తున్నారు. అది మేము ఇచ్చుకోవలసి వస్తుంది. మీకు ఈ సంవత్సరం 39 రూపాయిలు ఇస్తామని చెప్పి అన్ని factory ల వాళ్లు ధర తగ్గించారు. Indirect గా అది చెరకు ఉత్పత్తిదారు మీదే పడుతుంది కాని factory వారిమీద పడుతుందని మాకు నమ్మకం లేదు. ఇప్పుడు ఈ 5 factory ల విషయంలో 10 లక్షల రూపాయిలు ఎవరైతే పనులు చేస్తారో వారికి మేము 20 లక్షల రూపాయిలు share ధనంగా ఇచ్చి సహాయం చేస్తామని చెప్పారు కాని February 17 తారీఖున ఇక్కడ ఒక conference పిలిచి 60 లక్షల రూపాయిలు 5 factory లు పంచుకోండి, మిగిలిన share ధనం ప్రోగుచేసుకోండని చెప్పారు. కాని ఆ share ధనము పోగుచేసే స్థితిలో ఏ factory కూడ లేదని తమకు నేను మనవిచేస్తున్నాను ఆ factory పెద్దవారి చేతులలో ఉంటుందికాని, చిన్న రైతులు share ధనం కట్టలేకపోవడంచేత ఆ చిన్న రైతుకు factory లో చెరకు ఆడుకోడానికిగాని, అమ్ముకోడానికి గాని సావకాశం లేకుండాపోతుంది. దానికి తార్కాణం ఈసంవత్సరం మీరే ఆరు conference లు పిల్చారు. చెరకు factory areas లో reserved areas పెట్టారు. ఈ reserved areas ను control చెయ్యలేక పోయాం. ఆ సమయంలోనే Central Government, State Control Act ను repeal చేశారు. ఇప్పుడు పెద్ద పెద్ద రైతులు ఎక్కువ share లు

తీసుకుని వాళ్ల చెరుకువారి factory లోనే ఆడుకుంటున్నారు. చిన్న రైతులు అంటే ఎకరం, రెండెకరాలు ఉండేవారు ఏమీ చేసుకోలేకపోతున్నారు. దానికి నా సలహా ఏమిటంటే చిన్నరైతులు share ధనం కట్టుకోలేనప్పుడు వారి Co-operative సంస్థల ద్వారా గాని, లేకపోతే వారి భూమి తనఖా తీసుకుని వారి share ధనం కట్టి 5 సంవత్సరాలలోనో 6 సంవత్సరాలలోనో అప్పుతీర్చుకొనే లాగ ఏర్పాటుచేసి అందులో వారి shares లభించేలా చేసినప్పుడే రైతులు ఎక్కువ ఉత్సాహంగా చెరుకుపంట అధికంగా పండించుటకు ముందుకువస్తారు. ఇప్పుడు ఈ 5 factory లు సాధించలేవేమోనని భయంగా ఉన్నది. Planning మంత్రిగారు ఏమిచెప్పారంటే నవంబరునెలలోగా 3 లక్షల రూపాయిలు ఎవరైతే సేకరిస్తారో వారికి తప్పకుండా మేము 20 లక్షల రూపాయిలు సహాయం చేస్తామని చెప్పారు. Conference లో కోస్తాజిల్లాలలో మూడు factory లు 5 లక్షలు తీసుకోండి, రాయలసీమ రెండు factoryలు 6 లక్షలు తీసుకోండి అని చెప్పారు. 20 లక్షల రూ. share ధనం రెండు మూడు తాలూకాలలో తేవడం చాలా కష్టం. తమ రిపోర్టులో ఇప్పుడు పండించే చెరుకు కాక ఇంకా 9 లక్షల టన్నులు అధికంగా పండించాల న్నారు. ఆంధ్రదేశంలో చెరుకు 60 వేల ఎకరాలలో పండిస్తున్నాం. ఎకరానికి 80 టన్నుల చొప్పున 18 లక్షల టన్నులు మనం పండిస్తున్నాం. ఈ 18 లక్షల టన్నులలో మనం పంచదారగా తయారుచేసేది 7 లక్షల 50 వేల టన్నులు క్రొత్త factory లువస్తే ఇంకో 5 లక్షల టన్నుల కన్న ఎక్కువ తయారు చెయ్యలేము. మొత్తం 12 లక్షల 50 వేల టన్నులే మనం తయారు చేయకలుగుతాము. ఇంకా 6 లక్షల 7 లక్షల టన్నులు మిగిలిపోతుంది. బెల్లానికి ధర లేదు. కొంతమంది చేతులలోనే ఈ factory లు పెట్టడం వల్ల వారికే ఆ డబ్బు ముట్టుతుంది. కాని ప్రక్కనున్న రైతులకు ముట్టడం లేదు. అందుచేత factory లు స్థాపించినప్పుడు Co-operative basis మీద register చేసి ప్రతి వ్యక్తికీ ఇన్ని shares కన్న ఎక్కువ ఉండకూడదని చెప్పి ఒక నిర్ణయంచేసి చిన్న రైతులకు సహాయం చేయడం మంచిదని సలహా ఇస్తున్నాను. మన ఆంధ్రదేశంలో ఈ Sugar Industry ను develop చేయడం వల్ల రైతుకే గాక గవర్నమెంటువారికిగూడ చాలాలాభంవస్తుంది. గవర్నమెంటువారికి ఈ పరిశ్రమ బాగా అభివృద్ధియైతే గవర్నమెంటువారికి కోటి రూపాయిల వరకూ పన్ను లభించవచ్చు. Development schemes March 31 తో అయిపోతాయని Planning మంత్రిగారు క్రిందటి సమావేశంలో చెప్పారు. Development ని గురించి ఫిబ్రవరి నెలలో కలెక్టర్లకు అందరకూ G. O. issue చేశారు. మా permission లేకుండా ఎవరైనా ముందుకు వస్తే మీరు పనులు చెయ్యొండని చెప్పి, మేమంతా బయల్దేరి వెళ్ళి వారితో చెప్పాం. కాని ఏమీ లాభం

Sri C. V. Suryanarayana Raju] [7th March 1956

లేకపోయింది. మాదగ్గర estimates లేవు. Estimates లేకుండా ఏ పనీ చేయడానికి లేదు. అందుచేత ఆ డబ్బు ఏమవుతుందో మాకు తెలియదు. రెండు సంవత్సరాల పాటు development schemes ఉండవని మన మంత్రి వెంకట్రావుగారు మనతో చెప్పారు. కాని ఈరోజు proposals లో చూస్తే రెండో సంవత్సరంలో 35 లక్షల రూపాయిలు Central Government నుంచి మనకు జమ కట్టినట్లు కనిపిస్తూంది. అంటే వచ్చే సంవత్సరం కూడా Development schemes ఉంటాయో ఉండవో మాకు తెలియకుండా ఉన్నది. Chief Minister గారిచ్చిన పుస్తకంలో కొన్ని గ్రామాలలో రోడ్లు, ఆసుపత్రులు పెట్టమంటే, అడిగే రోజులు పోయాయని చెప్పారు. గత సంవత్సరంలో ప్రతి గ్రామంలో ఒక గ్రామ plan అనీ, తాలూకా plan అనీ, జిల్లా plan అనీ తయారుచేయమని చెప్పారు అప్పుడు ప్రతి గ్రామంలో కూడ మాకు ఒక ఆసుపత్రో, స్కూలో, నుయ్యో, చెరువో ఏదో ఒకటి కావాలని అడిగారు. కాని బడ్జెటులో ఆ plan లు దృష్టిలో పెట్టుకుని వాటికి ఏమీ స్థానం ఇచ్చినట్లు కనుపించడంలేదు. ఇకముందైనా ఆ జిల్లా కమిటీలు, తాలూకా కమిటీలు ఇచ్చే సలహాలకు విలువ ఇవ్వాలని మేము కోరుతున్నాం. Irrigation projects brochure అని ఒకటి ఇచ్చారు. అందులో minor irrigation schemes 123 చేశారు. Under the active consideration of the Government అన్నారు. ఈ Budget లో చూస్తే ఆ 123 లో ఒక work కూడా కనిపించదు. ఈ సంవత్సరం వాటిలో జిల్లాకు ఒకటైనా వస్తుందని ఆశించాం. అది కాకుండా medium schemes అని 51 ఇచ్చారు. ఆ medium దానిలో కూడా ఒకటో రెండో ఉన్నాయి. పన్నులువేసినప్పటికీ ఏదైనా అభివృద్ధి ఉంటుందని అందరూ ఆశించారు. ఆదాయం పెరిగినట్లే ఖర్చు పెరిగింది. ఈ ఖర్చు జీతాలకు, allowances పెరిగింది కాని works లో పెరగలేదు. ఒక చోట చూస్తే జీతాలు 36 లక్షలైతే allowances 38 లక్షలని చూపెట్టారు. అది తప్పుగా పడిందేమో నాకు తెలియదు. అది మీ దృష్టికి తీసుకువస్తాను. ఆంధ్రదేశంలో పరిశ్రమలు అభివృద్ధిచేయాలని ముఖ్యంగా ఈ sugar పరిశ్రమకు చాలా ప్రోత్సాహం ఇవ్వాలని కోరుతున్నాను.

MR. SPEAKER :—I Adjourn the House to meet again at 8-30 a.m. to-morrow. (The House then adjourned.)

# APPENDIX.

*(Vide answer to Legislative Assembly Question No.* 264 *(Starred) By Sri V. Visweswara Rao, M.L.A. at Page* 1 *supra.*

Copy of the Rule 4 of the rules relating to

Assessment of grant by Schools.

4. Assessment of Grants :—(1) No grant shall be calculated for any teacher in a School with an average total attendance of less than twenty pupils.

(2) Grant shall be allowed at the rate of one teacher for every twenty pupils in average attendance and where the average attendance exceeds twenty or multiples of twenty, one more teacher may be allowed provided that the excess is ten or more only.

(3) (a) Grant shall in no case, be calculated under sub-rule (2) for more teachers than there are standards or sections in the School or than are actually employed in the school, whichever is less. No standard or section shall, unless the average attendance therein exceeds 35, he divided into two sections. In the case of an aided elementary school having ten sections or more grant may be assessed with effect from 1st January 1946 for an additional teacher.

(b) In the case of schools which work in two shifts adopting the shift system the provisions of sub-rules (1), (2) and (3) (a) above shall not apply. The number of teachers for whom grants should be assessed should be fixed by the Deputy Inspector who shall fix the number with reference to the average strength and attendance as shown in the monthly returns of the school. This shall be done in the first week of January and July of each year with reference to the returns for the preceding six months, and the number so fixed shall be communicated to the managers. Appointment of additional teachers over this number, if necessary, should be made only with the approval of the Deputy

Inspector and reductions in the staff as fixed by the Inspecting Officers should also be reported by the managements to the Inspecting Officers within ten days of such changes. While one teacher may be allowed for every 30 pupils in attendance, the inspecting officer may fix the number of teachers admissible for grants at a slightly lower or higher rate for valid reasons to be recorded. An appeal shall lie to the District Educational Officer against the orders of the Deputy Inspector shall be in whole numbers only.

*Note* :—This and the previous sub-rule will not apply to Prevocational Instructors employed in aided Higher Elementary Schools, who shall be considered as additional teachers over and above the number of teachers admissible for the schools for purposes of assessment of grants for the schools.

(4) If the number of teachers employed in a School is greater than the number of standards or sections in the School or than the number for whom grant may be calculated under sub-rule (2) the teacher or teachers most junior shall be excluded from the calculation of the grant in whole or in part.